భారతేతిహాసమందలి

# షష్ఠపత్రములు














మూలం:
స్వాతంత్ర్యవీర
శ్రీ వి. డి. సావర్కార్.

అనువాదం:
మహాకవి, సరస్వతీపుత్ర
శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు.

భారతేతిహాసమండలి

# స్వర్ణపత్రములు






మూలం:
స్వాతంత్ర్యవీర
శ్రీ వి. డి. సావర్కర్.

అనువాదం:
మహాకవి, సరస్వతీపుత్ర
శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు.

# నివేదన



శక, హూణాది విదేశీ దురాక్రమణదారు లందరినీ తరిమికొట్టి జాతిని రక్షించిన చంద్రగుప్త, పుష్యమిత్ర, విక్రమాదిత్య, యశోధర్మాది భారతవీరుల విజయ గాథలను అభివర్ణించే స్ఫూర్తిప్రదమగు చారిత్రక పరిశోధక గ్రంథం వీర సావర్కారు మరాఠీభాషలో రచించిన "భారతీయ ఇతిహాసాంతిల్ సహాసోనేరీ పానే". భారతచరిత్ర రచనలో ఒక నూతనాధ్యాయాన్ని సృష్టించిన అట్టి అమూల్య గ్రంథాన్ని తెలుగు పాఠక లోకానికి అందించుటకు ఆనందిస్తున్నాం. అనువదించి ప్రచురించడానికి అనుమతించిన వీరసావర్కారుగారికి, చక్కని తెలుగు అనువాదాన్ని చేసి ఇచ్చిన ప్రసిద్ధ కవులు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారికి, అడిగినదే తడవుగా ఉపోద్ఘాతాన్ని పంపిన ప్రముఖ చారిత్రకపరిశోధకులు డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారికి ఈ శుభసమయంలో మా హార్దిక ధన్యవాదాలను అర్పిస్తున్నాం.

—ప్రకాశకులు.

# ఉపోద్ఘాతము



భారతదేశ చరిత్ర రచన నిన్న మొన్నటి వరకును ఆంగ్లేయుల ప్రభావమునందే యుండుటవలన సంతృప్తికరముగ నుండలేదనియే చెప్పవచ్చును. విన్ సెంట్ స్మిత్ రచించిన ఆక్స్ఫర్డు ఇండియా చరిత్రయు, పలువురు పాశ్చాత్యులు కలిసి రచించిన కేంబ్రిడ్జి ఇండియా చరిత్రయు భారతీయ దృక్పథమునకు ఎంతమాత్రమును అవకాశము నొసగలేదు. సత్యచరిత్రయనియు, పక్షపాతములేని రచన యనియు యెంత గట్టిగ నొక్కి చెప్పినను పాశ్చాత్యులే తమతమ దేశ చరిత్రలను రచించినపుడు అన్యదేశముల దూషణకును (అవి పాశ్చాత్య దేశములే యైనను) అతిశయోక్తి ఉత్ప్రేక్షలకును తావొసంగుదురు. అందువలననే ఫ్రెంచివారురచించిన జర్మనుదేశ చరిత్రనుగాని, జర్మనీవారు రచించిన ఫ్రాన్సు దేశ చరిత్రనుగాని చదివి సత్యచరిత్ర లభ్యమైనదని తలచుటకు సాధ్యముగాదు. అట్టిచో బానిసలుగనో, కనీసము తక్కువ జాతులవారిగనో భావించిన ప్రాచ్యదేశముల చరిత్రలను పాశ్చాత్యులు సంతృప్తికరముగ రచించిరని చెప్పుట అసాధ్యము.

ఇటీవల భారతీయులే తమ చరిత్రను పరిశోధించుటకును, రచించుటకును బూనుకొనిరి. కాని నిన్న మొన్నటి వరకును భావదాస్యమున మునిగి తేలుచు పాశ్చాత్య ప్రభావమునకు సమగ్రముగ లోనైయుండిన కొందరు విద్యాధికులును, చారిత్రకులును (వారు భారతీయులైనను) పాతవారి అడుగుజాడలనే త్రొక్కుచు, ఒకటి రెండు విషయములలో తాము క్రొత్తదారిని త్రొక్కినంతమాత్రననే తమ రచనకు ఒక ప్రత్యేకత వచ్చినదని సంతసిల్లుచున్నారు. మరి కొందరు ప్రధానవిషయములను వదలివైచి చిల్లర విషయములపైననే దృష్టి కేంద్రీకరించి యెంతయో చాతుర్యముతో గొప్ప గ్రంథములను రచించి పండితాదరమును బడసిరి కాని వీరి రచనలు జనసామాన్యమునకు రక్తిగట్టింపవాయెను. ఇంకను

కొందరు చరిత్రకాధారములను సేకరించుటయందే కాలము గడుపుచు ఇంకను చరిత్ర రచనకు పూనుకొనరైరి.

భారతీయ రచనకు అవసరమైన భారతీయ దృక్పథము యింకను చరిత్ర రచయితలలో అలవడలేదనియే చెప్పవచ్చును. ప్రాంతీయ దృష్టితోగాని; జాతి, మత దృష్టితోగాని రచన సాగినపుడు భారతీయ చరిత్ర సౌష్ఠవముగ రచింపబడినదని చెప్పుటకు వీలులేదు. విశాల భారతదేశమునందున్న నానాప్రాంతములవారును ఎవరికివారే తమ ప్రాంత చరిత్ర యందలి ఉజ్వల ఘట్టములనుమాత్రము స్మరించుకొనుచు అన్య ప్రాంతము లందలి లోపములను మాత్రము స్మరించుకొనుచు చరిత్ర రచన సాగించినయెడల సమగ్ర భారతదేశ చరిత్ర రచింపబడదు. అందు వలననే ఇటీవల కొన్ని ప్రాంతముల చరిత్ర ప్రచురితమై ఆయా ప్రాంతీ యుల ఆదరాభిమానములకు లోనైనను సమగ్ర చారిత్రక దృష్టితో గాని, యావద్భారత దృష్టితోగాని చూచినపుడు అసంతృప్తికరముగ గాన్పించు చున్నది. మతదృష్టితో చరిత్రను రచించి; అశోకచక్రవర్తి బుద్ధమతస్థుడు గాదనియు, జైనమత మవలంబించెననియు అతని శాసనములకు విపరీత వ్యాఖ్యానముచేసి నాలుగు సంపుటముల మహాగ్రంథమును ఒక రచయిత ప్రచురించెననగా ఇక ఇట్టి మూర్ఖప్రయత్నములనుగూర్చి చెప్ప నవసరమే లేదు. అట్టి మూర్ఖులను ప్రతిఘటించుటకు బయలుదేరిన మరికొందరు అశోకుడు చేసిన బౌద్ధమత ప్రచారమును అతిశయముగ వర్ణించుటతో తృప్తినొందక అతడు భారతదేశమునకు చేసిన మేలు మరి యెవ్వరును చేయలేదనియు, అతడుచేసినదంతయు, మంచియే అనియు వాదించుచు లోపము లేవైన ఉన్నవా యని ఎవరైన పరిశీలించుటకు బూనుకొనిన యెడల దేశద్రోహి అని ఆగ్రహించుటకూడ కలదు.

శాస్త్ర దృష్టితో పరిశీలించిన యెడల భారతదేశ చరిత్రను రెండు ప్రధాన భాగములుగ విభజింపవచ్చును. మొదటిది - అనాదిగ సుమారు ఐదు లేక ఆరు వందల సంవత్సరముల వరకును (కొన్ని ప్రాంతము లలో ఒకటి రెండు వందలు యింకను అధికముగ నుండవచ్చును) వేల కొలది సంవత్సరములుగ వెలసిన స్వతంత్రయుగము. రెండవది- ఇటీవల

కొన్ని శతాబ్దులుగనున్న దాస్యయుగము, మహమ్మదీయులకును పాశ్చాత్యులకును ఈరెండవ యుగము ప్రధానమైనది. ఏలయన - వారి సామ్రాజ్యము మన దాస్యముపై నాధారపడి యుండెను. అందునను ముఖ్యముగ ఇంగ్లాండువారు మనల నోడించి మనదేశమును కైవసము చేసికొనిన పిదపనే సకలైశ్వర్యములను సంపాదించి ప్రపంచమున అగ్రస్థానము నాక్రమించుకొనిరి. కాబట్టి వారు రచించిన చరిత్రలలో ఈభాగమునకే ఎక్కువ ప్రాధాన్యము నొసగి చాలవరకు మన దేశచరిత్ర ఈ దాస్య యుగ చరిత్రయే అను అపోహ ప్రబలుటకు కారణభూతులైరి. వారి యడుగుజాడలు త్రొక్కిన మనలో చాలమందికూడ ఈరీతిగనే స్వతంత్ర యుగచరిత్రను కొలదిగ స్మరించి చాలవరకు దాస్యయుగ చరిత్రకే ప్రాధాన్యత యొసగుచున్నాము. భారతదేశ చరిత్ర గ్రంథములను పరీక్షించిన ప్రథమ భాగము సంగ్రహముగ రెండు మూడు వందల పుటలలో పూర్తిచేసి దాస్యయుగ చరిత్రకు ఏడెనిమిది వందల పుటలు కేటాయించినట్లు కనబడును. విశ్వవిద్యాలయములందును. పాఠశాలల యందును భారత దేశ చరిత్ర పఠనయందుగూడ ఈ విశేషము గాన్పించుచున్నది. ఐచ్ఛిక భాగమును ఏరుకొనునప్పుడుగూడ ఉజ్వల చరిత్రను వదలివైచి దాస్యయుగమునందలి వివిధ భాగములనే ఏరుకొనుచున్నారు.

స్వతంత్రయుగచరిత్ర రచనగాని. పఠనగాని అంత సులభసాధ్యమైన పనిగాదు. కాని అంతమాత్రముచేతనే దానిని వదలివైచుట ప్రాజ్ఞులకు తగదు. ఎన్నియో స్వర్ణయుగములతోను, ఉజ్జ్వల ఘట్టములతోను వెలయుచున్న భారతదేశ స్వతంత్రయుగచరిత్రను సరిగ అవగాహన చేసికొనుటకాని, సింహావలోకన మొనర్చి ఆ స్వరూప, స్వభావములను గుర్తించుటగాని కొంత అధికశ్రమకు లోనై గతానుగతికముగ వచ్చిన భావములను వదలించుకొని, యావద్భారత దృష్టిని, శాస్త్రీయ చారిత్రక దృష్టిని అలవరచుకొని సత్యాన్వేషణకు పూనుకొనినగాని సాధ్యముగాదు. అట్టిపని పూనుకొనుటకు తగు మేధావులు భారతదేశమున ఎందరో గలరు. వారి పరిశీలనయు, రచనలున్ను ఇంకను జనసామాన్యమునకు అందకుండుటకు కారణము మనలో ఇంకను

ప్రబలియున్న పాశ్చాత్య వాతావరణమే. అట్టివారిలో మేటి యనదగు వీరుడు సావర్కారు. వీరి జీవితము భారతీయుల అధునాతన చరిత్రయందొక మహత్తర ఘట్టమనియే చెప్పవచ్చును. చరిత్ర రచయితలలో ముందంజవేసి, భారతీయ దృక్పథము ఒకటి ఉన్నదని ప్రజలలో నాటి జెప్పిన బోసు మొదలగువారిలో సావర్కారు అగ్రగణ్యుడు. ఇతని గ్రంథములు ప్రథమమున ఇంగ్లీషులో వ్రాయబడినను ఇతర భాషలలోను అనువాదమునొంది పండితులను, పామరులనుగూడ ఆకర్షించి ప్రసిద్ధివడసినవి. స్వర్ణపత్రములను గ్రంథము ఇంతవరకును తెనుగులో ప్రచురింపబడకుండుటయే ఆశ్చర్యకరము. నేటికి ఈ తీరని లోపము నివారింపబడి సుప్రసిద్ధ తెనుగు రచయితలు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారి అనువాదక నైపుణ్యమువలనను, జాగృతి ప్రచురణ కర్తల చారిత్రకాభిమానమువలనను ఆంధ్ర సారస్వతమున ఒక అమూల్యగ్రంథము ప్రచురితమైనది.

ఈ గ్రంథమునందు భారతదేశ చరిత్రయందలి స్వతంత్రయుగమునకు చెందిన నాలుగు ప్రధాన ఘట్టములు చర్చింపబడినవి. మొదటి ఘట్టము-అలెగ్జాండరు దండయాత్రవలన మన దేశమునకు సంభవించిన పరాజయము; అనతి కాలములోనే మౌర్యచంద్రగుప్తుడును, ఆచార్య చాణక్యుడును అసమానమైన పరాక్రమముచేతను రాజనీతిచేతను భారత దేశమునందలి పశ్చిమోత్తర భాగమునకు కలిగిన పరదాస్యమును పోగొట్టి యావద్భారతమునకును ఏకచ్ఛత్రాధిపత్యమును వహించుటకు ప్రయత్నించి చాలవరకు సఫలముచెందుట; రెంతవది-పుష్యమిత్రుడు యవనుల దండయాత్రలను ఎదిరించి స్వాతంత్ర్యమును సుస్థిరముచేయుట. మూడవఘట్టము - శక, కుషాణాది విదేశీయుల నెదిరించి చంద్రగుప్త విక్రమాదిత్యుడు భారతదేశమున గుప్తసామ్రాజ్యము స్వర్ణయుగమని ప్రసిద్ధిగాంచుటకు ఒనరించిన మహాకార్యములు. నాలుగవది : ప్రాచ్య పాశ్చాత్య దేశములందంతటను క్రూరాతి క్రూరులని పేరుగాంచిన హూణులను ఎదుర్కొని దేశ స్వాతంత్ర్యమును నిలబెట్టిన యశోధర్ముని అప్రతిహత పరాక్రమగాథ.

సావర్కార్‌గారి గ్రంథము చిన్నతరగతి పాఠ్యపుస్తకముకాదు. ఇది పండితులకును, పామరులకునుకూడ మన దేశ చరిత్రయందలి ఉజ్జ్వల ఘట్టములను తెలిసికొనగోరువారికి సువిశదముగ చర్చించి విశదీకరించిన సారస్వత విశేషము. సావర్కారుగారి చారిత్రకజ్ఞానము, అకుంఠితమైన ప్రతిభ, దేశప్రేమ, స్వాతంత్ర్యాభిరుచి - ఇవన్నియు ఈ గ్రంథమునందు సువ్యక్తమగుచున్నవి. నట్టడివినుండి లెక్కలేనన్ని చెట్లను చూచి చూచి విసుగుజెంది అడవి వైశాల్యమునుగాని, పొడవు వెడల్పులనుగాని గుర్తించలేనట్లుగ అగాధమగు చారిత్రక వాదములలో బడిపోయి ప్రథాన విషయములను సరియైన దృక్పథముతో గాంచలేని పండితులకును, విషయ విభజనలేక విషయబాహుళ్యమువలన విసుగు జెంది అసలు చరిత్రయే వలదని ఔదాశీన్యము వహించు రాజకీయవేత్తలకును ఈ గ్రంథము అమూల్య ఔషధము. ప్రతి భారతీయుడును తప్పక చదివి మననము చేయవలసిన గ్రంథ మీ చిన్నపుస్తకము.

ఆంధ్రప్రజలు ఈ పుస్తకము నాదరించి రచయితలకును, అనువాదకులకును, ప్రచురణ కర్తలకును ఇతోధిక కృషి యొనర్చుటకు ప్రోత్సహించెదరని ఆశించుచున్నాను.

హైదరాబాదు,
1—10—'60.

పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు.
ఉస్మానియా విశ్వ విద్యాలయ చారిత్రక విభాగ అధిపతి;
కార్యదర్శి: శాస్త్ర విజ్ఞానము, చరిత్ర, తెలుగు, ఉర్దూ ఎకాడమీ, హైదరాబాదు.



# విషయ సూచిక







భారతేతిహాసమునందలి

# స్వర్ణపత్రములు

## చంద్రగుప్తుడు - చాణక్యుడు

నేటివఱ కుపలబ్ధమైన పరిశోధన సామగ్రి ననుసరించి భారతదేశ 'రాష్ట్రీయ జీవన' మనెడు నుషఃకాలము అయిదు వేల సంవత్సరములు లేక పదివేల సంవత్సరములకుఁ బూర్వమే మొదలైనది. చీనా, బాబిలోనియా, గ్రీస్, మొదలగు దేశముల ప్రాచీన రాష్ట్రీయ జీవనము వాని పురాణ కాలముతోఁ జేరిపోవును. అట్లే భారత రాష్ట్రీయ జీవన వృత్తాంతమునకుఁగూడ పురాణములతో లంకె. పురాణముల యందలి యితిహాసములలో కట్టుకథలు, అతి మానవుల యొక్క క్రీడలు, లాక్షణికములైన వర్ణనలు, అడుగడుఁగు నను చోటుచేసికొన్నది - నిజము. కాని యీ ప్రాచీన పురాణములు మన ప్రాచీనేతిహాసములయొక్క మూలస్తంభము లనుట మరచిపోదగిన విషయము మాత్రముగాదు. ప్రచండమైన యీపురాణ వాఙ్మయము, మన సాహిత్యము, విజ్ఞానము, కర్తృత్వ వైభవము మొదలగు వానినిఁ దెలుపు నొక యమోఘమైన కోశముమాత్రమే కాదు. మన జీవన వృత్తాంతముల యొక్క అస్తవ్యస్తమైన సంకలనముగూడ.

ఇంతకును బురాణములు కేవలము మన యితిహాస ములు మాత్రమే గాదు. కొంత కల్పనగూడ. అందుకే నే నిపుడు పురాణములను గురించి పేర్కొనుటలేదు. తమకు విన్నవింపఁబోవు సువర్ణమయ పత్రగాధ మన చరిత్రనుండి గ్రహించినది.

## భారతీయేతిహాసముయొక్క యారంభము

ఇతిహాసమనగా నేమి ? వానిలోని వర్ణనలు, ఘట నలు, స్థలము, కాలము మొదలైనవి కొంతకుఁ గొంత యైనను నిశ్చయముగఁ జెప్పుటకు సాధ్యపడవలెను. వాని లోని సంఘటనలు యిట్లే జరిగియు డెననుటకు - స్వకీయ ములుగాని, బరకీయములుగాని - సాక్ష్యములు సాధ్యమైనంత వఱకు సమకూరవలెను.

ఈ యొఱపిడి రాయితోఁ జూచినప్పుడు, మనకు దొరకు పుష్కలమైన సామగ్రి బుద్ధునికాలమునుండియే ! అందుకే యనేకులు భారతీయ, పాశ్చాత్య పండితులు భారతేతిహాసము బుద్ధునికాలమునుండియే యారంభమయ్యెనని పలుకుదురు. కాని మన ప్రాచ్య విద్వాంసు లంతతో వదలలేదు. అవిశ్రా మముగఁ బనిచేయుచున్నారు. వారి పరిశ్రమలకు ఫలముగ మనము ' బురాణ యుగ ' మనుకొను కాలమున జరిగిన కొన్ని సంఘటనలుగూడ, యితిహాస కాలమునందే జరిగిన వని చెప్పుటకు వీలుపడు గడియలు రావచ్చును. వారి ప్రయత్నములు పూర్ణముగ ఫలించువఱకును, బౌద్ధయుగమే మన చరిత్ర కారంభకాలమని యంగీకరింపక తప్పదు.

ఆ యుగమునందును మన ప్రాచీన రాష్ట్రీయజీవన చరిత్ర "యిదమిత్థ" మని నిర్ణయించుటకు, నాటి సమకాలికులైన యితర రాష్ట్రీయులు వ్రాసిన వ్రాతలపైఁగూడ నాధారపడవలసినదే. వారి సాహితీ విచారములు గూడ మన కుపయోగపడు సామగ్రియే. మన యితిహాస స్వరూపమును నిర్ణయించుటకు, చంద్రగుప్తుని కాలమునుండి, సమగ్రమైన సామగ్రి దొరకుచున్నది. ఇతర రాష్ట్రీయుల వ్రాతలు గూడ యీవిషయమున మనకు కావలసినంత యుపకారముఁ జేయుచున్నవి. కారణమేమన, అలెగ్జాండరు మన దేశముపై దాడివెడలిన తదుపరి గ్రీకు చరిత్రకారులు వ్రాసిన వ్రాతలలో, తదనంతరము ఇచ్చటకు వచ్చిన చైనాయాత్రికుల వ్రాతలలో - ఆనాటి మన చరిత్రకు సంబంధించిన విషయములనేకము లుపలబ్ధములగును.

## సువర్ణపత్ర మెట్టిది ?

నే నిపుడు జెప్పదలఁచుకొన్న చరిత్రలోని సువర్ణాధ్యాయము లేవి ? నేను వాని కంత గౌరవమిచ్చుటకుఁ గారణమేమి ? ఈ విషయములు విమర్శించుచుఁ బోయినచో, నా యుగములందలి మన సాహితీ సంపద, సంగీతము, వైభవోన్నతి, విపులైశ్వర్యము, ఆధ్యాత్మిక సంపత్తి మొదలగు విషయము లనేకములు మన కనుల మిఱుమిట్లు గొలుపుచు బయటఁబడును. ఒక దేశముయొక్క రాష్ట్రీయ జీవనము పారతంత్ర్యమువంటి ప్రాణసంకటమునకు లోఁబడును. ఆ దేశమును లోఁగొన్న శత్రువులు దాని రాష్ట్రీయ జీవనమును నలిపివేయుదురు. అప్పు డా దేశము తన పరాక్రమము ద్విగుణీ

కృతమొనర్చికొని, పారతంత్ర్యమునుండి ముక్తినొందుటకు శతవిధములఁ బ్రయత్నించును. ఆదేశము స్వరాజ్యమును బునరుజ్జీవన మొనర్చుకొనుటకై జేసిన పోరాటము, దానిలో వీరాఽభిమన్యులై విహరించిన స్వాతంత్ర్యయోధులు, వారి వృత్తాంతములు - యివియే చరిత్రలోని సువర్ణపత్రములు. ఏదేశమందైనను వారి చరిత్రకు గౌరవమునుఁ గూర్చున విట్టి ఘట్టములే! అమెరికాదేశమునే జూతముగాక! ఆదేశము రణాంగణమున 'నింగ్లండును' జయించి యేనాడు తమ స్వాతంత్ర్యమును నిలువఁద్రొక్కుకొన్నదో విజయోత్సాహ పూరితమైన యానాటినుండియే వారి దివ్యచరిత్ర యారంభ మైనది. ఆయుద్ధోదంతమే వారి దేశచరిత్రలో సువర్ణ పత్రము

విశాలములు, ప్రాచీనములైన రాష్ట్రములన్నియు
ఒకప్పుడు పరుల యధికారమునకు లొంగినవే!

ఇంతయైనను అమెరికాయొక్క రాష్ట్రీయజీవనము ప్రాచీనమైనదా? దానిచరిత్ర సంపదయే గోరంత. ఆ యింత చరిత్రలో పరకీయులు వారినాక్రమించిన దొకమారే! వారు దిరుగఁబడినదిగూడ యొకటేసారి. కనుక దాని రాష్ట్రీయ జీవనోదంతమునం దేమియు పసిలేదు. కాని చీనా, బాబి లోనియా, పర్షియా, ఈజిప్టు, ప్రాచీన పెరూ, ప్రాచీనమెక్సికో, గ్రీస్, రోము మొదలైన పురాతన రాష్ట్రములు సహస్రవర్ష ములుగ స్వాతంత్ర్యము ననుభవించినవి. అత్యుజ్వలమైన వారి స్వాతంత్ర్యజీవనము నరికట్టుటకుఁ బరులొనర్చిన ప్రయ త్నములుగూడ నొకమారు, రెండుమారులుగాదు; అనేక

పర్యాయములు. అప్పు డవి మరలమరలఁ బారతంత్ర్యమును సడలించికొని యుద్బుద్ధము లయ్యెను. వారి శత్రువు లెన్ని యో సారులు పూరిమేసిరి. సహస్రావధి వర్షములుగ దా మనుభ వించుచు వచ్చిన స్వాతంత్ర్యము, ప్రాబల్యము - వీని నరికట్టు టకై యపుడపుడు పరదేశవాసు లొనర్చిన ప్రయత్నములలో నా దేశవాసులు మరల స్వాతంత్ర్యసంపాదనకై జేసిన యుద్ధ ములు, సాధించిన విజయములు - యివి యొకదానికంటెను మరియొకటి జాజ్వల్యమానములైన సువర్ణపత్రములు. ఇఁక భారత దేశముయొక్క యితిహాసమన్ననో - ప్రాచీనతమ కాలమునుండి నేటివఱ కవిచ్ఛిన్నమైన యొక టేధార. పురా తనకాలమునం దొకనాఁడు అత్యంతవైభవములతో వెలిఁగి పోయిన యనేకరాష్ట్రములు, రాజ్యములు నేటికి నామావశి ష్టములే! నేఁడు కాలకబళితములై పోయిన యా రాష్ట్రములను గుఱించి యేమైనను బల్కుటకు చీనా దేశమున కొకదానికి మాత్రమే యధికారము కద్దు - అదియును - మన దేశము వలెనే ప్రాచీనతమమైనది గనుక.

చీనా, భారతము - ఈ రెండు రాష్ట్రములును నతి విస్తృతములు. ప్రాచీన కాలమునుండి ధారావాహికముగ నేటివఱకును దమ స్వాతంత్ర్యము నివి సంరక్షించుకొని వచ్చుచున్నవి. అందుచే నిట్టి యీ రెండు రాష్ట్రములపై యనేక సమయములందు శత్రువు లాక్రమించు కొనుటయుఁ, బరదాస్యమనెడు ప్రాణసంకటము సంభవించుటయుఁ గలిగి నది. అట్లు గలుగుటలో నాశ్చర్యము లేదుగూడ. సుఖ దుఃఖ ములు చక్రనేమి క్రమమున సంభవించునను న్యాయము

దేశములకుఁగూడ వర్తించును. హిందూస్థానముపైకి శకులు, హూణులు, మొగలులు మొదలగుజాతు లనేకసారులు దండెత్తి వచ్చినవి. అట్లే చీనాపైకి వీరును, మరి యితరులుగూడ దండునడిపిన పర్యాయము లనేకములు. హూణులతో సంభవించిన ప్రళయమునుండి దమ్ము రక్షించుకొనుటకుఁ జీనా దేశస్థులు జగత్ప్రసిద్ధమైన కోటనేకట్టిరి. దానికి Chinese wall (చైనా గోడ) అని ప్రసిద్ధమగు పేరు. కాని యది గూడ వారిని రక్షింపలేదు. శత్రువులు దమ బలముతో దాని నుల్లంఘించి చీనాదేశమును భాద్రాక్రాంత మొనర్చికొను పఱకును వదలినవారుగారు. ఒక్కొకసారి యంశభూతముగ, నొక్కొక్కసారి సంపూర్ణముగఁ జీనాదేశము పరదేశస్థుల పరిపాలనమునకు లోఁబడి కుములవలసివచ్చెను. కాని యప్పు డప్పుడే యది మరల నూత్నమైన తేజస్సును, చైతన్యమును ద్విగుణీకృత మొనర్చికొని యా పరకీయ బలమునుండి విముక్తమైనది. తమజీవితము, సత్త్వము, స్వాతంత్ర్యము - వీనిని నిలువద్రొక్కుకొని నేటికిని మరల నొక స్వతంత్రరాష్ట్రముగ వెలయుచున్నది. ఐతిహాసికముగ నిది గొప్పయాశ్చర్యమే! భారతీయేతిహాసముయొక్క వెలను నిర్ణయించుటకు నొఱపిడి రాయిగఁ బనికివచ్చునది చీనాదేశ మొక్కటే! కాని యాంగ్లేయులదాస్యమునఁబడి హిందూదేశము మ్రగ్గుచున్నప్పుడు పాలకులైన యాంగ్లేయులు భారతేతిహాసకథల నత్యంతవికృత రూపమున జిత్రించిరి. వారి యధికారమందున్న పాఠశాలల యందు, కళాశాలలయందు ఆ తప్పుడుచరిత్రలను మూటిమూటికిని వల్లింపఁజేసిరి. చరిత్ర కీ వికృపరూప మిచ్చుటలో వారు

ప్రదర్శించిన సామర్థ్యము నిజముగ మెచ్చుకోదగినదే! కారణ మేమనఁగా వానినిఁ జదివి సభ్యదేశములందలి యెందరో మేధావులుగూడ నా తలతిక్కకు లోఁబడిరి. అంతేగాదు; భారతీయులలోను జాలమంది కవి బుద్ధి భ్రంశమును గలుగఁజేసినవి. హిందూస్థాన చరిత్ర యనఁగా వారి దృష్టిలో భారతీయుల సతత పరదాస్య చరితయే! పరాభవములపై జరగిన పరాభవములయొక్క చిట్టాలే యీ ప్రభువులు చరిత్ర యనుపేర బోధించినది. అసత్యము లల్లుటలో వారు మహానిపుణులు. వారాశ్రయించిన హేతువులు దుష్టములు. కాని వారి చాకచక్య మేమనఁగా పరదేశస్థులేగాక భారతీయులుగూడ నా కథలు నిజములని నమ్మునట్లు చేయుటయే! కల్లల పుట్టయైన యీ చరిత్రకు సమాధాన మొసఁగుట - రాష్ట్రీయ దృష్టితోనేగాక యైతిహాసిక దృష్టితోఁగూడ నావశ్యకమైనది. ఈ ప్రయత్నమును గొంతవరకు నితరులు - యితిహాసజ్ఞులు జేయుచునేయున్నారు. కాని వాని నెక్కువ ప్రచారమునకుఁ దెచ్చుటయు నొక గొప్ప పనియే. అందుకై - "యెపు డెపుడు శత్రువులు హిందూస్థానము నాక్రమించిరి? ఆక్రమించి వారి రాజ్యసత్తా నెపుడెపుడు లోఁగొనిరి? అట్టి యీ పరదాస్య సంకటమును జీర్ణించికొని హిందూరాష్ట్రము మరల నెప్పుడెప్పుడు విముక్తమైనది? విజయవంతములైన యాయా ఘట్టములు, ఆయా విజయములకు ప్రతీకములై, యందుకుఁ బోరాడిన యుగప్రవర్తకులైన వీరుల చరిత్రలు" వీనిని నివేదించుటయే యిప్పటి నా పని.

## అలెగ్జాండరు దండయాత్ర

ఇంతకుముందు భారతదేశముయొక్క నైతిహాసిక కాల మెప్పటినుండి యారంభమగునో గొంత దెలిపితిని. ఆ దినములలో భారతముపై తొలిసారి దాడి జరపినది యలెగ్జాండరు. క్రీస్తు పూర్వము 327 వ సంవత్సరమున నీ దండయాత్ర జరిగెను. ఆనాఁడైరోపాఖండమున నేటి యింగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ మొదలైన రాష్ట్రములు బుట్టనేలేదు. రోమక సామ్రాజ్య స్థాపన జరుగనేలేదు. యూరోపునం దొక గ్రీకుదేశమే గొంత గర్జించుచుండెను. గ్రీకు నందలి చిన్న చిన్న నగర రాజ్యములు (City States) స్వతంత్రముగ నుండినవి. వానిలో స్పార్టా, యెథెన్సు మొదలగునవి ప్రముఖములు. వానిపైఁ బారశీక సామ్రాజ్యాధిపతి దండెత్తెను. పారశీక సైన్యము సుసంఘటితము, విస్తృతము, బలాఢ్యము నైనది దానిముందు, విశకలితములై "యెవరికి వారు, దామే నాయకుల" మనుకొనుచున్న స్పార్టా మొదలైన చిన్న నగర రాజ్యములు నిలువలేకపోయినవి. పరుల నెదిరించుటకీ నగర రాజ్యములు (Republics) గొప్ప ప్రయత్నమునే జేసెను. కాని పారశీక సేనా సముద్రముముందు వారి బలము నిలువలేదు. గ్రీకులు పారశీకులనుండి గుణపాఠములు నేర్చుకొన్నారు. "చిన్నచిన్న యీ నగర రాజ్యముల నన్నిటినిఁగలిపి యొక సామ్రాజ్యముగ నిర్మించి, యేకముఖముగఁ బారశీకుల నెదిరింపవలె"నను తీవ్రమగు పట్టుదల వారికిఁ గలిగెను. ఈ పట్టుదలతో మెసిడోనియా రాజైన ఫిలిప్ గ్రీకుదేశముయొక్క చిన్నచిన్న నగర రాజ్యముల

జయింప మొదలు పెట్టినాఁడు. కాని యీ యత్నము నెర వేరక ముందే యతఁడు మరణించెను. వాని తరువాత వచ్చిన కుమారుఁడు దం డికంటెను నూఱింతలు బట్టుదలగలవాఁడు. అతఁడు జయిష్ణువు - అతఁడే యలెగ్జాండరు. సమస్త గ్రీకు సామ్రాజ్యము నతఁడు నిర్మించి నవచైతన్యమును బూరిం చెను. తెగువగల సైన్యములఁ జేర్చెను. అప్పటి పారశీక రాజ్యాధిపతియగు దరాయస్‌పైకి యలెగ్జాండరు కాలు ద్రవ్వెను గ్రీకుల సైన్యము సుసంఘటితము. దరాయస్ సైన్యము బహుసంఖ్యాకమైనను క్రమశిక్షితముగాదు. అందుచే 'పారశీకులు' గ్రీకులకుఁ జిక్కిరి. విజయోద్దీప్తుఁడైన యలెగ్జాండరు, పారశీక రాజధానిపైఁ గత్తిదూసి జయిం చెను. తాను షర్షియా రాజని యలెగ్జాండ రెలుగెత్తి చాటి నాఁడు. ఈ విజయముతో నాతని రాజ్యతృష్ణ పెరిగినది. గ్రీకు, పారశీక సామ్రాజ్యములు తన చేతిలోనికి వచ్చుటతో నుత్సాహము పెరిగిన యాతఁడు జగత్తు నంతటిని జయించి - తాను జగజ్జేత ననిపించుకొనవలెనని మురిసినాఁడు. ఆత్మ విశ్వాసము ఉన్మాదమైనది. అతని కన్ను భరతఖండముపైఁ బడెను. దుర్దమ్యమగు నీ మహత్వాకాంక్షతో నతఁడు భార తము జయింపఁ దలఁచి ప్రబలమైన సైన్యమును జేర్చి కొన్నాఁడు. అతని కాలుబంట్లే యొక లక్షపై నిరువదివే లుండెనట! పదునైదువేల గుఱ్ఱపు దళము! అపజయమను మాట అలెగ్జాండ రెఱుఁగనే యెఱుఁగఁడు. ఆతని విజయపరం పరను జూచి యాశ్చర్యముఁగొన్న గ్రీకుసైనికులు అలెగ్జాం డరు దివ్యపురుషుఁడని దలంచిరి, అతఁడుఁగూడ తాను డ్యు(డ్యూః) దేవతయొక్క పుత్రుఁడనని భావింపఁ దొడఁగెను.

## నాటి భారతదేశ స్వరూపము

ఈ సంఘటనము జరిగినది 2500 ల సంవత్సరముల ముందు. నాడు సింధునది కావ్వైపు 'ఇరానీ' దేశమువఱకును భారతీయుల నివాసములు, రాజ్యములు వ్యాపించియుండెను. నేడు మనము, హిందూకుశ పర్వతము లనువానిని, నాటి గ్రీకులు "పరోపనిసస్" (Paropnisus) అని పిలచిరి. నేటి ఆఫ్ఘనిస్థానము నాడు గాంధార మనుపేరుతో నుండెను. మన ప్రాచీనులు దానిని 'అహిగణస్థాన'మన్నారు. కాబూలు నందలి నదిని మనవారు కుభా యని పిలచిరి. నాడు హిందూకుశ పర్వతములవఱకును భారతీయుల చిన్న, పెద్ద రాజ్యములు వరుసగా నుండెను. అక్కడనుండి మాలికగ సింధునది సముద్రమునఁ బడువఱకు నిరువైపుల నాక్రమించి యున్నవి భారతీయ రాజ్యములే! వానిలో వైదిక ధర్మమే ప్రచారమున నుండెను. అవి యన్నియు స్వతంత్ర రాజ్యములే! వానిలో ననేక రాజ్యములు ప్రజాసత్తాకములు. వాని నప్పుడు గణ రాజ్యము లనెడివారు. వాని పరిస్థితి యించుమించు నేటి ప్రజాపాలనము వంటిది. వీనిలోఁ గొన్ని రాజసత్తాకములైన రాజ్యములు గూడ నుండెను. అవి రెండు మూడు మాత్రమే! వానిలో పౌరవుఁడు పాలించుచున్న రాజ్య మగ్రగణ్యము. ఇతనినే గ్రీకులు 'పౌరస్' అన్నారు.

## డాక్టర్ జాయిస్వాల్ యొక్క "Hindu Polity" యను గ్రంథము

డాక్టర్ జాయిస్వాల్ లండనున "నభినవభారత" మనెడు క్రాంతికారక సంఘమందు 1907 నుండి 1910 సం॥

వఱకు నొక ప్రముఖ సదస్యులుగ నుండిరి. తరువాత తమ వ్రాతలతో ప్రాచ్య విద్యా విశారదులలో గొప్పకీర్తిని పొందిరి. వీరు వ్రాసినదే 'హిందూ పాలిటీ' యను గ్రంథము. దీనిలో సింధునది సముద్రమునఁ జేరువఱకును, దాని కిఱు వైపులనుండిన, భారతీయ గణరాజ్యములయొక్క లోక సత్తాక రాజ్యఘటన భిన్నరీతుల - విపులముగఁ జర్చింపఁబడి యున్నది. ఆ విషయములన్నియు, గ్రంథకర్త యెంతయో బరిశోధించి వ్రాసినవి.

అత్యంత ప్రాచీనమైనకాలమందు, సింధునది కావలి గట్టున, గాంధార దేశమువఱకు వ్యాపించిన జనపదములలోని యార్యులలో నొకశాఖ గ్రీసు దేశమువైపు బ్రయాణించెను. వారి వంశజులే గ్రీకులు. ఇది యా గ్రీసుదేశస్థుల విశ్వాసమే! వారి పురాణములుగూడ నిట్లే జెప్పను. అలెగ్జాండరుయొక్క విపులసేనా వాహిని, ఆ భారత భూభాగమునఁ బ్రవేశించినది. అక్కడిజనుల నాతఁడు జూచెను. వారించుమించు గ్రీకులవలెనే యాతనికిఁ బొడకట్టినారు. అక్కడనున్న యార్యులుగూడ వారిని విభిన్నముగ చూడనంతటి సారూప్యము వారి యాచార వ్యవహారములలో నుండెను. తమ ప్రాచీనుల మూలదేశ మిదియే యని యలెగ్జాండరు మనస్సునకుఁ దట్టినది. అతనికి, నతని సైన్యమునకును దమ పూర్వుల నివాస భూమిని గాంచినపుడు గలిగిన యానంద ముల్లోలమై పోయినది. వారు గొన్ని దినములు యుద్ధము నాపుసేసి గొప్ప యుత్స వము లొనర్చికొనిరఁట! తమ దేవతలను సంతోషపఱచుటకై యజ్ఞము లొనర్చి హవనములుఁగూడ జేసిరి.

గ్రీకు దేవతలకు, వైదిక దేవతలతో నత్యంత సాదృశ్యమున్నది. వారు దేవతల కిడుకొన్న పేరులు, సంస్కృత శబ్దముల యపభ్రంశరూపములే! వారును యజ్ఞము లొనర్తురు; హావింతురు. గ్రీకుల నితరు లయోనియనులని పిలచుటయు గద్దు.

## 'అయోనియను' అను పేరునుండియే యవనశబ్దము గలిగెను.

యయాతికి 'అను' వనెడు నొక పుత్రుఁ డుండెను. ఇతఁడే గ్రీకులకు మూలపురుషుఁడగునా? అన్వాయన శబ్దమునకు 'అయోనియన్' అనుట యపభ్రంశరూపము గావచ్చును. కాని దీని నింకను బరిశోధకులు సాధింపవలసియున్నది. దీని విషయ మెట్లున్నను, ఒకటి మాత్రము నిజము. గ్రీకులను ప్రాచీనకాలమునుండియు, భారతీయులు యవనులనియే బిలచుచు వచ్చిరి. సంస్కృత సాహిత్యమును జూచినను, స్థిరపడున దీ విషయమే! 'యోన' యనునదియు, యవన శబ్దమునకు సంకరరూపమే! ఈ రెండును 'అయోనియన్' అను శబ్దమునుండి బుట్టినవే!

## నాడు గాంధార పంచనదములనుండి సింధు పర్యంతము బౌద్ధమతపు పొలకువయే లేదు!

నాడు గాంధారమునుండి పంచనదముల వఱకు నిఱువైపుల సింధునది పొడవునను భారత రాజ్యములు వ్యాపించియుండె నంటిని. అలెగ్జాండరు భారతము పైకిదండెత్తినప్పు డతనితోఁగూడఁ గొందఱు గ్రీకు విద్వాంసు లుండిరి.

వారు నాటి భారతదేశముయొక్క పరిస్థితిని విపులముగ వర్ణించి వ్రాసినారు. ఆ వ్రాతలనుబట్టి చూచినచో, నాఁడీ ప్రాంతములలో, బుద్ధునకును, బౌద్ధమతమునకును, ప్రచారము అణుమాత్రముగూడ నున్నట్లు దోచదు. ఆ భాగములందున్నవారందఱు, వైదిక ధర్మానుయాయులే! గ్రీకుల వ్రాతలేగాక ఇతరుల వ్రాతలనుబట్టి చూచినను స్థిరపడున దీ విషయమే! నాడు భారతము నందలి 'శతద్రు' నది కావల బౌద్ధమతముయొక్క గంధము సోకనేలేదు. అనగా బుద్ధుని మృత్యువు తరువాత నిన్నూరు, మున్నూరు సంవత్సరముల పర్యంతము బౌద్ధము మగధ దేశమునందు మాత్రమే వ్యాపించి యుండెననియు, నా దేశమును దాటి దాని కెక్కువ ప్రచారము లేదనియు స్పష్టము. ఈ విషయ మితర కారణములచేతఁగూడ తదుపరి నిరూపితమగును.

యవను లనగా గ్రీకులే; ముసల్మానులు గారు.

పరరాష్ట్రీయులై ఆక్రామకులైన గ్రీకులను, భారతీయులు యవను లన్నారు. వార లంశతః పరధర్మీయులు. క్రమముగ నా యవన శబ్దము పరరాష్ట్రీయులై, యాక్రామకులైన సర్వులకును వాడఁబడినది. ఇది పొరపాటు. అందును విశేషించి, ముసల్మానులకు యవన శబ్దమును వాడుట పెద్ద పొరపాటు. గ్రీకు లానా డాక్రామకులైననుఁ, బరరాష్ట్రీయులైనను వారు సుసంస్కృతులు, సభ్యులు, విద్యావంతులు. కాని కొన్ని నూర్ల సంవత్సరములకు తర్వాత భారతముపైకి దండెత్తిన ముసల్మానుల కిట్టి ప్రవృత్తి యున్నట్లు తోఁపదు. కనుక వీరిని యవను లని పిలచుటకు వీలులేదు. మన పూర్వులు

ముసల్మానులను 'మ్లేచ్ఛ'లనియే యనుచుండిరి. యవనులని పిలచినట్లు గానరాదు.

సికందరు ముస్లిముకాడు! అతని నాపేరునఁ బిలచుట పొరపాటు.

ఈ విషయమునం దనేకులకు భ్రాంతిగలదు. అలెగ్జాండరను పదమున కే పర్షియను భాషలో సికందరని పేరు. గ్రీకు సామ్రాజ్యము, పర్షియా నాక్రమించుకొన్నప్పుడు, పారశీకు లలెగ్జాండరుయొక్క యలౌకికమైన పరాక్రమమునకు మోహితులైరి. అపుడు సికందరను పేరు తమ పుత్రులకు వారు బెట్టుకొనిరి. తరువాత పర్షియనులు ముసల్మానులైనారు. కాని వారిలో 'సికందర'ను పేరు నిలచిపోయినది. భారత దేశమునందును, ముస్లిములలో నిదే వ్యవహారము జరగినది. హిందూస్థానమందలి తురుష్కుల కీకథ తెలియదు. వారు సికందరొక మహాపురుషుఁడనియు- దురుష్కుఁడనియే భావించిరి. కనుక సికందరు మహమ్మదీయుఁడనుట భ్రాంతితోఁ గూడిన యొక కల్పన. సికందరున కించుమించు వేయి సంవత్సరములకుఁ బిదపనే మహమ్మదు పైగంబరు జన్మించెను. మరి యాతనికి వేయి సంవత్సరములకు ముందున్న సికందరు మహమ్మదీయు డెట్లయ్యెనో ఊహించుటగూడ కష్టసాధ్యము.

అలెగ్జాండరు సామ్రాజ్యమునకు నాడు హిందూకుశ పర్వతములే యెల్ల. అతఁడు వానిని దాటి, విపులసైన్యములతో తక్షశిలను సమీపించెను. తక్షశిలయొక్క రాజైన

యంబుజుఁడు (అంభి) యుద్ధము సేయకయే, యలెగ్జాండరు నకు మాండలికుఁడై పోయినాడు. అంబుజునకు పౌరవునకును ప్రతిస్పర్ధలుకద్దు. ఆపౌరవరాజుయొక్క స్వాతంత్ర్యమును బడగొట్టుటకే యంబుజుఁడు అలెగ్జాండరును పిలచెనని గ్రీకు చరిత్రకారులు వ్రాసిరి! అదియే నిజమైనచో అంబుజుఁడు స్వజన ద్రోహ మొనర్చి దానికి ప్రాయశ్చిత్తముగ మాండలికుఁ డయ్యెను.

## తక్షశిలయందలి విద్యాపీఠము - ఒక విలక్షణమైన యోగము

నాఁడు తక్షశిలయం దొక జగత్ప్రసిద్ధమైన విద్యాపీఠముండెను. దానియందు దేశదేశములనుండి వచ్చిన విద్యార్థులు వసించెడువారు. వారు నేర్చుచున్నది కళలు - శాస్త్రములు. ఇంతమాత్రమేగాదు. అక్కడకు దేశదేశములనుండి యనేకులు రాజపుత్రులును వచ్చెడువారు. వారి కచ్చట, రాజనీతియు, యుద్ధమర్మములును, నేర్పఁబడుచుండెడివి. అలెగ్జాండరు తక్షశిలా రాజ్యమును దమనమొనర్చి ససైన్యముగ భారత భూమియందుఁ బ్రవేశించెను. ఇదియొక విచిత్రమైన దైవయోగము. ఆసమయమునసే, తక్షశిలా విద్యాపీఠమం దొక నవయువకుఁ డున్నాడు. అతఁడు మహాతేజస్వి. ఆ ముఖ ముత్సాహమునఁ బొంగులు వోవుచుండెను. అతఁడీ భారతేతిహాసమునందు సువర్ణపత్రమునుఁ గల్పనసేయుబోవు ధీరుఁడు. ఆ యువకుఁ డచట, రాజనీతి - యుద్ధమర్మములు, వీనిని నేర్చికొనుచుండెను. అతనిపేరు చంద్రగుప్తుఁడు. ఆ తక్షశిలా పరిసరములందే చాణుక్యుఁ డుండెను. అతఁడు వివిధ

శాస్త్ర పారావార పారంగతుఁడు, రాజనీతి నిష్ణాతుండు, మహాప్రౌఢుఁడునైన బండితుఁడు.

సికందరుయొక్క దండయాత్ర రేపిన కల్లోలములలో నెవ్వరి చేతగాని వీరిర్వురసామాన్యులుగ భావింపఁబడలేదు. వారు నివురుఁగప్పిన నిప్పులవలెనే యుండిరి. సికందరు భారతమునందలి రాజకుమారుల మకుటములను, వెంటవెంట పనివట్టి రణరంగమున నేలకుఁ గూల్చెను. అతఁడా కిరీటముల నన్నిటిని, స్వయముగఁ దాను ధరింపఁ గోరినాడు. భారత దేశపు సామ్రాట్టు అనెడు మహామకుటము దనతలపై ధరించు కొన నువ్విళ్ళూరుచుండెను. ఆ సందర్భమున సికందరు, శిరస్సున వెలుగఁబోవు నాకిరీటమును బలవంతముగ లాగి- తన శిష్యుని తలపై నుంచుట కొకానొక యాచార్యుఁడు తీవ్రముగ యోచించుచున్నాఁడు. అతఁడనేకములైన వ్యూహభేదములను, మనస్సునందే నిర్మించుకొనుచుండెను. ఆ యాచార్యుఁడే చాణక్యుఁడు.

## పౌరవుని యుద్ధము

తక్షశిలకు రాజైన యంబుజుఁడు, యుద్ధములేకయే లోఁబడిపోయెను. తక్కిన రాజులెల్లరు నీకృత్యము నెంతయో నిరసించిరి. అంబుజుఁడు క్షాత్రధర్మమునకుఁ గళంకమని వారెంచిరి. సాహసోద్దీప్తులైన, వారందరునుఁ జేరి అలెగ్జాండరు నరికట్ట నూహించినారు. కాని దుర్దైవవశమున వారిలో నొక గొప్పపొరపాటు గలిగెను. వారెల్లరు నొకచోట గుమిగూడి యొకనాయకుని క్రిందఁ బనిచేసియుండిన బాగుండెడిది.

ఈ విషయము వారి మదికిఁ దట్టనేలేదో? లేక సైన్యముల నొకచోట సమీకరించికొనుట కవకాశము లేక పోయెనో చెప్పలేము. అలెగ్జాండరు తక్షశిల నోడించి దానికి ప్రక్కనేయున్న రాజ్యాధిపతులను తనకు మాండలికులు కమ్మని ఆజ్ఞాపించెను. వారిలో పౌరవుఁడు దానికి నిరాకరించి ఆతనితో యుద్ధమునకుఁ దలపడెను. పౌరవుని యుద్ధసామగ్రిలో ముఖ్యమైనవి రథములు, గజములు. అలెగ్జాండరుయొక్క ముఖ్య సైన్యము - గుఱ్ఱపుదళము. ఈ యిఱువాగులకును, నడుమ వితస్తా నది (జీలం) యుండెను. ఇఱు సైన్యములును యుద్ధమున కెదురు చూచుచుండినవి. ఇంతలో బ్రహ్మాండమైన వాన లారంభమైనవి నది యుప్పొంగ నారంభించెను. అలెగ్జాండరు కనుగలిగి నదిని శోధించుచునే యున్నాఁడు. ఒకనా డనుకూలమైన రేవును జూచికొని, యా చక్రవర్తి నదిని దాటి వెనుకవైపునుండి పౌరువుని సైన్యముల నడ్డెను. ఇది యకస్మాత్తుగ జరిగిన సంఘటన. కాని పౌరవుఁడు చలింపనేలేదు. అతఁడు తెగించి పోరెను. కాని వానల సందడిచే రణాంగణమం దెక్కడ జూచిన నొక్కటే బురద. అందుచే పౌరవుని రథములు, గజములు, బురదలోఁ జిక్కికొని తికమకలాడ నారంభించినవి ఈ యదను చూచి యలెగ్జాండరు బ్రహ్మాండముగ విజృంభించెను. ఆ సమయమున గజారూఢుఁడై యుద్ధము సేయుచున్న పౌరవునకుఁ బలమైన గాయము తగిలినది. అతఁడు గ్రీకు చక్రవర్తి చేతికి దొరకినాఁడు.

## కౌతుకముతోఁగాదు - రాజకీయ ప్రయోజనము కొఱకు

పౌరవరాజు నలెగ్జాండరు బందీగాఁ గొన్నాఁడు. 'నేను నీతో నెట్లు వర్తింపవలెనని నీవుఁ గోరుదువు ?' ఈ ప్రశ్న యలెగ్జాండరు పౌరవ మహారాజునకు వేసినది. పౌరవుఁడు వెంటనే "యొకరాజు మఱియొక రాజుతో వ్యవహరించునట్లు" అని సమాధాన మిచ్చెను. పౌరవుఁడొసఁగిన యీ యుత్తరమును విని, గ్రీకు చక్రవర్తి యబ్బురఁ పడినాఁడు. అందుకై యితఁ డాతనినిఁ జంపలేదు. కేవలము దన కంకితునిగాఁ జేసికొని యాతని రాజ్యము నాతని కిచ్చెను! ఈ వ్రాతలు కొంద రాంగ్లేయ చరిత్రకారులు వ్రాసిరి. ఈ చరిత్రయే భారతదేశ కళాశాలలలోని పుస్తకములలోని కెక్కినది. వీరికి వారిమాట వేదాక్షరము.

స్వప్నమున రాజ్య మొసఁగెదనని ప్రతిజ్ఞ సేసి మేలుకొన్న తర్వాతఁగూడ నా మాటకుఁ గట్టువడి, నేలను ధారాదత్త మొనర్చునంతటి యమాయకుఁడుగాఁడు గ్రీకు చక్రవర్తి. ఇట్టి ధర్మములన్నియు భారతీయులవి. పౌరవు నలెగ్జాండరు వధించి, యీ రాజ్యమును లాగికొని, యచ్చోట నొక యవనుని క్షత్రపునిగా నియమించినచో, స్వాభిమానమునఁబొంగులువోవు భారతీయులు దిరుగఁబడి కల్లోల మొనర్తురని యాతనికి స్పష్టముగఁ దెలియును. భారతదేశమునకు ముఖ్య పట్టణమైన పాటలీపుత్రమువరకును బోవలెనని యవనచక్రవర్తి యాశ. ఈ నడుమ నింకెందరినో— శత్రుల జయింపవలసియున్నది. ఈ మహాకార్యమును కేవలము గ్రీకుసైనికు లొక్కరే నిర్వహింపలేరు. దానికి స్వదేశీయుల

తోడ్పాటుఁ గావలెను. అందుకై యాతఁడు వేసిన మెత్తిది! తక్షశిలా రాజైన యంబుజునిపై జూపిన కృత్రిమమైన దయయే, గ్రీకు చక్రవర్తి పౌరవునిపైఁగూడఁ జూపినాడు. ఇట్టి పద్ధతులతో దన పాటలీపుత్ర మార్గము సులభతర మగునని యతని తలఁపు. కనుక పౌరవునకు గ్రీకు చక్రవర్తి రాజ్యము వెనుక కిచ్చుట, భారతీయ రాజుయొక్క ధీరోదాత్తతను ప్రశంసించి మాత్రమేగాదు— ఆ దానము వెనుక గొప్ప యాశ యున్నది. ఇంతమాత్రమేగాదు. పౌరవ రాజ్యమునకు చుట్టుపట్టులనున్న చిన్నచిన్న సంస్థానముల నన్నిటిని గ్రీకుచక్రవర్తి పౌరవుని రాజ్యముతోఁ జేర్చెను. చేర్చి, యా భూభాగమునకుఁ దన తరఫున పౌరవుని క్షత్రపునిగా నియమించినాఁడు. పౌరవున కీమెత్తు దెలియకపోలేదు. కాని యతనికి కాలము ప్రతికూలముగ నుండినది. ఇపుడు విజృంభించి లాభములేదు. అందుకై యాతఁడు 'తావత్కాలం ప్రతీక్ష్యేతాం' అను ధర్మము నాశ్రయించెను. అలెగ్జాండ రొసఁగిన రాజ్యమును బౌరవుఁ డంగీకరించినాఁడు. ఈసమ్మతి భారతీయులకు విషాదమునుఁ గలిగింపలేదు; క్షత్రపుఁడైన పౌరవుఁడు త్వరలోనే యెట్లు గ్రీకు చక్రవర్తిపైఁ బగ దీర్చుకొనెనో ముందు దెలుపుదును.

## అలెగ్జాండరు గ్రీసు దేశమునుండి సైన్యమును రప్పించెను

పౌరవుని యుద్ధము ముగిసినంతనే యలెగ్జాండరు చుట్టుపట్లు నున్న చిన్న చిన్న సంస్థానముల జయించి, వాని నొక్క వ్యవస్థకుఁ దెచ్చుటకై యచ్చటి జనవృత్తమునుగురించి తెలిసికొన నారంభించెను. హిందూకుశ పర్వతములనుండి— యింత మేర భారత దేశము, జయించుకొని వచ్చుటలో నాతని

సైన్య మెంతయో నష్టమైనది. దానినిఁ బూరించుటకై యాతఁడు బాబిలోనియా, గ్రీకు దేశములలోని తన సామంతులకు కొంతసైన్యములను పంపవలసినదని వర్తమాన మంపెను. ఆతని సైనికు లెందరో గాయపడిరి. కొంద రంగవికలు లైనారు. వారిని స్వదేశమునకుఁ బంపెను.

## భారతీయ యతులు, యోగులు

గ్రీకు చక్రవర్తి దేశమున నలువైపులకును జారుల నంపుచుండెను. జయించిన— జయింపవలసిన — దేశములలో వారు సంచరించి వచ్చి, యక్కడి స్థితిగతులనుఁ జక్రవర్తికిఁ దెలిపెడువారు. వారు దెచ్చిన వృత్తాంతములలో నరణ్యముల నేకాంతవాస మొనర్చు - తపస్వులు, తపో వనములు; నిస్సంగులు; గ్రామైకరాత్రముగఁ దిరుగు తత్త్వచింతకులు- వీరి వర్ణనములుఁగూడ నుండెడివి. గ్రీకు చక్రవర్తికి స్వయముగ తత్త్వజ్ఞానమునం దభిరుచిగద్దు. ఆతఁ డరిస్టోటిలు శిష్యుఁడు. భారత దేశమునందలి యిట్టి నిస్సంగులైన పురుషుల విషయమున గ్రీకు దేశమునందే యెంతయో యాదరముండెడిది. భారతదేశమునకు రాకముందే వీరికీర్తి యలెగ్జాండరు చెవుల కెక్కినది. గ్రీకు దేశస్థు లిట్టి యతులు మొదలైనవారిని దమ భాషలో (Gymnosophist) జిమ్నాసోఫిస్ట్ అని పిలచెడువారు. ఇట్టివారిని ప్రత్యక్షముగఁ జూచి వారితో మాటాడవలెనని గ్రీకుల కెంతయో యాశ. అరణ్యములఁ దపమొనర్చుకొను సన్యాసుల నెందరినో యలెగ్జాండరు దనకడకు రప్పించుకొనెను. కొన్నియెడలఁ దానే పోయి వారినిఁ జూచెను. ఇట్టిసన్ని వేశముల గురించిన కొన్ని కథలు

గ్రీకుచారిత్రకులు వ్రాసిరి. వానిలో నొకటి రెండు కథల నిట నుద్ధృతీకరించుతును. ఈ యుదాహరణములతో గ్రీకులు -భగవంతుని పుత్రుఁ డనుకొన్న యలెగ్జాండరు వ్యక్తిత్వముఁ గూడ మనకు బోధపడఁగలదు. గ్రీకుచక్రవర్తి యొకనాఁ డొక యతినిఁ గలసికొన్నాడు. అతని నితఁడు "నాకీ దిగ్విజయములో సంపూర్ణ యశస్సు లభించునా లేదా?" యని ప్రశ్నించెను. దాని కా సన్యాసి యేమియుఁ బదు లివ్వలేదు. అతఁ డొక కృష్ణాజినమును దెచ్చియిచ్చి దీనిని బరచికొని కూర్చుండుమని చక్రవర్తితో నన్నాడు. ఆ కృష్ణాజిన మరటియాకువలె ముడిచికొనిపోయినది. దానినిఁ జక్కఁగా నేలపైఁ బరచి కూర్చొన వలసినదని యతి యన్నాఁడు. దానిపై నలెగ్జాండరో- లేక యతని యాజ్ఞతో మరి యొక్కరో- గూర్చొనుటకై యత్నించెను. కాని దానిని బరచికొను టెట్లు? ఒకవైపునుండి సరిజేసిన మరియొకవైపునుండి యది ముడుతలు వడుచువచ్చెను వా రెంతయో ప్రయత్నించిరి. దాని ముడుతలు బోగొట్టుటకు సాధ్యముగా లేదు. ఆ యవస్థఁ జూచి యా యతి పకపక నవ్వినాఁడు. అపు డాతఁ డనెను. "చక్రవర్తీ! భారతదేశ దండయాత్రవలన నీకుఁ గలుగబోవు లాభ మింతే! నీ వొకవైపు నుండి ముందుకు సాగిపోవునప్పుడు నీచే జితములైన రాజ్యములు మరల నూత్నశక్తిని సంపాదించుకొని నీపైఁ బడును. వారిని జయించుటకు నీవు వెనుదిరిగినప్పుడు జయింపవలసిన రాజ్యములు నీపైఁ బడును. నీ వెట్లును భారతదేశ సామ్రాట్టువు గాఁజాలవు.

## దండామిస్సు వృత్తాంతము

'దండామిస్' అనునది గ్రీకునామము. దీనికి సంస్కృతీకరణ మెట్లో? ఈ పేరుగలవాఁ డొక బ్రాహ్మణ సన్యాసి. ఇతఁడు తక్షశిలా ప్రాంతములయం దుండెను. ఈ బ్రాహ్మణుని బిలిపించుకొని సంభాషింపవలెనని గ్రీకు చక్రవర్తి కిచ్ఛగలిగినది. ఆ బ్రాహ్మణుఁడు వయోవృద్ధుఁడు, జ్ఞానవృద్ధుఁడు. అతఁడున్న దవధూతస్థితి. తనకడ కాతఁడు రావలసినదని, చక్రవర్తి కబురుఁ బంపినాఁడు. ఆ సన్యాసి పోలేదు. అపు డలెగ్జాండరు 'సెక్రేటస్' అను పేరుగల తన యధికారి నొక్కని నా విప్రునికడ కంపినాఁడు. అతఁడు పోయి యా సన్యాసితో నిట్లనెను: "జగజ్జేతయగు చక్రవర్తి నిన్ను రమ్మనుచున్నాఁడు. అతఁడు 'డ్యూ' దేవతయొక్క పుత్రుఁడు. నీ వీసారికూడ రానన్నచో నీ శిర స్సిచ్చటనే ఖండింపఁబడును." ఈ బెదరింపును విన్న యా బ్రాహ్మణుఁడు పక పక నవ్వినాఁడట! ఆ సన్యాసి బదులిచ్చెను: "మీ యలెగ్జాండరు 'డ్యూ' దేవత పుత్రుఁడుగదా! నేనుఁగూడ నా దేవతా పుత్రుఁడనే! మీ యలెగ్జాండరు జగజ్జేత యంటివి. నీ మాటలను నాకు నవ్వువచ్చుచున్నది. అతఁ డింకను వ్యాసనదిని దాటి పోనే లేదు. దానినిఁదాటి యచటనున్న శూర భారతీయులతో, దానికిఁ బైనున్న మగధ సామ్రాజ్యమునందలి మహావీరులతోఁ, జేతులఁ గలిపినప్పు డా జగజ్జేతృత్వమెట్టిదో తెలసి వచ్చును. మావంటి సన్యాసులు మీ ధనధాన్యములఁ జూచి దగ్గరకు రారు. అట్టి పదార్థములకు మాదృష్టిలో వెలలేదు. మా మాతృభూమి యేమి యొసఁగునో యదియే మాకుఁ

జాలును. అది కేవలము గాలియైననుఁ దృప్తియే. మీ చక్రవర్తి నా శిరస్సు నఱకినచో నాశిరస్సు మాత్రమే నఱుకఁబడునది. మట్టితో నేర్పరుపఁబడిన యీ శరీరము మరల దానిలో నైక్యమై పోవును. కాని నాయాత్మను ఖండించుటకు మాత్రము మీ చక్రవర్తికి శక్తి లేదు. అది యచ్ఛేద్యము, అమరము. ఎవ్వరు సువర్ణమునకుఁ దాసులో- మృత్యువునకుఁ భయపడుదురో- వారిపై నిట్టి బెదరింపులు పనిచేయును. మీ చక్రవర్తితోఁ జెప్పుము. మావంటివారియెదుట మీ యలెగ్జాండరుఁగూడ నొక మనుష్యమాత్రుఁడే. ఒక మనుష్యుని మరియొకఁ డేమిచేయును? నేను మీ చక్రవర్తికడకు రాను; పొమ్ము!" ఇవి యా సన్యాసి చక్రవర్తి కొసఁగిన యుత్తరములోని కొన్ని మాటలు! ఈ కథను గ్రీకు చరిత్ర కారు లెంతయో విపులముగ వర్ణించినారు. ప్లూటార్క్ మహాశయుఁడుఁగూడ నీవృత్తాంతమును వ్రాసెను. గ్రీకు చరిత్రకారు లెందరో యీ కథ నుటంకించి యీ బ్రాహ్మణుని నిర్భయములైన, వీరోచితములైన వాక్యముల బ్రశంసించి యున్నారు. కడకు వారీ మాటలను వ్రాసిరి: "అలెగ్జాండ రెన్నియో రాష్ట్రముల జయించెను. అతఁడు జగజ్జేత అట్టి వానినిఁగూడ ధూళితో సమానముగఁ జూచినవాఁ డీ బ్రాహ్మణ సన్యాసి యొక్కఁడే!"

## అలెగ్జాండరు బ్రాహ్మణులను క్రాంతి కారకులని తలఁచి వారికి ప్రాణదండనము విధించుట

ఇట్లు తత్త్వజ్ఞానులు, సన్యాసులు- వీరితోఁ బరిచయము ముదురుకొలఁదియు నలెగ్జాండరున కొక విషయ మనుభవము

నకు వచ్చెను వారేదో పనిలేక దారులు దిరుగుచుండు దద్ద
మ్మలుగారు. నిస్సంగులు- నిర్భయులు- నిస్పృహులై దిరుగు
చుండు నా యోగులే, భారతీయుల గణరాజ్యములు-యేక
సత్తాకరాజ్యములు- వీనికి మూలస్తంభములు. ఈ రాజ్య
సంచాలకులపై వీరి యుపదేశముల ప్రభావ మమితముగఁ
బడుచుండెను. రాజకీయ విషయములపై వీ రొసఁగు నభి
ప్రాయములను రాజులు, ప్రజలునుఁగూడ గౌరవించుచుండిరి.
భారతదేశమునందలి క్షత్రియుల ఖడ్గధారవంటిదే యీ
సన్యస్త బ్రాహ్మణుల వాగ్ధారగూడ. ఈ రెండును తీక్ష్ణ
ములై పరకీయులైన గ్రీకుల దురాక్రమణకుఁ దీవ్రముగ బ్రతీ
కార మొనర్ప యోచించుచుండినవి క్షత్రియుల ఖడ్గములు
ప్రత్యక్షముగ నలెగ్జాండరు నెదిరించుచుండెను. హైందవ
సన్యాసుల పలుకులు గుప్తముగ గ్రీకు చక్రవర్తిపై విప్లవ
ముల సృజించుచుండెను. ఈ విషయ మనుభవమునకు వచ్చిన
వెంటనే మొట్టమొదట వారితో మాటాడవలెనని యలెగ్జాం
డరుకున్న కౌతుకమంతయు మారిపోయెను. నాటినుండి గ్రీకు
చక్రవర్తి సన్యస్తులైన బ్రాహ్మణులను దీవ్రముగ ద్వేషింప
మొదలువెట్టినాఁడు. అట్టివారిని గొందఱ నాతఁ డురిదీయిం
చెను. ఇట్టి బ్రాహ్మణు నొకని నురిదీయుటకు చక్రవర్తికడకుఁ
దీసికొనివచ్చిరి. అతని నలెగ్జాండ రిట్లు ప్రశ్నించెను: "నీవు
మాకు విద్రోహకరములగు వాక్యము లేల ప్రచారము సేయు
చున్నావు?" ఆ సన్యాసి సమాధానమున కేమియు దడుము
కొనలేదు. అతఁ డన్నాఁడు: "ఓయి రాజా! మేము బ్రతి
కినచో గౌరవముగ బ్రతుకుదుము; చచ్చిన గౌరవముగ
జత్తుము!" (Plutarch. LXIV)

పౌరవరాజును బరాభవించిన తరువాతఁ జుట్టుపట్లనున్న సామంతరాజులందరును భయపడి తనకు శరణు జొత్తురని యలెగ్జాండరనుకొన్నాఁడు. కాని యది కేవలము భ్రమ. అతఁడు వితస్తానదినిఁదాటి ముందుకు ముందుకు సాఁగిపోవు కొలఁదియుఁ ద్రోవలో ననేకములు బెద్దవి, చిన్నవి గణరాజ్యము లాతనిపై వరుసగా కత్తి ఝళిపించినవి. రణదేవతకు బలితర్పణము లేనిది యేక్షత్రియుఁడుగాని గ్రీకు చక్రవర్తికి శిరస్సు వంచినవాఁడుగాఁడు. ఎడతెగని యీ యుద్ధ సంరంభములలో గ్రీకుసైన్యము లనేకములు జచ్చెను. చావగా మిగిలినవారికి సాహసమును, సత్తువయు సమసినవి.

గణరాజ్యములతో యలెగ్జాండరు గావించిన యనేక యుద్ధములు గ్రీకుచరిత్రలో ననేక స్థలముల వర్ణింపఁ బడి యున్నవి. వీని నన్నిటిని విపులముగ వర్ణించుటకును, సంక్షేపముగ సూచించుటకును, నిచ్చటఁ జోటులేదు. కాని, సమస్త భారతదేశమును పాదాక్రాంత మొనర్చికొని మగధ సామ్రాజ్య మహా కిరీటమును దలపైఁ ధరింప నెంచి యాశాదృక్కులతో వచ్చిన జగత్ప్రసిద్ధుఁడైన దేవసేనాని యలెగ్జాండరు చక్రవర్తికి భారతీయ గణరాజ్యములను జయించు టంత సులభముగఁ దోచలేదు. వారు విజృంభించిన కంఠీరవమువలె వీర విక్రమ విహారములు సల్పిరి. వారి యంగణములనుండియే బోవలసిన యవస్థగూడ నలెగ్జాండరునకుఁ బట్టినది. అట్టి వీరవరుల చరిత్రము లొకటి రెండైనను దలఁపక పోవుట వారియెడల మనము జూపించు కృతఘ్నత. ఆ దోషమును బాపికొనుటకై యొకటి రెండైన దడవుదముగాక!

## సౌభూతి, కఠ గణరాజ్యములు

ఈ రెండు గణరాజ్యములును ప్రజాసత్తాకములు, స్వతంత్రములు. ఈ రెంటియందును సర్వనగరములయందలి రాజ్యవ్యవస్థయు–సర్వహితకారకమై ప్రశంసనీయమై యుండెనని 'డాయోడోరస్' అను గ్రీకు చరిత్రకారుఁడు వ్రాయుచున్నాఁడు. ఆవాక్యము లివి: "They were governed by laws in the highest degree salutary and their political system was admirable." ఈ రాజ్యములయం దొక యాచార ముండెడిది. ఆ యాచారము రాష్ట్రమునందున్న ప్రజల యోగక్షేమముల సంరక్షించు దృష్టితో నొనర్పఁ బడినదే. ఆ రాజ్యములలో సుందరులై బలిష్ఠులైన యువకులు జన్మింపవలెనని యా ప్రజల యాశ. అందుకై వా రొక నిబంధనము నొనర్చినారు. వివాహసమస్య వారిదృష్టిలో నొక వ్యక్తికి మాత్రమే సంబంధించినదిగాదు. అది రాష్ట్రసమస్య. వారు శారీరకసౌందర్యము, అంగనిర్మాణ సౌష్ఠవము– వీనిపై నెక్కువ లక్ష్య ముంచెడివారు. ఆ వివాహములలోఁ గట్నముల గలాటాలేదు. వధూవరుల శరీర సౌష్ఠవము – సౌందర్యము – బలిష్ఠమగు సంతానము నుత్పాదన మొనరించు యోగ్యత – వయస్సు – వీనిపైననే నాటి వివాహ నిర్ణయములు జరగుచుండెడివి. అందుపై యా వివాహ తీర్మానములు గణరాజ్యాధిపతుల యెదుట జరిగెడివి. ఈ విషయములలో రాజనియంత్రణ గొంత తీవ్రముగనే యుండెను. సంతానము జన్మించిన వెంటనే యా శిశువును మూఁడు నెలలలోపల గణరాజ్యాధిపతులకడకు గొనిపో

వలెను. వారా శిశువుయొక్క శరీర పరీక్షను జాగ్రత్తగ నొనర్తురు. ఆ శిశువు జన్మలోనే కురూపిగనో - రోగగ్రస్తగనో యున్నచో - గణరాజ్యాధిపతి - దానిని నిస్సంశయముగ ఛేదించెడువాఁడు. ఈకఠోరమైన నియమము రాష్ట్రక్షేమమునకై గావింపఁ బడుటచే ప్రజలు సంతోషముగ సహించెడివారు.

గ్రీసు దేశమునందలి స్పార్టా మొదలగు నగర రాజ్యములలోఁగూడ నిట్టి యాచారమే యుండెను. ఈ యాచారము పరంపరయొక్క గుణసాకల్యమును రక్షించుట కేర్పరుపఁ బడినది. సౌభూతి, కఠ రాష్ట్రము యీ రెంటియందున్నంత తీవ్రముగ లేకున్నను - నితర గణరాజ్యములుగూడ నీ నియమము నంతయో యింతయో యనుసరించినవి. ఈ యనుసరణ దేశక్షేమమునకే వృష్ణిగణమునందుఁగూడ నీ యాచార ముండెను. తమ వంశములందు గొప్పవాఁడును, బలిష్ఠుఁడునైన పురుషుఁడు జన్మింపవలెనని కోరు నాచారమూ వృష్ణిగణమున జాల ప్రాచీనమైనదే! ఈ వృష్ణిగణమునందు జన్మించినవాఁడే జగద్విఖ్యాతుఁడైన శ్రీకృష్ణుఁడు. ఈతని శరీర సౌష్ఠవము - బలాఢ్యత - వీనికి సంబంధించిన ఖ్యాతి జగత్ప్రసిద్ధమైనదే! ఇతని సుతులుగూడ నన్నివిధముల కృష్ణునివంటివారే! పురాణములన్నియు నీ విషయమునే జెప్పును.

## ఆయుధ జీవి గణరాజ్యములు

పంచనద ప్రాంతములు సింధునది కిఱువైపుల దాని సముద్ర సంగమమువఱకు వ్యాపించిన గణరాజ్యములు

ముఖ్యముగ నాయుధమే జీవికగాఁ గలవి వీరు శస్త్రోపజీవులు. వీరిలో నున్న వైశిష్ట్య మేమనఁగా - బురుషులేగాక స్త్రీలు గూడ సైనిక శిక్షణము నందెడువారు. ఆ శిక్షణ వారి కనివార్యము. యుద్ధములలో స్త్రీలును రణాంగణముల కురుకుచుండిరి. ఈ గణరాజ్యముల వ్యవస్థలు గొంత బరస్పరము భిన్నముగ నున్నను వీని ధ్యేయము మాత్ర మొక్కటే! ప్రజాసత్తాకరాజ్య నిర్మాణము. ఈ రాజ్యములలోఁ గొన్ని చిన్నవి, కొన్ని పెద్దవి. అయినను - ఎవరి స్వాతంత్ర్యము వారిది.

## యౌధేయ గణరాజ్యములు

ఈ రాజ్యములు విస్తృతములు- సుభిక్షములైనవి ఈ వర్గములలో ప్రతియువకుఁడును 18 సం॥ మొదలు 21 సం॥ల వఱకును శస్త్రవిద్య నభ్యసించియే తీరవలె నను నియమ ముండెను. పురుషులే గాక యనేకమంది స్త్రీలును శస్త్రవిద్య నభ్యసించుచుండిరి. ఇట్టి సాహసములే పరదేశ చరిత్రకారులు "A nation in arms" అను స్తుతిగీతములతో బాగడిరి. తమదేశముయొక్క స్వాతంత్ర్యమును రక్షించుటకై ప్రాణములను తృణప్రాయముగ నెంచి యుద్ధము సేయుట మహా కర్తవ్యములలోఁ గర్తవ్యము. దానినిమించిన కీర్తి లేదు. ఇది యాగణరాజ్యముల విశ్వాసము. ఇట్టి గణరాజ్యములు పంచనద ప్రాంతములందు, వ్యాసనదీపీఠభూములలో వ్యాపించి యుండెను.

పౌరవునిఁ జయించి - చుట్టుపట్టులనున్న చిన్నచిన్న రాజ్యములతోఁ బోరి - వారిని నిర్జించుచు గ్రీకుచక్రవర్తి

వితస్తా (జీలం) చంద్రభాగ (చీనాబ్) యనెడు నదుల నుత్త రించి వ్యాసనది నాక్రమించుటకై వచ్చుచున్న సంరంభ మును జూచి యానది సమీపముల నివసించుచున్న యాధేయగణములు యుద్ధము నాహ్వానించెను. "శరణు జొందుఁడు"ని యలెగ్జాండరు బంపిన యాహ్వానము నవి తిరస్క రించినవి. ఇంతయైనను మగధదేశపు సామ్రాట్టని పేరువెట్టి కొన్న పరాక్రమశూన్యుఁడైన 'ధనానందుఁడు' నిద్ర మేల్కొనలేదు వాని కనులఁ గప్పిన తెర మాయనేలేదు. ఆతని యీ యుపేక్షాభావము యాధేయ గణరాజ్యముల సాహసమున కేమియు నడ్డువచ్చినదిగాదు. వారుమాత్రము వీతశంకులై బోరుట కారంభించిరి. వారు కేవలము తమ బలముపైననే యాధారపడిరి.

## సికందరుని బలములు భయపడినవి

పంచనదప్రాంతములందు సింధు, వితస్త, చంద్రభాగ- యీ నదులను దాటుటకుఁ బోరుచుఁ బోరుచు వచ్చుచున్న గ్రీకుసైన్యము వ్యాసనదీతీరమును జేరినది. వారపుడు ఆ నది కావైపు 'యాధేయ గణరాజ్యములు' దమ స్వాతంత్ర్య రక్షణార్థమై కత్తి ఝుళిపింపఁ బోవుచున్నవని దెలిసికొనిరి. వారి సైన్యశక్తియొక్క ఖ్యాతిగూడ గ్రీకుసైనికుల చెవికి సోకినది. ఇంతమాత్రమేగాదు. యాధేయగణముల నొకవేళ జయించి ముందుకేగినను- దానిపై గంగోపకంఠమున గొప్ప గొప్ప రాజ్యములు యుద్ధమొనర్చుటకుఁ దయారుగ నున్న వను వార్తగూడ వారి కర్ణములకుఁ సోకెను. ఇంతవరకును 'పంచనద' ప్రాంతములలో భారతీయులతోఁ బోరి పోరి యలసి

పోయినవారుగాన 'వ్యాసనది'ని దాటి సమగ్ర విక్రముతైన యౌధేయ గణరాజ్యములతోఁ బోరు తెగువ లా గ్రీకుసైని కులకు లేవు.

కాని- గ్రీకుచక్రవర్తి ధైర్యమునకు మేరువు. అతఁడు జయశీలుఁడు. అతఁడే సేనాపతియై సైన్యముల నడపుచుం డెను. ఆతని యుద్ధపిపాస యిప్పటికిని లేశమాత్రము దగ్గినది గాదు. వ్యాసనదినిఁ దాటి-యౌధేయగణములఁ దాటి-మాగధ రాజ్యము నతిక్రమింపవలెనని దినదినము సైనికుల నాతఁడు హెచ్చరించెడివాఁడు. అడుగడుగునను- గ్రీకు చక్రవర్తి యొనర్చుచున్న రణఘోష రాఁగరాఁగ వారి కసంతోష మునే గల్గించినది. వారిలో గుసగుసలు బయలుదేరెను. వారి కీ యుద్ధ మిష్టములేదు. అందరుజేరి యేకకంఠమున "యుద్ధము మాచేతగా"దని చెప్పుటకై సన్నద్ధు లగుచుండిరి. అలెగ్జాండరు "ద్యు" దేవతయొక్క పుత్రుఁడని సమ్మతించుటలో వారికి లవలేశము సందేహము లేదు కాని యాతని రాజ్యతృష్ణపై వారికిఁ బ్రీతిలేదు. ఈ గుసగుసలు గ్రీకుచక్రవర్తి చెవుల కెక్కినవి. వారి నుత్తేజిత మొనర్చుటకై యాతఁ డన్నమాట లివి: "గ్రీకుసైనికు లజేయులు. ఈ కీర్తి సర్వజగత్తులను వ్యాపించినది. దానినైవ్వఁ దిలకింపుఁడు. భారతదేశమున మీరు ప్రవేశించినవెనుక మన కపజయము గల్గినదిలేదు. అయినను మీ 'రింతవరకు బోరినది చిన్నచిన్నశత్రువులతోనే. పెద్దయుద్ధములు ముందున్నవి. వ్యాసనదికావలనున్న యొక గణరాజ్యము మనల శరణువొందక యుద్ధమునకు సిద్ధపడు చున్నది. దాని తలవంచి- యాపైనున్న గంగాప్రాంతము

లందలి సుభిక్షరాజ్యములను జయించి- గ్రీసుదేశముయొక్క దిగ్విజయ ఢక్క యన్నిదిక్కులయందును మ్రోయింతురు గాక !"

కాని యుద్రేకపూరితములైన గ్రీకుచక్రవర్తి యీ వాక్యములు వారిలో సాహసము నుద్రేకింపఁ జేయలేదు. విరుద్ధ ఫలమునుగూడ గల్గించినవి. "ఇంతవరకును మీరొనర్చిన యుద్ధములు చిన్నవే. ఇకముందు పెద్దయుద్ధము లున్నవి." ఈ మాట యలెగ్జాండరు నోటినుండియే వెలువడినది. ఈ వాక్యములు తలఁచుకొన్నవెంటనే యీ సైనికుల గుండెలు చెదరెను. డా॥ "జయస్వాల్" మహాశయుఁడు తమ "Hindu Polity" యను గ్రంథమున నిట్లు వ్రాసిరి: "The greek army refused to move an inch forward, to face the (Bharathiya) nations whose very name, according to Alexander struck his Soldiers with terror."

గ్రీకుసైన్యము చాల యలసినది. యీ ధేయ గణమన్నంతనే దానికి భయ మావరించినది. దానిపై నింకను గొప్ప రాజ్యములట! ఇవన్నియుఁ దలఁచి గ్రీకు సైన్యము వ్యాసనదినిఁ దాటుటకుఁ దమ యసమ్మతినిఁ దెలుప నూహించుచుండెను. తన యాజ్ఞలనే యది ధిక్కరింపఁ బోవుచున్నది! ఈ విషయము గ్రీకుచక్రవర్తి యూహించుకొనెను. అలెగ్జాండరు సర్వశక్తుఁడైన యోధుఁడు మాత్రమేగాదు. క్రియాకుశలుఁడు - గూడ. అతని మనస్సున గోపము, నిరాశ, దుఃఖము మొదలగు నెన్నియో భావము లాక్రమించినవి.

ఆతఁడుఁ దన గుడారములోనికి వెళ్లెను. ఎవ్వరితోడను బలుకలేదు. మూఁడు దినములా చక్రవర్తి గుడారమునుండి బయటికి రానేలేదు. తరువాత – నాల్గవదినమున నాతఁడు సైన్యమునంతయుఁ దన గుడారము నెదుట జేర్చెను. వారితో ననాన్నఁడు: "వ్యాసనదిని దాటి ముందునకు బోవు నభిప్రాయమును నేను వదలుకొన్నాను. మనము మనదేశమునకు మరలి పోదముగాక!" ఈ వాక్యమును విన్న సికందరు సైన్యమున కానందమే యానందము!" కాని – వెనుకకుఁ బోవుటెట్లు? "భారత దేశము నంతయు జయింతు"నని యాతఁడింతవరకు డంబములు గొట్టుచు వచ్చెను. ఇపుడు వెనుదిరిగినచో – దారిలో నున్న దేశములన్నియు నాతనిని బరిహాసించి తీరును. అలెగ్జాండరు భయపడినాఁడని నిశ్చయించును. అందుకై యాతఁడు భూమార్గమున దిరిగి పోవుటకు సమ్మతింపలేదు. సింధునదిలో బ్రయాణించి – యటనుండి సముద్రమార్గమున "యిరానీ" దేశమునకుఁ బోవుటకై నిశ్చయించుకొన్నాఁడు. మరల దండెత్తి వచ్చి కొన్ని గంగోపకంఠ రాజ్యములను జయించి భారతదేశ దిగ్విజయమును బూర్తి సేయవలయునని చక్రవర్తి యాశ.

అలెగ్జాండరు మరల నొకసారి భారతదేశముపై దండెత్తి వత్తునన్నాఁడట! ఈ మాట నిజమే గావచ్చును. కాని – గ్రీకు సేనాపతీ! యింకొకసారి యనఁగా నెప్పుడు? గంగోపకంఠరాజ్యము లింకను – నిన్నెదిరింపనే లేదు. నీవు జయించినవి భారతదేశపు టెల్లలలో నున్న కొన్ని చిన్న రాజ్యములను మాత్రమే! అవి మరల స్వతంత్రములైనచో!

లేదు. నీవు పలికిన యా "యింకొక్కసారి" యనుకాలము రాకముందే నీవు మృత్యుగ్రస్తుఁడవైనచో "డ్యూ" దేవత యొక్క పుత్రుడను నేనని పలుకుచు పలుకుచునే నీవస్తమించిపోదువు. మరి - గ్రీకు దేశమునకు నీచే గలిగిన మేలు?

భారతదేశముపైకి మరల దండెత్తి వత్తునని - భయపెట్టిన గ్రీకుచక్రవర్తి కెవ్వఁడేని యొక సన్యాసి - లేక యతి యిట్లు బదులొసఁగు ననుకొందము. ఈ యుత్తర మస్థానపతితము కాదుగదా!

## అలెగ్జాండరు తిరోగమనము

పైకి వేయి ప్రగల్భములు గొట్టుచున్నను - వ్యాస నదీ తీరములనుండు యౌధేయాది భారతీయ దళముల పరాక్రమము నెదుట నిలచుటకు గ్రీకుసైనికులకు గుండెలు లేవని యలెగ్జాండ రెఱిఁగియే యుండెను. అవక్రమైన భారతీయ విక్రమము - గ్రీకుయోధుల గుండెలపై బల్లెమైనది. ఎట్టకేల కలెగ్జాండరు వెనుదిరుగ నిశ్చయించుకొన్నాఁడు. అతఁడు స్వయముగ వెనుదిరుగ నిచ్ఛగింపలేదు కాని - భారతీయుల పరాక్రమ మాతనిని వెనుకకు నెట్టినట్లయ్యెను. ఇది యైతిహాసిక సత్యము. పగటి యెండవంటి యీ సత్యమును గప్పిపుచ్చుటకు పాశ్చాత్య - గ్రీకు చరిత్రకారు లెంతయో ప్రయత్నించిరి. వా రిట్లు వ్రాసిరి: "సికందరు వ్యాసనదిని గడచి వచ్చియుండినచో యౌధేయగణములనేమి - మగధ దేశమునుగూడ జయించి యుండెడివాఁడు. మాగధులు, యౌధేయులు - గ్రీకుచక్రవర్తి నెదిరించి పోరిరి. కాని -

యాతనిని వా రెప్పుడును విజితుని గావింపలేదు." ఇట్టి యవక తవక మాటలతో భారతీయ విక్రమమును గప్పిపుచ్చుట కా చరిత్రకారులు యత్నించినారు. వారి కీ క్రింది శ్లోకమే యుత్తరము—

శ్లో॥ కాకథా బాణసంధానే జ్యాశబ్దేనైవ దూరతః
హుంకారేణైవ ధనుషః స హి విఘ్నా న్యపోహతి॥

శరాసనముయొక్క హుంకారముతో సమానమైన "జ్యా" శబ్దముతోడనే యాతఁడు విఘ్నముల బోఁద్రోలును. ఇఁక శరము దొడిగిన నేమి చెప్పవలెను?

అలెగ్జాండరు దన సైనికుల కెన్నియో వీరప్రలాపముల నూరిపోసెను. కాని - భారతీయ రణ విక్రమమునకు ముందు నిలచు గుండెలేవీ? అతని యీ ప్రతాపములుగూడ - మగధాదులైనవా రెదిరినపుడు - మట్టసముగ - మాయమగును. చంద్రగుప్తుఁడు రణాంగణమున కవతరింపఁ బోవుచున్నాఁడు

## అలెగ్జాండ రొక బలాఢ్యమైన నావికాదళమును నిర్మించెను

వ్యాసనదిని దాటుటకు సైనికులు సిద్ధముగ లేరు. అందుచే నలెగ్జాండరు సింధునదీద్వారమున తిరోగమించుటకు నిశ్చయించికొన్నాఁడు. ఐదారు వందల నావలు దయారు చేయఁబడెను. వానిపై శస్త్రసజ్జితులై గ్రీకుసైనికు లెక్కినారు. అవి గదల నారంభించినవి. ఇంతలో దారిమధ్యనే "బేబిలోనియా" నుండి వచ్చుచున్న రెండు క్రొత్త సైన్యములు వారితోఁ జేరెను అవి యలెగ్జాండరునకు సహాయ మొనర్చ

టకై బంపఁబడినవి. వానినిఁ జూచి గ్రీకు సైనికుల కొక యుత్సాహము రేగినది.

సికందరు వెనుదిరిగి పోవుచున్నాఁడన్న వార్త దేశమున వ్యాపించెను. గాంధారమునుండి "వ్యాసనదీ" పర్యంతమున్న భారతీయ జనపదములు తిరుగఁబడ నారంభించినవి. ఈకథ విపులముగ ముందు వచ్చును. అలెగ్జాండరు "నేను మరల భారతదేశముపై దండెత్తి వత్తు" నన్నాఁడుగదా! ఈ మాటలు ప్రగల్భములని భారతీయ రాజ్యములకు స్పష్టముగఁ దెలిసిపోయినది. అతఁడు సింధునదిలోఁ బ్రయాణించునపుడు - దాని ఉభయతీరములందున్న గురు లఘువులైన గణరాజ్యములు గ్రీకుసైన్యముపైఁబగదీర్చుకొనుటకుఁ-దయారయ్యెను. ఆ గణరాజ్యము లన్నియు - నేకత్ర సజ్జితములై యెదిరించియున్న బాగుండెడిది. కాని - యతఁడు దారసిల్లిన చోటు - వేఱువేఱుగనే పోరుట కవి నిశ్చయించుకొన్నవి. గాంధారమునుండి పంచనదపర్యంత మిట్టి యుద్ధములేగదా జరిగినవి. వీనివల్ల అలెగ్జాండరుకు అధికశ్రమ కలిగిననూ, ఇవి తమ అనైక్యతవలన అతనిని ఆటంకపరచలేకపోయెను. ఎదిరిన ప్రతి స్వతంత్ర గణరాజ్యమును ఘోరమైన విక్రమమునే ప్రదర్శించినది. వానిలో రెండు గణరాజ్యములయొక్క వీరగాథ గ్రీకుచరిత్రకారులుగూడ ముక్తకంఠమునఁ బ్రశంసించిరి. ప్రశంసింపక వారికిఁ దప్పదయ్యెను.

## మాళవ - శూద్రక గణరాజ్యములు

ఈ రెండును సింధుతీరము నందున్న ప్రత్యేకములైన రాజ్యములు స్వతంత్రములు, సంపన్నములు, ప్రజాసత్తాకములు వీనికున్న స్వాభిమాన మద్వితీయము. ఈ రెంటియందును- మాళవరాజ్య మనేకకాలమునుండి విఖ్యాతమైనది. ఈ రెండు రాజ్యములనడుమ గొన్ని వైరములుగూడ నుండినవి కాని- సికందరు శాహి నావికాదళముతోఁ దరలిపోవుచున్నాఁడన్న వార్త వారి చెవుల సోకెను. గణరాజ్యములు విశకలితములుగ బోరుటచేతనే యాతఁడు వారిని జయించికొని రాఁగలిగెననియు వారు గ్రహించిరి. స్వార్థాభిమానములకంటెను- రాష్ట్రీయమైన ధర్మనిర్వాహణకు వారు ప్రాధాన్య మొసఁగిరి. ఆ రెండు గణరాజ్యములును యేకత్ర మిళితమై యొకనాయకునిక్రింద బోరుటకు నిశ్చయించికొన్నవి. ఇంతమాత్రమేగాదు. వారు దమలోఁదాము సామాజికములైన సంస్కరణములుగూడ జేసికొనిరి. ఈ రెండు జాతులొకటిగాఁ జేరిపోవలెనని వారి యాశ. ఈ రెండునేకమై ఒకే రక్తము, ఒకే బీజముగలిగి- పరస్పర హితకారకమై వర్థిల్లవలెనని దీవ్రముగ వారు భావించినారు. అందుచే- వారిలో వారికి- సాముదాయిక వివాహము లారంభమయ్యెను. ఒక్కపెట్టున వేలాది వివాహము లాజాతులు బరస్పర మొనర్చికొన్నవి.

మాళవ శూద్రకములు అలెగ్జాండరు నెదిరించెను. తుములసంగ్రామమైనది. ఈ యుద్ధమున నా గణరాజ్యముల

నగరము నొకదానిని సికందరు ముట్టడించెనట! దాని పేరు స్పష్టముగ దెలియవచ్చుటలేదుగాని- యదియొక ప్రధాన నగరము. భారత వీరులు- ప్రాణములకుఁ దెగించి పోరిరి. గ్రీకు సైనికులు వెనుకంజ వేసిరి. ఈ యవమానము గ్రీకు చక్రవర్తి సహింపలేకపోయెను. అతఁడు నిచ్చెనలువైచికొని కోటపై కెక్కి- పోరవలసినదిగా దనసైనికులను గోరెను.

"వ్యాసనది" నుత్తరింపుఁడన్నప్పుడా సైనికులకు గలిగిన యసంతృప్తియే యీయాజ్ఞతోను గలిగెను. క్రొత్తయుద్ధములు వారి కిష్టములేదు. ఇండ్లకుఁ బోవలెనని ప్రాణములు దహతహలాడుచున్నవి. అందులకే వారీ మార్గమును బట్టినది. ఇక్కడగూడ వారికి యుద్ధములు దప్పలేదు. చక్రవర్తియొక్క రాజ్యతృష్ణ యా సైనికులకు శాంతి దక్కనిచ్చుటలేదు మాళవ - శూద్రకములు సామాన్యములు గావు. గ్రీకుసైనికుల సహనశక్తి యెండిపోయినది. వారందఱు జక్రవర్తికిఁ దమ యసమ్మతిని దెలుపవలెనని కోరుచుండిరి.

(When the Macedonian soldiers found that they had still on hand a fresh war, in which the most warlike nations (గణ) would be their antagonists, they were struck with unexpected tenor and began again to up-braid the king in the language of sedition. (Curtius as quoted in "Hindu Polity")

ఎంతగా బ్రయత్నించినను- ఆనగర మాతనికి లోబడినదిగాదు. గణరాజ్యములు ప్రాణములకుఁ దెగించి పోరుచుం

డెను. ఈ దృశ్యము గ్రీకు చక్రవర్తికి సహింపరాకుండెను. అతఁడు వారితో నిచ్చెనపై కెక్కి దూకి పోరాడమన్నాఁడు. దానికి సరియైన సమ్మతిని సైనికు లిచ్చినట్లులేదు. అలెగ్జాండరు తానే వారికి గుణపాఠము నేర్పఁదలఁచెను. అందఱికన్నను ముందు తానే నిచ్చెనపైకి దూకి యలెగ్జాండరు ముందుకు నడచినాఁడు. ఎంతసాహసము? ఈ దృశ్యమును జూచినవెంటనే గ్రీకుసైనికు లుత్తేజితులైరి. చీమల బారులవలె వారు గబగబ సోపానములపై కెక్కిరి. అందరును నిచ్చెన నుండి దూకినారు. నగరములో బ్రవేశించిరి. ఇరువాగుల సైనికులును యెవ్వరెవ్వరికినిఁ దీసిపోక బోరుచున్నారు. ఇంతలో - ఒకానొక భారతీయవీరుఁడు ధనస్సున విషలిప్తమైన బాణమును సంధించి యాకర్ణాంతము లాగి వదలెను. అది వడివడిగావచ్చి స్వర్ణకవచధారియై సైనికుల నుత్తేజిత మొనర్చుచు ముందునడచు గ్రీకు సామ్రాట్టు- సేనాపతి యలెగ్జాండరును సమీపించెను. ఆశరమును వదలిన మహావీరుని పేరేమో!

అది శరముమాత్రము గాదు. మూర్తిమంతమైన భారతవీరుల క్రోధము. మహారాష్ట్ర కవులలోఁ బ్రసిద్ధుఁడైన "మోరోపంతు" యీ క్రింది శ్లోకమును వ్రాసెను.

"తో శర్ గరధర వరసా<br>
పవిసా రవిసా స్మరారి సాయకసా<br>
మ్లేచ్ఛ హృదంతరి ఘుసలా<br>
వల్మీకా మాంజి నాగ నాయకసా"

భారతవీరుఁడు ప్రయోగించిన యాబాణ మట్టిదియే! అది ప్రవేశించిన విధమును నట్లే!

## ఆ బాణముచే నలెగ్జాండరు గాయపడి క్రిందఁబడెను

భారతవీరునిచేత వదలఁబడిన యాశరము నేరుగ గ్రీకు చక్రవర్తి వక్షస్థలమున దూరినది. అతఁడు నేలపైఁబడి పొరలాడ నారంభించెను. ఈ దృశ్యమును జూచి యొకానొక గ్రీకు సైనికుఁడు- తన డాలుతో నాతనిని కప్పినాఁడు. అలెగ్జాండరు రణభూమియందుఁ బడి మూర్ఛిల్లెనన్న వృత్తాంతము సైనికులలో జిచ్చువలె వ్యాపించినది. వెంటవెంటనే గ్రీకు సైనికు లాతని చుట్టును మూగిరి. ఆ చక్రవర్తి వారి శిబిరము లోనికిఁ గొనిరాబడెను. ఆ సైనికులకు చక్రవర్తి వక్షఃస్థలమున గ్రుచ్చుకొన్న బాణము బయటికిఁ దీయునప్పటికిఁ జాల ప్రయాస యయినది. ఓరంత ప్రొద్దున కలెగ్జాండరు కన్నులు దెరచెను. తల్లడిల్లుచున్న సైనికులకు ప్రాణములు గుదుటఁబడినవి, ఆ గాయము బాగుపడుటకు గొన్ని దినములు పట్టెను. ఆ దినములలో నలెగ్జాండరు హృదయమున నెన్ని తలఁపులు మెదలెనో!

అలెగ్జాండరునకు గలిగిన యీ యవస్థ-"బాబిలోను" మొదలు గ్రీకుదేశ పర్యంతము శరవేగమున బర్వెత్తినది. సికందరువంటి మహావీరుఁడు యుద్ధమునఁ బడిపోయెను. ఈ వార్త విన్నదే తడవు గాంధారమునందును,"ఇరాను" దేశమునందును విప్లవములు మొలకెత్తెను. చక్రవర్తి క్షతగాత్రుఁడయ్యెనేగాని- "చావలేద"న్న వార్తయును మరల దేశము

లందు వ్యాపించినది. ఈ వార్తతో నా రెండు దేశములలోని కల్లోలములు గొంత శాంతించెను.

ఇట్టి పరిస్థితి భారతదేశమున — సందునను — వీర్యవంత ములైన మాళవ — శూద్రక గణరాజ్యములందు శత్రువులకు గల్గుట గర్వకారణమే! భారతీయులు పౌరవరాజును— గ్రీకులు యుద్ధమున నేనాఁడు జయించిరో — క్షతగాత్రుని జేసిరో నాటనుండియే ప్రతీకారమునకుఁ బూనుకొన్నారు. పౌరవ విజయముతో నలెగ్జాండరునకుఁ గలిగిన గర్వమునకు మితిలేకపోయెను. ఆతఁడు పౌరవయుద్ధసూచకముగ దనప్రత్యేక నాణెములను ముద్రింపించెను. వానిపై పౌరవరాజును యుద్ధ భూమిలో దాను జయించిన చిత్రము ముద్రింపఁ బడినది. నాణెము లిప్పటికిని దొరకును. భారతవీరులు గ్రీకురాజును యుద్ధరంగమున బడవేసి, నాటి యవమానమునకు అక్షరశః ప్రతీకార మొనర్చిరి. భారతీయుల రక్తమును ద్రావిన యా మ్లేచ్ఛ "సమ్రాట్టు" అలెగ్జాండరుపై నాతని రక్తమును రణాంగమున గార్చి భారతవీరులు గసిదీర్చుకొన్నారు.

భారతవీరుని బాణము చక్రవర్తి వక్షఃస్థలమున గ్రుచ్చుకొన్నట్లు బాణవిద్ధుఁడైన యలెగ్జాండరు రణ భూమిని బొరలాడుచున్నట్లు చిత్రములు ముద్రించిన నాణె ములను గణరాజ్యములుగూడ నాఁడు ముద్రించెనేమో! చరిత్రకారులు శోధింపవలెను

అలెగ్జాండరు యొక్క రణనీతి మహాక్రూరమైనది. తన్నెదిరించిన రాజ్యములం దాతఁడు జూపిన నిర్దయ సామాన్య

మైనదిగాదు. కాని - తన్నెదిరించిన ప్రతివీరులతో సామ వాక్యములాడి - తన కార్యమును సాధించుకొను నటనల యందుఁ గూడ నాతఁడు నిష్ణాతుఁడే! మాళవ - శూద్రక రాజ్యము లాతనికి లోఁబడలేదు. భారతీయుల శర మాతని గన్నుల దెరచెను. అందుపైఁ బ్రతివీర సేనాపతులతో నాతఁడు సామ వాక్యములు బలుక నారంభించినాఁడు. "శస్త్రసంధి జరుగవలెన"ని బ్రతిపాదించెను. ఈ సంధిపై - శత్రుపక్షము నుండి వందమంది గణనాయకుల నాహ్వానించెను. భారతీయ ప్రతినిధులను సమ్మానించుటకై - దన శిబిరమున గ్రీకు చక్ర వర్తి యొనర్చిన యేర్పాటులకు లెక్కలేదు. ఆ నాయకులు చక్రవర్తి శిబిరమును జొచ్చినంతనే వారి కనర్ఘముగ నాహ్వా నము జరిగెనట! ఈ సన్నివేశమును గ్రీకు చరిత్రకారులు వేలువేలుగ- విపులముగ - వర్ణించిరి. స్థలాభావముచే వానిని సమగ్రముగ నుద్ధృతీకరింపఁ దలఁప లేదు. ఆ సన్నివేశ మసాధారణముగ నుండెనట! గణరాజ్య నాయకులు వీరులు. వారి శరీరములు మహోన్నతములు. వారి వేషములు గంభీర ములు, వైభవోపేతములు. వారి వీరకేదారములలో వజ్ర ములు, ముత్యములు జిగజిగ మెఱయుచుండెను. ఒక్కొక్క నాయకుఁడును దృఢమై, యలంకృతమై - బంగారు తగడులు గప్పిన రథములపైఁ గూర్చొని వచ్చిరి. ఒక్కొక్కరి వెంటను- భూషితములైన గజరాజములు గదలివచ్చెను. ఆయేనుఁగులు గ్రీకుల గజములకంటె యెంతో యాకర్షకముగ నుండెనట!

"ఈ ప్రతినిధులలో నొకరి బాణమే దన వక్షస్థలమున గ్రుచ్చుకొనెన"ని గ్రీకు చక్రవర్తి యెఱుఁగును. వారి విక్ర

(6)

మును నాతఁ డూహించెను. అందుచే నుదారమనస్కుతను బ్రకటించి యలెగ్జాండరు వారికిఁ దన రాజ్యవైభవమును బ్రదర్శించినాఁడు. ఆ నాయకులకు భోజన సమారంభము లేర్పాటు సేయఁబడినవి. వారి కేర్పరుపఁబడిన పీఠికలు రత్నఖచితములు. వేలువేలుగఁ గ్రీడోత్సవములు- గాయన వాదనములు - నర్తనాదులు ఏర్పాటు జేయఁబడెను. కడ కలెగ్జాండరునకు - మాళవ - శూద్రక గణరాజ్యములకు సంయుక్తసంధి జరగినది.

ఈ సంధి వివరములను గ్రీకుచరిత్రకారులు భిన్నభిన్నములుగ దెలిపిరి. వారి యా వ్రాఁతలన్నియు సమన్వయపరచి చూచినచోఁ దేలెడు విషయము లివి: ఉభయపక్షములును యుద్ధము నాపవలెననుట యొకషరతు సింధునదీ మూలమున గ్రీకుసైన్యములు బ్రయాణించునపుడు మాళవ-శూద్రక దేశములలో నాతని కేవిధమైన బాధయు రాకుండునట్లు జూచుకొనుట రెండవ షరతు. ఈ రెండు గణరాజ్యములలో మాళవరాజ్యముయొక్క ప్రసక్తి యికపైనిఁగూడ రాబోవును. తరువాతి చరిత్రలోఁగూడ నా రాజ్యము శకులను, మ్లేచ్ఛశక్తితో పోరి అమోఘవిక్రమమును బ్రదర్శించెను. ఆ సంఘటనములనుబట్టి కొన్ని శతాబ్దముల వఱకును - మాళవ దేశప్రభ వెలుఁగుచుండెనని మన మూహింపవచ్చును.

భారతీయేతిహాసములోని - కొన్ని వీరగాథలు యీ ప్రకరణమునకే సంబద్ధములైనను స్థలాభావముచేతను - గ్రీకులు వానిని దడవక పోవుటచేతను - యిచట విపులముగ

వర్ణింపఁబడలేదు. వానిలో రెండు మూఁడుమాత్ర ముదాహ రింతును.

## "మాసాగా" పై హఠాత్తుగ నాక్రమణ

'మాసాగా' యనుచోట- నలెగ్జాండరు నేడువేలసైనికు లెదిరించిరి. వారందరును ఆతని చేతికిఁ జిక్కినారు. అందులో ననేకులు స్త్రీలుగూడ. "మీరందరు నా సైన్యముతోఁ గలసి పోవలెను. నాతోఁ జేరి నన్నెదిరించు భారతీయులతో మీరుఁ గూడఁ బోరాడవలయును. ఈ షరతునకు మీ రంగీకరించుచో - మిమ్ముఁ బ్రదుకనిత్తును. లేనిచో నురి దీయింతును. మగవాండ్ర నందఱ నూడిగకాండ్ర నొనర్తును. ఆడువారి నూడిగఁపుఁగ తెలుగ నొనర్తును". యని గ్రీకుచక్రవర్తి వారితోఁ బలికెను. ఆ సేనలోని ముఖ్యులు యలెగ్జాండరు నభిప్రాయమున కంగీకరించిరి. కాని- "మా కొకరాత్రి యవధి యొసఁగినచో మే మందఱ మొకచోటఁ జేరి - విషయమును దేల్చికొని మా సమ్మతి నెఱిఁగింతు" మన్నారు. "అట్లే"యని యలెగ్జాండ రొకరాత్రి గడువొసఁగెను. అలెగ్జాండరు సేనా శిబిరమున కెదుటఁ దొమ్మిదిమైళ్ళ దూరములోపల యారాత్రి వారు నివసించుటకు చక్రవర్తి యొడఁబడెను ఈ సన్నివేశమును "విన్‌సెంట్ స్మిత్" తన గ్రంథములో నిట్లు వర్ణించెను:

"The Indian being unwilling to aid the foriegners in the subjugation of their countrymen desired to evade the unwelcome obligation."

ఆరాత్రి భారత సైనికు లొకచోట గుమిగూడిరి. వా రిట్లు

నిర్ణయించికొని వచ్చిరి. "స్వశరీరముల రక్షించుకొనుటకై గ్రీకులవంటి పరరాష్ట్రీయులతోఁ బొత్తుగల్పుట యనుచితము. పైగా వారితోఁ జేరి మనజాతివారిపైఁ గత్తి దూయుట ఘోరపాపము! అట్లు జేసినచో మనరాజ్యము వారికి సర్వథా లోఁబడి పోవును. ఎట్టి విషమస్థితిలో నైనను- నీ పాపము మన మొనర్పరాదు తెల్లవారులోపల నా సైనికులు శత్రువుల కన్నుగప్పి దారి కొకఁడు బయవెత్తి పోవుటకు నిశ్చయించికొనిరి. ఇట్లు నిర్ణయించికొన్నతర్వాత వారు గొంతసేపు నిద్రించిరి. ఇంతలో వీరి నిర్ణయము సికందరుశాహికిఁ దెలసినది. గ్రీకుసైన్యము వీరిపై వచ్చి పడెను. నిద్రావస్థయందున్న భారతీయులను - గ్రీకు సైనికులు నిష్కరుణముగఁ జంప నెంచిరి. ఇంతలో వారు దెప్పరిల్లుకొన్నారు. శస్త్రములు సరుదుకొనిరి. ఆసైనికులు దమమధ్య జక్రాకారమైన యొక వ్యూహమును రచించి - తమతో నున్న స్త్రీలను, శిశువులను ఆమధ్యఁ జేర్చినారు. సైనికులు ముందుకు రణమునకై దూకినారు. కొందఱు స్త్రీలుగూడ గ్రీకుసైన్యములతో ధైర్యముగఁ బోరాడి మరణించిరి. కడ కా సైన్యమంతయు గ్రీకుల చేతులలో మరణించెను---

"The gallant defenders met a glorious death which they would have disclaimed to exchange for a life with dishonour" (Early History of India by V. D. Smith, Page 51).

## అగ్రశ్రేణి

ఇది యొక భారతీయ ప్రజాసత్తాకరాజ్యము. ఈ రాజ్యము - చాల చిన్నదే. కాని - సికందరుశాహి కిది లోఁబడలేదు. అతని నావికాదళము సింధునదిని దాటి పోవు చున్నప్పుడు-క్షత్రధర్మానుసార మా దేశము, వారి నెదిరించినది. ప్రాణాంతకమైన యుద్ధము జరిగెను. గ్రీకుసైనికులు వారి రాజధానియొక్క- మేరలఁ బ్రవేశించి యుద్ధముసేయ నారంభించిరి. భారతీయుసైనికులు నగరమును దాటి వెలికి వచ్చి-రక్షణ లేర్పరచికొని యుద్ధముజేయ మొదలిడిరి. ఎంత బోరాడినను - నగర మలెగ్జాండరునకు స్వాధీనము గాలేదు. వారికిని యలెగ్జాండరు దాడి నోర్చుట జాల కష్టమైనది. కడకు - "According to Curtius when those brave fellows could not further resist the odds, they (the Agrashrenies) set their houses on fire and their wives and children and all threw themselves into the flames."

"కర్టిన్" అను యైరోపీయ చరిత్రకారుని మాట లివి: బహుసంఖ్యాకమైన గ్రీకుసైన్యము నెదుర్చుట కెప్పు డగ్రశ్రేణి కశక్యమయ్యెనో వా రపుడు దమ గృహములకును - భార్యలకును నిప్పంటించిరి. శిశువుల నాయగ్నులలోనికిఁ ద్రోసిరి. వా రంద రా బూదిలో హతమైరి. ఇట్లు చేయుటకు నేటిభాషలో "జోహర"ందురు.

## నేటి "జోహారు" నాటి "జయహార" శబ్దమే.

ఈ "జోహారు" సంప్రదాయము రాజపుత్రులలో నారంభమయ్యెనని యనేకులు దలంతురు. కాని గ్రీకుచరిత్రకారు లిట్టి సంఘటనము లనేకములు వారు వ్రాసిన చరిత్రలలో వర్ణించిరి. ఇట్టి త్యాగములకు గ్రీకు లెంతయో యబ్బురంపడినారు. దాని భావమేమి? ఈ జోహారు సంప్రదాయము మనలోం బ్రాచీనము. అనంగా - రాజపుత్రు లను నామమేర్పడుటకంటెను - ప్రాచీనము చరిత్ర కెక్కని పూర్వకాలమునుండియు - భారతయోధులు తేజోవంతమైన యీ సంప్రదాయము ననుసరించుచు వచ్చిరి "జోహార్" యనునీ శబ్దము - "జయ హార" యనుదానికి వికృతియేగావచ్చును. జయహారశబ్దము పురాతనయోధు లొనర్చుచుండిన రణఘోషలలో నొకటి. ప్రళయము - మరణము, మరణరంగము. మరణమునకు సంబంధించిన సర్వమునకును భారతీయాభిప్రాయము ననుసరించి యధిదేవత హరుండు. ఈ విశ్వాసము - తోనే భారతవీరులు యుద్ధములలో "జయ హార" యనుచు ముందునకుం దూకెడువారు.

మహారాష్ట్రవీరుల యుద్ధగర్జనగూడ "హర హర మహాదేవ" యనునదే. యుద్ధమునం జయించుట కశక్యమైనప్పుడు పరధర్మీయ- పరరాష్ట్రీయ హస్తములలో దమ మానములు నిలుచుట యరుదైనపుడు మనవా రాశ్రయించుచుండిన కడపటి యస్త్రమిదే! ఈ యాగ్నేయాస్త్ర మమోఘమైనది. పరధర్మములకు బానిసలై బ్రతుకుటకంటెను, స్వధర్మము

నకై, స్వరాష్ట్రమునకై మరణించుట యుత్తమోత్తమమైన ధర్మము. యుద్ధము సేయుటకు శక్తిగల మగవారందఱును రణరంగమునందు శత్రువులను నఱికి నఱికి మరణించుచుండగా వీరాంగనలు దమశిశువుల నెదలకుఁ గట్టికొని తామే యగ్ని నంటించికొని "జయ హర! జయ హర!" ఘోషలతో మరణించుచుండిరి. ఇట్టి- భయదసుందరమైన యాచారమే "జోహారు!" ఈ యాచారము కేవలము వాజ్మాత్రముగాదు. మనచరిత్రలో నీయాచారము ననుసరించిన ఘట్టములు నూఱులకు నూఱులు. క్షత్రియుల కిది యంతిమధర్మము.

యుద్ధములు జరగుచున్నప్పుడు శత్రునగరములలో నీ యగ్నిజ్వాలలు గన్పడినదే తడవు శాత్రవులు హతాశులగుచుండిరి. కారణమేమనఁగా - వారి కింక దోచుకొనుట కేమున్నది? దాసులుగనో - దాసీలుగనో పాలించుకొనుటకుఁ బాత్రులైన వ్యక్తు లేరీ? సికందరు- అల్లాయుద్దీను మొదలైన రాక్షసప్రాయులకు నిరాశను గల్పించు నుత్తమోత్తమమైన యస్త్రము భారతీయ స్త్రీలాశ్రయించిన యీ యగ్నికవచమే!

గ్రీకులు భారతదేశమున యుద్ధము లొనర్చినపుడు ఇట్టి సన్నివేశము లెన్నియో జరిగెను. గ్రీకులచేతికిఁ దొరకి మానహాని ననుభవించుటకంటెను- అగ్నిప్రవేశమే యుత్తమధర్మమని యాస్త్రీలు నిర్ణయించికొన్నారు. గ్రీకు చరిత్రకారుల కీ త్యాగములు బరమాశ్చర్యకరములయ్యెను. వా రెంతయో శ్లాఘించుచు నిట్టి ఘట్టములను వర్ణించిరి వారు

గావించిన వర్ణనలలో నొకటియే పై నుదహరించిన యగ్రశ్రేణుల గాథ!

## బ్రాహ్మణక జనపదములు

గ్రీకుసైన్యములు యుద్ధములు జేసికొనుచు సింధునదీ ముఖమునకు వచ్చినవి. వారి నక్కడి భారతీయ స్వతంత్ర గణరాజ్యము లెదిర్చెను. ఈ జనపదములలోని వీరు లగ్నిని బోలిన విక్రమము గలవారు. ఈ గణరాజ్యములన్నియుఁ జిన్నచిన్నవి. అలెగ్జాండరు నెదిరించునంతపాటి బలము వానిలో నొకదానికిని లేనిమాట వాస్తవము. కాని-యక్కడి బ్రాహ్మణక జనపదములు గ్రీకులకు లోఁబడక సాహసముతో నెదిర్చెను. పాణిని మహర్షి దన వ్యాకరణములో "బ్రాహ్మణకో నామ జనపదః" యని వచించియున్నాఁడు. ఆ ప్రదేశము అదియే యని "డా॥ జయస్వాల్" గారి యభిప్రాయము. పంచనద ప్రాంతములలో ఘోరాడునప్పుడు వేదాంతులపై యలెగ్జాండ రెంత వికృతముగఁ బగ దీర్చికొనెనో ముందే వివరించితిని. వారికి సంబంధించినవే యీ బ్రాహ్మణక జనపదములు. ఈ వార్త విన్నవెంటనే యలెగ్జాండరు రెండింతలుగ మండెను. వారిపై నాతఁడు జరపిన యత్యాచారములు ఘోరములు. "ప్లూటార్క్" మహాశయుఁడు అలెగ్జాండరును గురించి వ్రాయుచు నీవాక్యములు బలికినాఁడు: ("These Philosophers were specially marked down for reveng by Alexander as they gave him no less troubles than the meicenaries, they reviled

the princes who declared for Alexander and encouraged free states (in India) to revolt against his authority". చిన్నచిన్న యీ జనపదములుఁగూడ స్వాభిమాన ప్రేరితములై యలెగ్జాండరుతోఁ గడవరకుఁ బోరి మడసెను.

## పట్టణ ప్రస్థము

దీనినే నేఁడు మహమ్మదీయులు "సింధు హైదరాబాదు" అని పిలతురు. సముద్రముఖమునందును - పెద్దపెద్ద నదీముఖములందును గల నగరములను బట్టణములని సంస్కృతమున వ్యవహరింతురు. ఆంగ్లమున వీనిని "Port" లని పిలతురు. ఈ యాంగ్ల శబ్దము పట్టణ శబ్దభవమే గావచ్చును. సికందరు సముద్రమును దరియుచున్నాఁ డన్నవార్త యీ ప్రాంతములకుఁ దెలిసినది. ఆ గణరాజ్యములకు వాని యధికారము సమ్మతించుట యంగీకారము గాదు. గ్రీకుల నెదిర్చి గెల్చుటయు నశక్యమని వా రెఱుఁగుదురు. వారు మూఁడవ మార్గమును వెదకిరి. ఆ గణరాజ్యములు సాముదాయికముగ దేశత్యాగ మొనర్చెను. గృహద్వారములను- మాతృభూమిని వదలి స్వధర్మరక్షణకై వారు దేశాంతరములకు వెళ్ళిరి. అప్పుడు వారి హృదయము లెంత బాధపడెనో! హృదయ బాధ కంటెను ధర్మనిర్వహణమే యీ జనులకుఁ బ్రియమగు పదార్థము!

## సింధు సాగరమును ప్రవేశించినంతనే - సికందరు స్వదేశమునకు మరలెను

సింధునది సముద్రమునఁ జేరు ప్రదేశమును సింధు సాగరమని పిలచుట యుక్తము. ఇట్లే - గంగానది - సముద్రమున సంగమించు స్థలమును గంగాసాగర మందురు.

తన నావికాదళము సింధు సాగరమును సమీపించినంతనే సికందరుశాహి దానిని- రెండుభాగములొనర్చెను. ఒకభాగము నేఁడు "బెలూచి స్థాన"మని పిలువఁబడు దేశము దిక్కుగా భూమార్గమున "కిరాను" దేశమును జేరినది. ఆ మార్గము లానాఁడు - అతివికటములైన యరణ్యములతోఁ గూడి యుండెను. గ్రీకుసైనికుల కా త్రోవ లపరిచితములు. దారిలో వా రెంతయో గష్టపడి కడ "కిరాను" దేశమును జేరికొన్నారు. వేరొక భాగమునకు దానే నాయకుఁడై నడపించుచు క్రీ॥ పూ॥ 325 సం॥ ముందు సికందరు సముద్ర మార్గమున "కిరాను" జేరెను. ఆనాటి "కిరాను" దేశమంతయు గ్రీకులకు లోఁబడి యుండెను. అందుచే నటనుండి సులభముగ నలెగ్జాండరు "బాబిలోనియను" నగరమునుఁ జేరికొన్నాఁడు. అంతకు రెండేండ్లకుముం దాతఁడు భారతదేశమునంతయు జయించి దానికి "సమ్రాట్టు" నగుదు నను నాశలతో వచ్చెను. కాని మరలిపోవునప్పటి కా యాశలు బూరింపఁ బడనేలేదు. భారతదేశపు సమ్రాట్టు గాకున్నను కేవల సమ్రాట్టైనను నాతఁడు గాలేదు భారతదేశముపైకి యాతఁడు దండు వెడలుటతో గ్రొత్తగా సంపాదించికొన్న

దొక మనోవైకల్యము మాత్రమే! అలెగ్జాండరు భారత దేశముపైకి సేనాపతిగ దండెత్తి వచ్చెను. మరలినదియు సేనా పతిగనే!

## 'ఇరానీ' సామ్రాజ్యమునువలె భారతీయ సామ్రాజ్యమునుఁ గూడ స్వాధీనమం దుంచుకొనుటకు సాధ్యము గాలేదు

గ్రీకుసైనికులు—తమదేశమునకంటె యత్యంత విస్తృత మైన 'ఇరానీ' సామ్రాజ్యమును - స్వాధీనపరచుకొన్నారు. అలెగ్జాండరొక యలౌకికుఁడైన సేనాపతియనియే వారు దలఁచిరి. రెండు మూడు యుద్ధములతోనే వారు విశాలసామ్రాజ్యములను - పడిపోయిన గుడారములవలె స్వాధీన మొనర్చుకొనుచు వచ్చిరి. ఈ యద్భుత విజయములతో వారికిఁ దమ విక్రమములగురించి యొక యున్మాద మేర్పడినది. దానితో వారలెగ్జాండరును దేవసేనానియని యెంచిరి. ఈ గర్వ మలెగ్జాండరునుగూడఁ గలసికొన్నది. విజయవంతములైన దన సేనలతో నాతఁడు జగజ్జేత నగుదునని దలఁచెను. ఇరాను దాటినవెంటనే - భారతదేశ మున్నది. అందుచే నాతఁడు ఇరాను దేశమువలెనే భారతముఁగూడ జయించి, దానికి 'సమ్రాట్టు' నగుదునని యూహించెను. కాని, భారతదేశ రాజ్యములు, ఇరానీదేశ మంతసులభముగా స్వాధీనమునకు వచ్చెడివి గావు. ఇరానీవలె భారత మంత సులభముగ లొంగునా ?

అతని యనుభవముఁగూడ నీ విషయమునే స్థిరపరచెను. భారతమునం దడుగడుగున నాతనిని శత్రువు లడ్డగించిరి.

జరగిన యుద్ధములలో గ్రీకు సైన్యములు గెలచినది నిజమే యైనను- నవిరళ సంగ్రామములతో నాసైన్యము లలసి పోయి నవి. ఇరానీ వలెనే సమస్తభారతమును జిటికెలో లోఁగొం దుమన్న గ్రీకుల పలుకులు ప్రగల్భములుగనే నిలచిపోయినవి. ఎంతశ్రమించినను సింధునదీప్రాంతములవఱకు జయించుసరికి వారికిఁ దలప్రాణము తోకకు వచ్చినది. స్వదేశమునకు మరలక తప్పలేదు. మనోరథము విఫలమాయెను.

గ్రీకు చక్రవర్తి ఉత్సాహ మారిపోయెను. ఆతని ధైర్యముమాత్రము నశించలేదు. తాను జయించిన రాజ్యములలో - నొకవ్యవస్థ నేర్పరచి - 'సిరియా — ఇరాను - బాబిలోనియా' — మొదలగువానివలెనే నీదేశమును బూర్తిగా స్వాధీనపరచుకొనుట కలెగ్జాండరు యెత్తులెత్తెను. కాలాంతరమున వచ్చి భారతమును పూర్తిగా జయింపవలెనని యాతఁడెంచినాఁడు. ఈ రెండునుఁ గలలే యైపోయినవి.

భారత దేశమున దాను జయించిన చోటులలో సికందరు దన క్షత్రపులను నియమించెను.

హిందూకుశ పర్వతములనుండి గాంధారపర్యంతము- తక్షశిలా ప్రదేశములో - వ్యాసనదీపర్యంతముగల పంజాబునం దర్ధభాగము- వితస్తా సంగమము మొదలుకొని సింధునదీ ప్రాంతములు - భారతదేశమున నింతమేర సికందరుశాహి చేతిలోఁ బడినది. తక్షశిలకు రా జంబుజుఁడని జెప్పితిమిగదా! అతఁడు హిందూకుశ పర్వతప్రాంతముల క్షత్రపుఁడుగా నియమింపఁబడెను. పంచనదీప్రాంతములకు పౌరవుఁడు

క్షత్రపుఁడైనాఁడు. ఇఁక సింధు- వితస్తా సంగమము మొదలు సింధు-సాగర పర్యంత మున్న భాగములకు "ఫిలిప్" మరియు- 'నికీయాన్' అనువారలు క్షత్రపులుగా నియమింపఁబడిరి వీరిర్వురును - గ్రీకు సేనానులు. వీరికి సహాయులుగా గ్రీకుల గుఱ్ఱపు దళము లుండెను. ఈ సేనానాయకులు దమకై గొన్ని నగరములు నిర్మించుకొనిరేమో! వారు జయించిన యితర దేశములలో "సలెగ్జాండ్రియా" యను పేరిట నగరములు గొన్ని గలవు. ఈ పేరుతోనే తక్షశిలా ప్రాంతములలోఁ గొన్ని నగరములను వారు నిర్మించిరేమో!

## "సికందరుశాహి" మరణము

తనచే జితములైన భారతీయ రాజ్యములం దొక వ్యవస్థను- నిర్మించుటకై యలెగ్జాండరు దలఁచుచుండెను. కాని- యింతలో విజితములైన దేశములలో రాజులు దన యధికారమును మన్నించుట లేదన్న వార్తలు సవసవగా వ్యాపించినవి. సికందరు సింధుదేశ మధ్యమున నున్నప్పుడే గాంధార ప్రాంతములలో విప్లవములు బయలుదేరిన సంగతి యాతని జెవి సోకియుండును. ఆ దేశములకు దన సైన్యములను బంపవలెనని యానాఁ డాతఁడు నిశ్చయించికొన్నాఁడు. కాని - పంచనదీ ప్రాంతములలో విప్లవములు బయలుదేరినవన్న వార్తలును, గ్రీకు చక్రవర్తి మరలి పోవునపుడు మార్గమధ్యముననే యాతని చెవులలోఁ బడెను. అతని కేమియుఁ గర్తవ్యము దోపలేదు. యుద్ధములతో గ్రీకు సైన్యములు జాల యలసిపోయినవి. తనకుఁగూడ శరీరము జెడినది. పైఁగా

సంతత మద్యపానము దీనితో శరీరము జెడి యతఁడు క్రీస్తుకు పూర్వము 323 వ సం॥ అనఁగా హిందూదేశమునుండి మరలి పోయిన రెండు వర్షములలోనే "బాబిలోనియా"లో మరణించెను.

## జాతీయ విప్లవము

అలెగ్జాండరు సింధునదీ ద్వారమున దిరిగి పోవుచున్నప్పుడు "పంచనదము"లలో గ్రీకులకు విరుద్ధముగఁ గొన్ని కుట్రలు రేగినవి. గ్రీకుల చేతిలోఁ బడిన దేశములను విముక్తము లొనర్చుట వారి యాదర్శములలో నొకటి. భారత దేశమునందలి రాజ్యముల నొక కొలికికిఁ దెచ్చుటయు - నాఁడు పంచనదమున గలిగిన రాజకీయ చైతన్యములో రెండవ యాదర్శము. అలెగ్జాండరు - దా ననుకొన్నట్లు మరల భారతదేశముపైకి వచ్చియుండినచో నీ రాజకీయ చైతన్యముయొక్క రుచిని బాగుగ జూచియుండును. అట్లు జరుగలేదు. అతఁడు మరల భారతమునకు రాలేదుగదా! కాని- భారతదేశములు మాత్రము వెనువెంటనే స్వతంత్రములైనవి.

## గ్రీకు గవర్నరుల శిరచ్ఛేదము

అలెగ్జాండరు ఇరువురు గ్రీకు సేనాపతుల నిచట నిలిపి పోయెను గదా! వా రిర్వురును ముఖ్యులైన రాజప్రతినిధులు. ఈ విషయముఁ బైన దెలిపితిని. సికందరుశాహి మృతుఁడైన వార్త భారతదేశమునఁ దెలసినది. వెంటనే- 'యశ్విని'యను పేరుగల గణరాజ్యమున 'ఫిలిప్' అనెడు గ్రీకు ప్రతినిధిని

జుట్టుముట్టి భారతీయులు శిరచ్ఛేదము గావించిరి. వానితోడ నున్న సైన్యమునకుఁగూడ నదే గతి పట్టెను. ఇంతలో వేఱు ప్రదేశముననున్న "నికీయాను"నకుఁగూడ నీ యవస్థ దప్పలేదు. ఎవ్వఁడో యొక వీరుఁడు – వాని గుడారమునఁ దూరి – చంపివేసెను. అలెగ్జాండరు మృత్యువార్తయు – నీ యిర్వురు రాజప్రతినిధుల చావును – గణరాజ్యములం దంతయు – శరవేగమున వ్యాపించినది. ఇంతకుముందు గ్రీకులకు లోఁబడిన గణరాజ్యములు – వెంటనే స్వాతంత్ర్యమును బ్రకటించినవి. గ్రీకుల నగరములు – వారి ధ్వజములు – యింత యేల! గ్రీకుల దండయాత్రను జ్ఞాపకమునకుఁ దెచ్చు బ్రతి పదార్థమును – భారతీయులు నాశన మొనరించిరి. పంచనదములనుండి సింధునదివఱకు – సింధునదీసీమల నుండి సింధు సాగర పర్యంతము – మఱల నన్నియు స్వతంత్రములైనవి. వీని నన్నిటి నలెగ్జాండరు ఆచంద్ర దివాకరముగ దనకు లోఁబరచుకొనఁ దలఁచెను. కాని వాడు జచ్చినదే తడవు – యేదునెలల లోపలనే – మరల నివి యన్నియు స్వాతంత్రము లైనవి.

'సికందరుశాహి' గ్రీసు, సిరియా, పర్షియా, బాబిలోనియా, ఈజిప్టు మొదలైన దేశములు గెలచికొనుచు వచ్చెను. ఆ దేశములలోఁ దనపేరిట నగరములను నిర్మించినాఁడు. గ్రీకులు నివసించిన ప్రదేశములను 'కాలనీ'లందురు. అలెగ్జాండరు మరణించిన పిదపఁగూడ – నాతని ప్రతినిధు లీ దేశములను – శతాబ్దముల తరబడి పాలించిరి. నేటికిఁగూడ నితర దేశములలో – 'అలెగ్జాండ్రియా' యను పేరిట – కొన్ని

నగరములు గన్పించుచున్నవి. ఇంతేగాక పాశ్చాత్య చరిత్రకారులందరును - అలెగ్జాండరు పేరు వెనుక- "The great" అను పదమును దగిలించి - బ్రహ్మాండముగఁ బొగడినారు.

కాని - భారతదేశమందు రెండు వర్షము లవిరళ పరిశ్రమతో యుద్ధములు జేసిచేసి - లక్షలాది గ్రీకులు- భారతీయులు - వీరరక్తముల బారించి సాధించిన- ప్రాంతములన్నియు వెన్వెంటనే స్వతంత్రము లయ్యెను. గ్రీకుల నగరములు, ధ్వజములు, నితర చిహ్నములు- వీనిని భారతీయులు గూల్చివేసిరి. ఇదంతయు నతఁడు మరణించిన వెనుక నేడు నెలల లోపలనే!

అలెగ్జాండరు పేరిట - నున్న నగరములవలనగు నేమి? ఆ గ్రీకుచక్రవర్తి పేరుఁగూడ - భారతేతిహాసములందు నుచ్చరితము గాలేదు. పాశ్చాత్యులు "The great" అని బ్రహ్మాండముగ - బొగడ్తలు వట్టిన గ్రీకు సేనాపతి భారతదేశమునందు బ్రవేశించెను. యుద్ధములు జేసెను. ఆ కాలమునను, దరువాతను వ్రాయఁబడిన - భారతీయుల ప్రాచీనుల గ్రంథములలో - నీ చక్రవర్తి పేరేలేదు. బౌద్ధులుగాని, జైనులుగాని, వైదికులుగాని- దమ గ్రంథములలో- నీ ఘట్టమును గుఱించి యొక పలుకైన నాడినవారుగారు. దేశమునకుఁ గళంకము నాపాదించు - నీ యుద్ధములను - జ్ఞాపకమునకుఁ దెచ్చుకొనుట - వారు మహాపచారముగఁ భావించిరి.

"విన్‌సెంట్ స్మిత్" తన సుప్రసిద్ధమైన "Early History of India" యను గ్రంథమున నిట్లు వ్రాయుచున్నాఁడు :

" All these proceedings prove conclusively that Alexander intended the permanent annexation of those (Indian) provinces to his empire... ...... But within three years of his departure from India (from 325 B. C. to 322 B. C.) his officers in India were ousted, his garrisons destroyed and all traces of his rule had disappeared The colonies which he founded in India, unlike those established elsewhere in Asiatic provinces took no root. His campaign though carefully designed to secure a permanent conquest was in actual effect no more than a brilliantly successful raid on a gigantic scale which left upon India no mark, save the horrid scars of a bloody war. India remained unchanged. She continued her life of splendid isolation, and soon forgot the passing of the Maccedonian storm. No Indian author-Hindu, Buddhist or Jain - makes even the faintest allusion to Alexander or his deeds" (page 110)

అలెగ్జాండరు మరణానంతరము భారతదేశమందు - రాజకీయ విప్లవములు చెలరేగినవని యంటిమి. ఈ విప్లవములను నడపిన ప్రముఖ నాయకు లెవ్వరో- వారిని గురించియు- మన చరిత్రలో నేమియు జెప్పఁబడలేదు. కాని వారిలో నిరువురు నాయకులు మాత్రము భారత చరిత్రలో నజరామరులుగ నిలచిపోయిరి. అలెగ్జాండరు 'తక్షశిల'ను ప్రవేశించిన వృత్తాంతమును దెలుపు నపుడు - వారిపేరు అంతకు

ముందే యుదాహరించితిమి. మొదటివాఁడు తక్షశిలా విద్యా పీఠమున యుద్ధ శాస్త్రాధ్యయన మొనర్చుకొనుచున్న చంద్రగుప్తుఁడు. రెండవవ్యక్తి యా విద్యాపీఠమున నాచార్యుఁడుగ నుండి యనంతరముఁ జంద్రగుప్తుని రాజ్యాక్రాంతికి నడిపించి-యతనిఁ గీర్తి శిఖరముల నధిరోహింపఁ జేసిన యాచార్య చాణక్యుఁడు. ఈ యిర్వురే భారతేతిహాసమును స్వర్ణాక్షరములతో జిత్రించిన మహాపురుషులు.

## చంద్రగుప్తుని గాథ

ఇతిహాసమునందు చంద్రగుప్త చాణక్యులను గుఱించి యనేకములైన కట్టుకథలు ప్రచారములోనికి వచ్చినవి. ఏమహాపురుషునిగుఱించియైననూ చరిత్రలో జరగెడు పని యింతే! చంద్రగుప్త చాణక్యుల విషయమునఁ బ్రచారమునకు వచ్చిన కథలలోఁ గొన్ని మనోరంజకమైనవి గూడ. వానినిఁ జదువఁ గోరువారు శ్రీరాధాకుముదముఖర్జీ వ్రాసిన (Chandragupta Maurya and his times.) అను పుస్తకమును చదువవచ్చును. జైన, బౌద్ధ, వైదిక ప్రాచీన గ్రంథములలోఁగూడ ననేక గాథ లున్నవి. వానిలో నైతిహాసికముగ మాకుఁ దోచిన గొన్నిటిని మాత్రమే యీ క్రింద నుదాహరింతుము.

గౌతమ బుద్ధుఁడు శాక్యకులమునందు జన్మించెను గదా! ఆ శాక్య వంశస్థులు గొందఱు గారణాంతరములచే దూరప్రాంతములకు వలస వెళ్ళిరి. శాక్యులు దాము క్షత్రియులమని జెప్పికొనిరి. కాని – వలస వోయిన శాక్యులు

గడుపు లోముకొనుటకై వేఱు వృత్తులనుఁగూడ నవలంబింప వలసివచ్చెను. వారు జేరిన యడవులలో మయూరము లెక్కువగ నుండెడివి. నెమళ్ళను బెంచుట - విక్రయించుట యను నీ రెండు పద్ధతులను వారవలంబించిరి. అందుచే వారికి మౌర్యులని పేరేర్పడినది. ఈ వంశములనుండి యొకానొక కుటుంబము పాటలీపుత్రమును జేరెను. ఆ కుటుంబములో 'ముర' యనెడు నొకస్త్రీకి పాటలీపుత్ర రాజాంతఃపురమునందు దాసిగనో - యితర కారణముననో - ప్రవేశము దొరకినది. అప్పటి నంద సమ్రాట్టు మహాపద్మనందుఁడు వీనికి ధనానందుఁడనియు పేరు. వీని కామెతో సంబంధ మేర్పడెను. 'ముర' కుమారునిఁ గన్నది అతఁడే చంద్రగుప్తుఁడు. ఈకట్టు కథ చంద్రగుప్తుని చరిత్రకుఁ గళంక మాపాదించును. ఈ యభిప్రాయముతో నేగాఁబోలు గొందఱు గ్రంథకారులు దీని నుదహరింపక విడచిరి. వారి యభిప్రాయములో 'మురా' దేవి నందసమ్రాట్టు యొక్క దాసిగాదు మరి - యతఁడు వివాహముఁ జేసికొన్న యొక రాణి. గనుక చంద్రగుప్తుఁడు దాసీపుత్రుఁడుగాడు క్షత్రియుఁడు.

మరికొన్ని గ్రంథములలో నీ రెంటు కథలనుగూడ నొప్పుకొనలేదు మురాదేవికిని- నందసమ్రాట్టునకును- సంబంధమేలేదని వారందురు. మురాదేవికి స్వజాతియందే యొకానొకనితో వివాహమయ్యెను. అతనికే చంద్రగుప్తుఁడు పుట్టినాఁడు. తరువాత చాణక్యుని సహాయమునుచే దన పరాక్రమముచే నాతఁడు చక్రవర్తి యయ్యెను. తాను చక్రవర్తియై సామాన్యులైన తల్లిదండ్రుల ఋణము తీర్చెను. నందవంశ

మును నాశనమొనర్చి చంద్రగుప్తుఁడు మౌర్యవంశమును స్థాపించెను.

పురాతనకాలమునందు ఒకానొక మనుష్యుని గౌరవా గౌరవములను వానిజాతి– కులము– వర్ణము వీనిసంబట్టి నిర్ణయించుచుండిరి. ఈ యలవాటు ప్రతి సమాజమునందు నున్నది. అందులకే గాలము గడచు కొలందియు మహాపురుషుల విషయములో ననేకములు గల్పనలు బయలుదేరెను. అతఁ డన్న గిట్టనివారు వాని వంశమున కపకర్షము నాపాదించుచు గొన్ని కథ లల్లుదురు. అతని హితు లాతని గౌరవము నెచ్చించి కొన్నిఁటి నల్లుదురు. ఇట్లు కాలక్రమమున గాదంబరీ గ్రంథములు జనపరంపరలో వ్యాపించును. చంద్రగుప్తుని జాతినిగురించియు నింకను లెక్కలేని కల్పనలు గలవు. స్థలాభావముచే వానిని వదలుకొందము.

చంద్రగుప్తుఁడు దాసీపుత్రుఁడా– లేక– క్షత్రియుఁడా! యేమో? ఈ ప్రశ్నయే గర్ణునకుఁగూడ దగులుకొన్నది. అతఁ డొక్కటే సమాధాన మిచ్చినాఁడు.—

శ్లో॥ "సూతోవా సూతపుత్రోవా
యోవా కోవా భవామ్యహం
దైవాయత్తం కులేజన్మ
మదాయత్తంతు పౌరుషం"

తనకులము నాక్షేపించువారికి గర్ణుఁ డొసఁగిన సమాధాన మిది. క్షత్రియుల మనుకొను వారందరును గ్రీకు సేనాపతియొక్క పాదధూళిని మస్తకమున ధరించిరి. వానికి సేవచేయు నవమా

నమున కోర్చిరి. వారికంటెను మ్లేచ్ఛులను యుద్ధభూమి యందు ఖండించి దేశ స్వాతంత్ర్యమును నిల్పిన చంద్ర గుప్తుఁడే నిజమైన క్షత్రియుఁడు.

మురాదేవియొక్క సుతుఁడే మౌర్యుఁడు. చంద్ర గుప్తుఁడు మౌర్యుఁడు. చంద్రగుప్తునకుఁ దల్లిపై నాదరాభి మానములు మెండు. అందుకే దాను సామ్రాజ్యాధిపతియైన వెనుక మురాదేవి నామమునకుఁ జరిత్రలో దీర్ఘాయువునుఁ బోసినాఁడు ముందు మనము జెప్పికొన్న మయూరములకు సంబంధించిన కథయును నమ్మదగినదిగఁ దోఁచును. మౌర్య సామ్రాట్టుయొక్క కులదేవత నెమలియట. ఈ విషయ మనేక శాసనములలో నున్నది. నందనగడములోఁ దొరకిన యశోక స్తంభముపైనను నీ చిత్రములున్నవి. అట్లే సాంచీ స్తూపము లలోఁ జెప్పిన చరిత్ర కథను గమనించినను స్థిరపడున దీవిషయమే !

## మగధ సామ్రాట్టు - మహాపద్మనందుఁడు

అపుడు మగధసామ్రాజ్యమును మహాపద్మనందుఁ డేలుచుండెను. సప్తవ్యసనము లన్నియు వాని కుండెడివి. అందుచే జనులకు వాఁ డప్రియుఁడు. వాని ధనతృష్ణ యమితము. దీనినిఁ దీర్చుకొనుటకై ప్రజల ననేక రీతుల వాఁడు బాధించుచుండెను. అందుచేఁ బ్రజలు వానిని - మహాపద్మనందుఁ డనక- ధనానందుఁడని పరిహాస ముగఁ బిలచికొను చుండిరి. సామ్రాజ్యాధిపతి యగుట కొక్క గుణమును వానికి లేదు. వానికున్న యోగ్యత యంతయు

నొక్కటే! గతించిన రాజునకు వాఁడు దమ్ముఁడు. అలెగ్జాండరు భారత దేశముపై దండెత్తివచ్చి "నేను మగధ సామ్రాజ్యమునకు - రాజగుదునని" ప్రగల్భములు గొట్టుచుండెను గదా! ఆ విషయము మహాపద్మనందునకుఁ దెలిసినది. వాఁడు గ్రీకు చక్రవర్తి నెప్పుడో దన దేశమున కాహ్వానించి రాజ్యము నొప్పించి యుండును. అట్లు చేసియున్నచో వాఁడింకను వ్యర్థుఁడై యుండెడివాఁడు. కాని మహాపద్మనందుఁడు కిమ్మనలేదు. అలెగ్జాండరుయొక్క ప్రగల్భముల కేమియు బదులు పలుకక నిశ్శబ్దముగ నున్నాఁడు. వేఱొక స్వాభిమాని- రాష్ట్రాభిమానియైన రాజైనచో - నలెగ్జాండరున కెన్నఁడో - బదులిచ్చి యుండును మహాపద్మనందుఁడు భీరుఁడు, కపటిగూడ. ఆకాపట్యమే వాని కీయెడ నొక రక్షయైనది. రాష్ట్రాభిమాన పూరితములు - స్వార్థములగు - రాజకీయ చైతన్యములను - వాఁడు ద్వేషించుచుండెను దీనితో వానికి విరుద్ధముగఁ గొన్ని ప్రయత్నములు రేగినవి.

ఈ మహాపద్మనందునకే - మురాదేవియందుఁ 'జంద్రగుప్తుఁడు' బుట్టెనందురు. చంద్రగుప్తుని బాల్యమును గుఱించి కొన్ని కథ లున్నవి. కాని యవి కేవలముఁ గట్టుకథలు - ఒకటి సత్యమై యుండును. చిన్ననాటనే జంద్రగుప్తుఁడు తేజస్వి, సాహసుఁడు, మహత్త్వాకాంక్షి. ఈ గుణములను మగధ సమ్రాట్టు ధూర్తత్వముగ నర్థమొనర్చికొనెను. తన యనంతర మా దాసీపుత్రుఁడు సామ్రాజ్యమును - గబళించునేమో యన్న భయము వాని నాక్రమించినది. లేక దనకు విరోధులైన రాజకీయ నాయకులు - వీనిని ముందుంచుకొని-

తనన్నె సింహాసనమునుండి - యూడ బెరుకుదురేమో యన్న భయమును - వాని నాక్రమించిన దేమో? మగధ సింహాసనముపై నున్న శిశునాగ రాజవంశము - నెట్లు నాశన మొనర్చి - నందులు రాజ్య మాక్రమంచికొనిరో యా కథలింకను - మహాపద్మనందుని కనులయెదుట - బారాడుచునే యుండెను ఇట్టిదేమైన దనవిషయమునను జరగినచో? చంద్రగుప్తునకు మహాపద్మనందుఁడు మగధరాజ్య సీమలను దాటి పోవలసినదని శిక్ష యొసఁగెనట! దానిపై నేమి జరగెనో స్పష్టముగ మనకుఁ దెలియదు. అటు దరువాత చంద్రగుప్తుఁడు మనకుఁ గనబడునది తక్షశిలా విద్యాపీఠముందే! ఆతఁ డచ్చట విద్యార్థి. రాజకీయములు, వ్యూహారచనలు- మొదలైనవి నేర్చికొనుచుండెను అచటనే యార్య చాణక్యులుండిరి. చంద్రగుప్తుఁ డచట విద్య నభ్యసించుచున్నప్పుడే- గ్రీకుచక్రవర్తి దండెత్తి వచ్చినది. అలెగ్జాండరుచే విజితములైన ప్రదేశముల వెనుకకు సాధించుటకును - భారతదేశము నంతయు - నొక కొలికికిఁ దెచ్చుటకును - గొందరు నాయకులు రహస్యముగఁ బనిచేయుచుండిరి. వారికి చాణక్యుఁడు నాయకుఁడు. ఆతనిని దన తేజస్సుతో నాకర్షించినది - తరుణుఁడైన చంద్రగుప్తుఁడు.

## ఇతిహాసమునం దద్భుతమైన యర్ధఘటిక

గ్రీకుల వ్యూహారచన - శస్త్రసాధన - మొదలగు విషయములను స్వయముగఁ జూడవలెనని - చంద్రగుప్తునకుఁ గోరిక గలిగెను. అతఁడు ఛద్మవేషుఁడై వాని శిబిరమున

ప్రవేశించి యటు నిటు దిరుగుచున్నాఁడు. ఇట్లు కొన్నిదిన ములు జరగెను. ఒకానొకనాడు కావలివారు వీనినిఁ బట్టు కొనిరి. ఈ వృత్తాంత మలెగ్జాండరునకుఁ దెలసినది. వాని కా యువకుని జూడవలె ననిపించెను.

మహాప్రతాపుఁడైన గ్రీకుసమ్రాట్టు, చతురుఁడైన సేనాపతి యలెగ్జాండరును – యువకుఁడైన భావి భారతీయ సేనాపతియు, సామ్రాజ్యాధిపతియు నగు జంద్రగుప్తుఁడును– గలసికొన్న యాక్షణము చరిత్రలో – మహావిచిత్రమైనది. అలెగ్జాండరున కప్పుడు నలువది వర్షములు మీాఱినవి. ఈ యువకుఁ డిరువది వర్షములవాడు. అలెగ్జాండరు మధ్యాహ్న మును మీారిన సూర్యుఁడు; చంద్రగుప్తుఁ డపు డపుడే-యుషః కాలము నందుకొనుచున్న ప్రభాకరుఁడు. వీ రిర్వురును గలసి కొన్న దొక క్షణకాలమే!

వీ రిర్వురుఁ గలసికొన్నది నిజమని యనేక గ్రీకు చరిత్రకారులు వ్రాసినారు కాని వారేమి సంభాషించికొనిరో యొక్కరుఁడును దెలుపలేదు. కొందరుమాత్రము "మగధ రాజ వంశముతో నాకు సంబంధ మున్నదని-" చంద్రగుప్తుఁడు మెల్లగా గొణిఁగినట్లు లిఖించినారు. ఈ విభిన్నరచనల నేక వాక్యత నిట్లు గల్పించికొనవచ్చును. "అలెగ్జాండ రీతనిని గొన్ని ప్రశ్న లడిగియుండును. వానికిఁ జంద్రగుప్తుఁ డుదార ముగ నుత్తరమొసఁగియుండును. ఆ యుత్తరములలోని వాడిమి సహింపలేక, గోపముగొన్న యలెగ్జాండరు వానిని శిబిర మును వెడలగొట్టుఁడని సేవకుల కాజ్ఞాపించెను. ఆ సేవకు లట్లే యొనర్చిరి. కాని మఱల నేమనుకొనెనో? "వానిని వెన్కకుఁ

గొనిరండని" యలెగ్జాండ రాజ్ఞాపించెను సైనికు లక్కడిక్కడ వెదకిరి. చంద్రగుప్తుడు మరి వారి కంటబడ లేదు.

## ఆర్యచాణక్యుల కులవృత్తాంతము

చాణక్యుడు బ్రాహ్మణుడు. అతని మొదటి పేరు విష్ణుగుప్తుడు. చణకగ్రామ మాతనిది. ఊరి పేరునుబట్టి చాణక్యుడైనాడు. ఈ పేరే యాతనికి బ్రసిద్ధమయ్యెను. కౌటిల్యుడనియు నితనిని బిలతురు. ఇతని మౌలిక గ్రంథమైన యర్థశాస్త్రమును కౌటిలీయార్థశాస్త్రమనియే జను లందురు. ఇతని గోత్రము కుటలగోత్రము. దీనినిబట్టి కౌటిల్య నామము గలిగియుండును ఇతడ నేక శాస్త్రములయందు బారగుడు. అందుచే నీతని ప్రసిద్ధి విని - 'తక్షశిల'లో నధ్యాపకుడుగా నియమించిరి. అచటి పండితులలో జాణక్యుడు ముఖ్యుడైనాడు. కాని యితడు కురూపి. మహాపద్మనందునకు విరుద్ధముగ రాజకీయ క్రాంతిని లేవదీసినపుడే యాతని పేరు భారతదేశమంతయు దెలసినది. తరుణ చంద్రగుప్తుని సామ్రాజ్యాధిపతిగ నొనర్చిన తరువాత చాణక్యుడు లోక ప్రసిద్ధుడయ్యెను. ఇతడు చంద్రగుప్తునకు మహామాత్యుడు. ప్రసిద్ధపురుషులనుగుఱించి సాధారణముగ గాధ లల్లుట వాడుక. ఆ స్థితి యాతనికి దప్పలేదు. చంద్రగుప్త చాణక్యులు మరణించిన పిదప ననేక సంవత్సరములకు వ్రాసిన గ్రంథములలోనున్న గట్టుకథలకు లెక్కలేదు. జైన, బౌద్ధ, వైదిక గ్రంథములలో నీ గాధలు భిన్న భిన్నములుగ గల్పింపబడెను. సంస్కృత నాటక మొకటి గలదు. ఆ

నాటక కర్త కళాదృష్టితోఁ గొన్ని గాథ లల్లినాఁడు. చాణక్యుఁడు కురూపియట! అతని వికృత దంతములను గుఱించి - నాటకకారులు విపులముగ వర్ణించిరి. చంద్ర గుప్తు నాతఁ డొకనాఁడు త్రోవలో గలసెను. నాటికిఁ జంద్ర గుప్తుఁ డొకానొక గ్రామీణ తరుణుఁడు మాత్రమే! వాని సాముద్రిక లక్షణములను చాణక్యుఁడు గమనించి యాతనిని - సామ్రాజ్యాధిపతిగ నొనర్పఁ దలఁచెనట! ఇట్టి వెన్నియో గల్పనలు! ఈ కల్పనలలోఁ గొన్ని - యైతిహాసిక - సత్య కణిక లేమైనను గన్పించునేమో జూతముగాక!

## ఆర్య చాణక్యుల ప్రతిజ్ఞ - వికృత కథ

చాణక్యుల విషయమై యొకకథ ప్రచారములో నున్నది. ఈ వికృత కథనే. శాలశాలలలో నేర్పునది దాని తెలఁ గిది: "తక్షశిలా విద్యాపీఠమం దార్య చాణక్యుఁడు బండితుఁడు. అతని కీర్తి గొప్పగ వ్యాపించినది. అందుచే నాతనిని మహాపద్మనందుఁడు దన ప్రాసాదమునఁ- 'దానా ధ్యక్షుఁడుగ నొనర్చినాఁడు. ఒకానొకనాఁడు మగధ సమ్రాట్టు- వుబుసుబోకకయి - చాణక్యుఁడు బనిచేయుచున్న దానాధ్యక్షశాల కేతెంచెను. చాణక్యుఁడు బరమ వికృత స్వరూపుఁడు గదా! అతని దంతములు వికృతతరములు ఇతనినిఁ జూచి పద్మనందుఁడు బరిహాసముఁ జేసెను. దానికి చాణక్యుఁడు సహింపక బదు లొసఁగెను. రాజునకుఁ గోపము వచ్చి యాతనిని జుట్టుబట్టి యీడ్పించెను. ఆతని శిఖ వదలి పోయినది. దానాధ్యక్షపదవినుండి మహాపద్మనందుఁడు

చాణక్యునిఁ దొలఁగించెనట! ఈ యవమానమునకుఁ గినిసిన
యార్య చాణక్యుఁడు "నిన్నిట్లే- సింహాసనమునుండి - జుట్టు
బట్టి యీడ్పించి - నందవంశమును నాశనమొనర్చువఱకు
నీ శిఖను ముడివేయుదునని" పలికి యటనుండి వెడలిపోయెను.

మహాపద్మనందునకు చాణక్యుఁడు కురూపి యని
యింతకుముందే తెలియును. ఆతనిని దానాధ్యక్షుఁడుగ
నొనర్చినది చాణక్యుని రూపమును జూచిగాదు; పాండిత్య
మును జూచి అట్టిచోఁ దానై యాతని పాండిత్యమును
గుర్తించి నియమించిన మహాపద్మనందుఁడు అతని రూపము
బాగులేదని యా. పదవినుండి తీసివేసియుండుననుట కేవ
లము బరిహాసపాత్రమైన కథ. దానాధ్యక్షపదవిని నిర్వ
హించుటకు సమర్థుఁడు ధర్మశాస్త్ర పారంగతుఁడుగాని
రూపవంతుఁడుగాదు. నందసామ్రాజ్యమును చాణక్యుఁడు
నాశనమొనర్చుటకుఁ గారణము- "ఆతని వైయ్యక్తికమైన
యవమానమే యనుట"- బాగుగఁ బ్రచారములోనికి వచ్చి
నది ఇది గొప్ప దురదృష్టము. మహాపద్మనందునకు విరుద్ధ
మైన రాజకీయక్రాంతితో - నితఁడు రహస్యముగఁ బని
చేయుచున్న సంగతి నందసమ్రాట్టునకుఁ దెలసియుండును.
అందుకై యాతఁ డితని నవమానపఱచియుండును. మహాపద్మ
నందునిఁ దొలగించుట కార్య చాణక్యుఁడు ప్రయత్నిం
చుటగూడ కేవలము ఆతనిపై ద్వేషముతోఁ గాదు. భారత
దేశమును బునరుజ్జీవింప జేయుటకే!-

ఇట్టిగాథలే శివాజీని గుఱించియుఁ గలవు. శివాజీ రాజ
కీయపు టెత్తుతో నౌరంగజేబును సమీపించెను. అతఁ డతని

నవమానించి - కారయందుంచెను. దానిచేఁ గోపించిన శివాజీ - చతురముగ నటనుండి దప్పించుకొని - స్వతంత్ర సామ్రాజ్యమును స్థాపించెను. ఈ కథను గొప్పగ వర్ణించి, వర్ణించి - "శివాజీ కౌరంగజీబుతో వచ్చిన ద్వేషమునకు వైయ్యక్తికావమానమే గారణము"ని చారిత్రకులు నిరూపింతురు. కాని వారిరువురి ద్వేషమునకు- శివాజీకిఁ గలిగిన వైయ్యక్తికావమానమే గారణముగాదు. శివాజీ స్వధర్మమును, స్వరాష్ట్రమును బునరుద్ధరింపఁ దలఁచెను. దీనితో వారిరువ్వరకును వైరమేర్పడెను. ఈ విషయము నిచ్చట జ్ఞాపకమొనర్పక పోయినచో- శివాజీ జీవితమంతయు- వికృతముగ మారిపోవును. ఇట్టిదే చాణక్యుల కథగూడ. నందరాజుపై నాతనికి వైయ్యక్తికమైన ద్వేషములేదు. నందరాజుయొక్క- భోగలాలసతను, అసామర్థ్యమును చాణక్యుఁడు ద్వేషించెను. దానిచే నందుఁడతని నవమానించెను.

ఈ కథలను గొంత మార్చవలెను. శివాజీ తన కవమానము జరగెనని యౌరంగజీబుపై దిరుగఁబడినాడు! అనుట సరిగాదు. అంతకుముందే శివాజీ పరధర్మము నుండి భారతమును విముక్త మొనర్చుటకై ప్రయత్నించుచుండెను. ఈ ప్రయత్నములను విన్న మొగలు చక్రవర్తికి శివాజీపైఁ గోపమువచ్చినది. ఇతని నతఁడవమానించి బందీగా నొనర్చెను. చాణక్యులకథయు నింతే! చాణక్యుఁడు క్రాంతికారకుఁడనియు నందుఁడు గ్రహించినాఁడు. అందుచే నందరాజీతనిని శిక్షింతునని బెదరించి యుండును. ఆ బెదరింపుల కుగ్రుఁడైన బ్రాహ్మణుఁడు -

ప్రజాపీడకమైన నీరాజ్యమును నిర్మూలించి - దేశక్షేమము నొనర్చితీరెదనని - ప్రతిజ్ఞ సేసియుండును.

ఈ కథ కాధారముగ కౌటిల్యుని యర్థశాస్త్రమందే గొన్ని శ్లోకము లున్నవి. అవి యీ క్రిందివి :

చాణక్య ఇతి విఖ్యాతః శ్రోత్రియ స్సర్వధర్మవిత్
యేన శస్త్రంచ - శాస్త్రంచ - నందరాజ గతాచభూః
అమర్షేణోద్ధృతాన్యాసు తేన శాస్త్రమిదం కృతం.

నందవంశమును చ్ఛేదించి వానిపాలనముచే నధః పతితమైపోవుచున్న రాష్ట్రశక్తిని, శాస్త్రశక్తిని, వాని భూమిని నుద్ధరించిన చాణక్యులచే నీగ్రంథము రచింపఁ బడినది. అని పై శ్లోకములకర్థము. వీనిలో వైయ్యక్తికమైన యవమానముయొక్క గొడవ సూచితమైననుగాలేదు. స్వరాష్ట్రము - స్వదేశము - స్వధర్మము. వీని నుద్ధరించుటకే చాణక్యుఁడు నందరాజుపైఁ గత్తిఁ గట్టెను. వాస్తవ మిట్లుండఁగా సంస్కృతనాటకములలోఁ గొన్నికల్పనము లొనర్పఁబడినవి. అవి నాటకములు; చరిత్రలుగాదు వాని కొక గొప్ప ప్రామాణ్యమొసఁగవలసినది లేదు.

## సికందరు దండయాత్రకుముందే చాణక్యులు రాజకీయక్రాంతి నారంభించిరి.

అలెగ్జాండరు వచ్చుటకుఁ గొన్ని సంవత్సరములకు ముందునుండియే చాణక్యుఁడు తక్షశిలా పరిసరప్రాంతములందు వసించుచుండెను. సింధునది సీమలలోనున్న రాజకీయస్థితిగతు లాతనికిఁ బాగుగఁ బరిచితములు.

భారతసీమ నానుకొనియే 'ఇరాని' దేశముండెను. అది ప్రచండము, సుసంఘటితము, ఏకకేంద్రము, ఏకరాష్ట్రము. వీరు భారతీయులకు శాత్రవులు. ఎన్నడో యొకనాడు భారత దేశముపైఁ వీరు దండెత్తివచ్చినచో హిందూకుశపర్వతముల నుండి పంచదనము - సింధుప్రాంతములయందున్న స్వతంత్ర భారతీయులు శూరులే కాని-వారివి ప్రత్యేకములైన గణరాజ్యములు. వేలు వేలుగఁ బోరినచో నివి 'ఇరాని' దేశము నెదిర్చి నిలువలేవు వీని నన్నిటి నొకకొలికికిఁ దేవలెను. ఈ యాలోచనలు చాణక్యుల హృదయమునుఁ గలఁచుచుండినవి.

## గ్రీకుల గణరాజ్యము లిందుకే యస్తమించెను

చాణక్యుల మనస్సులోనున్న యీ యాలోచనను సిద్ధాంతపరచు సంఘటనలు గ్రీసుదేశమునందే జరగినవి. భారతమునవలెనే గ్రీసుదేశమునందునుఁ జిన్న పెద్ద గణరాజ్యము లుండెను. ఈ దౌర్బల్యము ననుకూలముగ నొనర్చికొని 'ఇరాను' చక్రవర్తి గ్రీసుపై దండెత్తినాఁడు. చిన్నచిన్న గణరాజ్యముల కాతఁడు నడుములు విఱుగఁగొట్టెను. 'ఫిలిప్' యీ దౌర్బల్యమును గమనించినాఁడు. అతఁడు జిన్నచిన్న గణరాజ్యములను జయించి యొక మహారాజ్యనిర్మాణము గావింపవలెనని దలఁచెను. అతనికొడుకైన యలెగ్జాండ రా యభిప్రాయమును గొనసాగించి గ్రీసుదేశమును సుసంఘటిత మొనర్చి 'ఇరాను' పైఁ బగదీర్చికొన్నాఁడు. ఈ సంఘటనములన్నియు సూక్ష్మదృష్టిగల చాణక్యుల చూపునుండి తప్పించుకొనిపోలేవు.

భారత దేశమునకుఁ బ్రక్కనే "ఇరాను" మొదలగు రాజ్యము లుండెనంటిని. వానితో శత్రుత్వ మేర్పడినచో భారతమునందలి గణరాజ్యములు పోరుట యసంభవము. ఈయపాయమునుఁ దప్పించుట కొక్కటే యుపాయము. విశకలితములైన యీ గణరాజ్యముల నన్నిఁటిని జయించి యొక మహాసామ్రాజ్య నిర్మాణ మొనర్పవలెను.

## అఖండ భారత సామ్రాజ్య నిర్మాణము

నిజమే! ఈ పని నెక్కడనుండి యారంభించుట! గాంధార- పంచనద- సింధు ప్రాంతములనుండి యారంభించుటకు వీలులేదు. అచట నున్న గణరాజ్యములన్నియు నల్పాల్పములు. వీనిలో నొక్కొక్కదాని శక్తినిఁ జాణక్యుఁడు మనసులోఁ దూచికొని యుండును అందుకే యాతఁడు దన జూపును మగధ సామ్రాజ్యముపైఁ బరపినాఁడు. ఆ భూమి యింతకుముందే భారతదేశమున గొంత బరిశ్రమించి, సామ్రాజ్యపదవిని సంపాదించుకొన్నది. అన్నియుఁ గాకున్నను గొన్నియైనను గణరాజ్యములు దానికిఁ లోఁబడినవి. అందుచేత భారతదేశ క్రాంతిసంఘమునకు నాయకుఁడైన చాణక్యుఁడు మగధమునుఁ దొలుతఁ గబళించి - భారతదేశము నంతయు దాని ఛత్రచ్ఛాయ క్రిందికిఁ గొనిరా నూహించినాఁడు. ఏదో యొకరీతి నాతఁడు రాజప్రాసాదమునఁ బ్రవేశము గల్పించికొనుటకు యత్నించుచుండెను. ఇంతవఱకును చాణక్యుఁడు మహాపండితుఁడని మాత్రమే మహాపద్మనందునకుఁ దెలియును. ఇంతలో దానాధ్యక్ష

పదవి ఖాళీవడినది. దానికై జాణక్యుఁడు యత్నించెను. మహాపద్మనందుఁ డాక్షేపణముఁ దెల్పలేదు. ఈ పదవితోఁ జాణక్యులకు దమ విప్లవోద్యమమునందు గొప్ప సహాయము లభించినట్లైనది.

కొంతకాలము గడచెను. చాణక్యుఁడు పండితుఁడు మాత్రమే గాదు. కూటనీతిజ్ఞుఁడును. తనకు విరుద్ధముగ విప్లవమును రేపుచున్నాఁడు ఈ విషయములు నందరాజు చెవులఁ బడినవి. వాఁ డీతనిని మట్టుపెట్టఁ దలఁచెను. బెదరించెను. పదచ్యుతునిఁ గావించినాఁడు. చాణక్యుఁడు మగధ రాజ్యము యొక్క యెల్లల కావైపు బంపివేయఁబడెను. దేశ బహిష్కృతుఁడైన చాణక్యుఁడు మరల తక్షశిలకు నడచి నాఁడు.

ఇంతలో చాణక్యుల మహాప్రయత్నమున కనుకూలమైన సంఘటన మొకటి జరగినది. చంద్రగుప్తుఁడు "తక్షశిల" యందుఁ జదువుకొనుచున్నాఁడు. అతఁడు మహాపద్మనందుని దాసీపుత్రుఁడు. వానికిని మహాపద్మనందుఁడు శిక్ష విధించి నాఁడుగదా! వీ రిర్వురును తక్షశిలలోఁ గలసికొన్నారు.

## చాణక్యుఁడు చంద్రగుప్తునే యెందు కెన్నికొనెను?

నందరాజు దుర్బలుఁడు, దుష్టుఁడు. వానినిఁ దొలఁగించి సింహాసనముపై వేఱొకని నిలుపవలెను. వాఁడు పరాక్రమశాలి గావలెను. గుణవంతుఁడును గావలెను. ఇంత మాత్రమే గాదు. రాజవంశమునకు సంబంధించియు నుండవలెను. కారణమేమనఁగా – నందుఁ డింత దుష్టుఁడైనను –

ప్రజల కా వంశముపైఁ భక్తి ప్రపత్తులుండెను. వారు సాంప్రదాయ ప్రియులు. సామంతులలోను కొందఱు పరంపరా ప్రియు లుండిరి. వీరినందరిని గాదని క్రొత్త వానిని నిల్పినచో వీరుఁ గత్తిఁగట్టుదురు. విరోధముఁ గొని తెచ్చుకొన్నట్లగును. ఈ యపాయమునుఁ దొలఁగించికొనుటకుఁ జంద్రగుప్తుఁడు మంచిసాధనముగఁ జాణక్యులకుఁ గన్పట్టినాఁడు అతఁడు నందుని దాసీపుత్రుఁడు. రాజపుత్రుఁడు. మగధ సింహాసనముపై జన్మసిద్ధమగు నొకయధికారముగూడ నున్నది. వీఁడు గుణవంతుఁడు. అతనిని గద్దెనెక్కించినచో - సాంప్రదాయముసుఁ బ్రేమించువారినిగూడ - లోఁగదీసికొనవచ్చును. ఈ విషయములన్నియుఁ జాణక్యుల బుద్ధిలో మెఱసినదే తడవు- వారు చంద్రగుప్తుని మాగధసామ్రాజ్యసింహాసనముపై నిలుపఁదలఁచిరి. మెల్లగా భారత సామ్రాజ్యాధిపతినిఁగూడ జేయఁదలఁచినారు.

చాణక్య చంద్రగుప్తు లీప్రయత్నములో నుండగనే కొన్ని యశుభకరములైన సంఘటనలు జరగినవి. గ్రీకు సామ్రాజ్యాధిపతియైన యలెగ్జాండరు- 'ఇరాను'నుఁ ద్రొక్కి- భారతముపైఁ బడెను. అపుడు భారతీయు లనుభవించిన సంకటము లెట్టివో ముందే వర్ణించితిమి. గణరాజ్యము లొక్కొక్కటిగ నాతని చేతిలో బంతులై యాడెను. కాలక్రమమున నాతఁడు వెన్కకుఁ బోవలసివచ్చినను, గ్రీకు చక్రవర్తి భారతీయులకుఁ గల్పించిన యవమానము మాత్ర మంత సులభముగా మరచిపోదగినది గాదు.

ఇంతలో చాణక్యుఁడు మొదలైన రాజకీయ నాయకులు సుసంఘటితమైన యొక సామ్రాజ్య నిర్మాణము సాగినఁగాని భారతదేశస్వాతంత్ర్యము రక్షితము గానేరదన్న ప్రచారము సింధుప్రాంతములలో సాగించిరి. ఆ ప్రచారము జనప్రియముఁగూడ నైనది.

క్రాంతికారకమైన యీ ప్రయత్నము కొంతవఱకు ఫలించినదనియే చెప్పవచ్చును. అలెగ్జాండరు వెనుకకు వెళ్ళినాఁడుగదా! అతనిచే విజితములైన గణరాజ్యములన్నియు వాఁడు మరలిపోయినవెంటనే స్వాతంత్ర్యమును ప్రకటించి కొన్నవి. అలెగ్జాండరు మరణమునకుఁ దరువాత నల్ప కాలములోనే గ్రీకు 'క్షత్రపుల'ను భారతీయులు వధించిరి. ఆశ్చర్యకరము - స్వాభిమాన పూరితమునైన - ఈ సాముదాయిక క్రాంతినిగూర్చి "జస్టిన్" (Justin) అను చరిత్రకారుఁ డీవిధముగ వ్రాసెను:

"India after the death of Alexander had shaken as it were, the yoke of servitude from its neck, and put his governors to death. The author of this liberation was Sandrocottus".

పై వాక్యములలోఁ జెప్పఁబడిన 'శాండ్రోకోటస్' యను వాఁడు చంద్రగుప్తుఁడే - గ్రీకు చరిత్రకారులు - చంద్రగుప్తుఁడను పేరు నిట్లే లిఖించిరి- చదివిరి.

## గ్రీకు సామ్రాజ్య సేన భారతముపై దండెత్తనెంచెను - దానికిఁ బ్రతీకారము

చాణక్య చంద్రగుప్తుల ప్రోత్సాహమున - సీమా ప్రాంతములందు- సాముదాయికమైన విప్లవములు జరగెను. కాని వారికి భయముమాత్రము బోలేదు. కారణ మేమనఁగా గ్రీకు సైనికులు - మరల యెత్తివత్తురన్న వార్తలను చాణక్యుఁడు బాగుగాఁ బ్రచార మొనర్చినాఁడు. దీనికిఁ గారణము స్పష్టమే. గ్రీకులను వధించి గణరాజ్యములు స్వతంత్రమైన మాత్రమున చాణక్యుల యాదర్శము నెఱవేరలేదు గదా! వీనినన్నిటి నొక సామ్రాజ్యము క్రిందికిఁ దేవలెను. అందుకై యాతఁడీ ప్రచార మొనర్చెను. ఇంతలో నలెగ్జాండరు మరణించినాఁడు. అతఁడు మరణించినను గ్రీకు సేనాపతు లాతని బ్రతిజ్ఞను నెరవేర్పఁ దలఁచి రనుట చాణక్యుఁడు ప్రయోగించిన రెండవ ఢంకా! అలెగ్జాండరు మరణానంతరము గ్రీకు సేనాపతులు సామ్రాజ్య విభాగములకై దమలోఁదాము గలహించుచుండిరి. ఈ కలహములలో భారతదేశమున కానుకొనియున్న 'బాబిలోనియా' వ సేనాపతి భాగమునకు వచ్చునో వాఁడు భారతముపై దండెత్తివచ్చునని - జాణక్యుఁడు బ్రచార మొనర్చెను. అంతవఱకు నీ గణరాజ్యము లిట్లేయున్నచో - మరల నీ స్వాతంత్ర్యము పీటిబుడగయైపోవును. కనుక నీ సంధికాలమందే గణరాజ్యములు దమలోఁదాము గూడికొని సింధుసాగరము నుండి - గంగాసాగరపర్యంతభాగమున్న భారతదేశమంతయు నొక మహాసామ్రాజ్యముగఁ దయారుచేయువలెను. అట్లైతె

నచో మరల యవనులు దండెత్తివచ్చినను, వారి నోడింప వచ్చును. కనుక భారతమంతయు నేకరాష్ట్రమైతీరవలెను.

## చంద్రగుప్త చాణక్యులు - మగధపై దండెత్తిరి

గ్రీకు సేనాపతులుఁ దమలోఁదాము కలహించుకొను చున్నప్పుడే - కాలము ను వ్యర్థమొనర్పక చంద్రగుప్తుఁడు మగధపైఁ దండెత్తెను. ఈ ప్రయత్నమున నాతనికిఁ గొంద అనుయాయులుఁ జేరిరి. ఈ విషయమునుగూర్చిన మొట్ట మొదటిప్రస్తావన 'మహావంశము'ను గ్రంథవ్యాఖ్యానములో వచ్చును. మఱికొన్నిగ్రంథములుగూడ నీవిషయమును జెప్పు చున్నవి. చంద్రగుప్తుని సైన్యమునఁ జేరినవారు బంచనద ప్రాంతీయులు, పార్వతేయులు, మఱికొన్ని గణరాజ్యముల వారు. ఈ ప్రయత్నమునకుఁ దోడ్పడుటకై చాణక్యుఁడే స్వయముగ పర్వతేశ్వరునితోఁ రాయబారము లొనర్చెను. పౌరవుని రాజ్యము దానికి సమీపమే ! అందుచే పౌరవునితోఁ గూడ జాణక్యులు గుప్తముగ మంతనము లాడియుందురు. పౌరవుఁడుఁగూడ నీ విషయమున నేకాభిప్రాయుఁడే. అతఁడు వెంటనే సమ్మతించెను. ఇంతమాత్రమేగాదు. ధనమును, జనమునుఁగూడ నొసఁగి పౌరవుఁడు ప్రత్యక్షముగ సాయ పడినాఁడు. ఈ సైన్యములకుఁ జాణక్యుఁడు చంద్రగుప్తుని సేనాపతిగ నొనర్చెను. పంచనదములందలి శాక్యప్రదేశము లలోఁ దొలుత దమయునికిని స్థాపించుకొని వారు మగధముపై దండెత్తిరి. మగధజను లింతకుముందే యీ విప్లవ ములకుఁ దయార్రై యుండిరి. వారు నందునితోఁ జాలవిసిగినారు.

అంతకుముందే మగధదేశమునఁ జాణక్యుఁడు అఖండసామ్రాజ్యవిషయమై బాగుగ ప్రచారమొనర్చియుండెను. దీనితోఁ ప్రజలు- క్రొత్తసౌఖ్యములకై యువ్విళ్ళూరుచుండిరి. అందుచే మగధరాజ్యములోని జనులలోఁ జాలమంది యీ విప్లవమున కనుకూలురు.

ఈ ఝంఝూవాతమున - చంద్రగుప్త చాణక్యులు అనుభవించిన కష్టములకు లెక్కలేదు. అనేకసారులు వారి సైన్యములు విరోధులచే జయింపఁబడెను. ఉసురు లోమికొనుటకై చంద్రగుప్త చాణక్యు లడవులకుఁ బారిపోవలసి వచ్చెను. ఒకొక్కసారి భూశయ్య, మరియొక్కసారి యుపవాసము. కాని వీరు దేనికిని జంకలేదు. అపజయము నొందినపుడంతయు ద్విగుణీకృతోత్సాహులై మరల మరల సైన్యములఁ గూర్చికొని దూకుచుండిరి. ఉత్సాహము దరుగని చాణక్య చంద్రగుప్తులు సైన్యములతో మగధసామ్రాజ్య ముఖ్యపట్టణమైన పాటలీపుత్రమునుఁ దరసినారు.

చాణక్యుఁ డఖండరాజనీతివిదుఁడు. అతఁడు నందరాజు సైన్యములోఁ గలఁతలు రేపెను. పట్టణమం దెల్లెడల రహస్యముగ ననుయాయుల నుంచెను. ప్రజలలో బాగుగ రాజుపై నసమ్మతిని రెచ్చఁగొట్టెను. ఈ పూర్వరంగము ముగిసినదే తడవు చంద్రగుప్తుఁడు పాటలీపుత్రముపై విరచికొని పడినాడు.

## మహాపద్మనందుని శిరచ్ఛేదము

రాజధానికి నాల్గు వలఁకులందును చంద్రగుప్తుని సైన్యములు కొన్ని గాచి యుండెను. మఱికొన్ని పాటలీపుత్రమునఁ బ్రవేశించినవి. చంద్రగుప్తుని సైన్యములు - రాజధానిని బ్రవేశించినదే తడవు - పాటలీపుత్రమున గొప్ప యలజడి రేగినది. చంద్రగుప్తుఁ డంతఃపురమునఁ దూరినాఁడు. మహాపద్మనందుఁడు - అంతకుముందే యవరోధమునుండి - పారిపోయెను. వాఁడు మారువేసమున పాటలీపుత్రమును దాటి పోఁదలఁచినాఁడు. కాని మార్గమునందే సైనికులకుఁ దొరకెను. దొరకినదే వాని శిరము నేలపైఁ బడినది.

## సామ్రాజ్యాధిపతి చంద్రగుప్తునకు - జయము.

చంద్రగుప్తుఁడు మగధ సామ్రాజ్యాధిపతి యన్న వార్త శరవేగమున దిక్కులకు వ్యాపించినది. మగధము స్వతంత్రమైనది. చంద్రగుప్తుఁడు దన మాతను గౌరవింప దలఁచెను. అందుకై యామె పేరే దన వంశమున కుంచ దలఁచికొన్నాఁడు. అప్పటినుండి వారిది మౌర్యవంశమైనది. సింహాసన మధిష్ఠించిన వెంటనే - చంద్రగుప్తుఁడు చాణక్యునకు మహామాత్యపదవి నొసఁగెను. ఈ సంఘటనము జరిగినది క్రీ॥ పూ॥ 321 వ ప్రాంతములందు.

సికందరు క్రీ॥పూ॥ 323 వ సంవత్సరము మరణించెను. అపు డుత్తరభారత మంతయు - హతోత్సాహమై, నిరాశాదళితమై - యుండెను. ఆ రాజశక్తినిఁ బునరుజ్జీవింపఁ జేసి

క్రాంతిని లేపిన మహాపురుషులు చాణక్య చంద్రగుప్తులు. ఆ సమయమున గ్రీకు సామ్రాజ్యములోని సేనాపతులు పరస్పరము గలహించికొనుచుండిరి. ఈ యవకాశమున నొకక్షణమైనను జాణక్యుఁడు వ్యర్థపరుప లేదు. విరోధులలోఁ జెలరేగిన యశాంతితో నాతఁడు దన సామ్రాజ్యమున శాంతిని స్థాపించెను గ్రీసుదేశమునందలి యవ్యవస్థతో నాతఁడు మగధలో సువ్యవస్థను సృజించెను.

### చాణక్యుని నీతికి మొదటి యంగము - శస్త్రబలము.

ఏకచ్ఛత్ర సామ్రాజ్యముయొక్క శాంతి సువ్యవస్థలు- ఎవ రేమన్ననుఁ గడకు - దండనీతిపైననే యాధారపడవలెను. కనుక చాణక్యుని రాజనీతికి - వెన్నుబలము దండనీతియే! క్షాత్రతేజము, శస్త్రశక్తి యివి - సామ్రాజ్యమునకు రాజకీయములైన యంగములు మాత్రమేగావు; సమాజజీవనము యొక్క ప్రాణము. క్షాత్రధర్మము దుర్బలమైనచో- సమస్త ధర్మములు- శాస్త్రములు- కళలు - రాష్ట్రజీవనము ఇవి యన్నియు - వఱదఁ బడిపోయినట్లే!

"సర్వేధర్మాః ప్రక్షయేయు ర్వివృద్ధాః।
క్షాత్రే త్యక్తే రాజధర్మే పురాణే॥"

ఇది సత్యము. రాజనీతి యనేఁడు భవ్యభవనము సైన్యశక్తి యను పునాదిపైననే నిలచును. ఈ రహస్యమును చాణక్యుఁడు బాగుగా నెఱుఁగును. అందుకై యాతఁడు నూతన సామ్రాజ్య రక్షణార్థము - ప్రబలమై - వినియంత్రి

తమై - జయశీలమైన ప్రచండ సైన్యములఁ జేకూర్చు ప్రయత్నమును- ద్విగుణీకృతోత్సాహముతో నొనర్చెను. మూఁడు నాలుగు వర్షములలోననే- చంద్రగుప్తుని సైన్యము గొప్పది యని- దేశములకుఁ దెలసినది. ప్రజ లా రాజుపై విశ్వాస ముంచి హాయిగఁ గన్ను మూయవచ్చు ననుకొన్నారు.

ఇంతటి ప్రసిద్ధిని జేకొన్న యీ చంద్రగుప్తునియొక్క- సైన్య సంఖ్య యెంత ?

దీనికి నాలు గైదు వర్షములకుముందు చాణక్య చంద్రగుప్త లిర్వురు నేకమై - పంచనద ప్రాంతములలో శత్రువుల నెదిరించిరి ఆ ప్రయత్నము గణరాజ్యములను సంఘటిత మొనర్చి యేక సామ్రాజ్యమును స్థాపించుటకై జరగినదే! అపుడు వీరికున్న సైన్యము జాలవఱకు శూన్యమే! ఈ స్థితినుండి యిపుడు చంద్రగుప్తుఁ డెంతవఱ కెదిగినాఁడు ? అతని కాల్బలము ఆరులక్షలట ! ముప్పదివేల గుఱ్ఱపుదళము. రెండువేలు మదభరితములైన గజములు. నాల్గువేల రథములు. ఇవి యాతని నేటి సైన్యసంపద !

ఈ బలాఢ్యమైన సైన్యశక్తి ప్రభావముతో చాణక్యుఁ డుత్తరభారతమునందలి గణరాజ్యముల నొక్కటొక్కటిగ జయించెను. తాము స్వతంత్రులుగఁ బ్రదుకవలె నను రాజుల యున్మాదమును మాన్పెను. ప్రజలకు శాంతిఁ జేకూర్చెను. సువ్యవస్థను నిండించెను. కడకు సింధునది కీవైపునుండి - పంచనదము - పార్వతభాగములు - సింధుదేశము యీ భాగమంతయు చంద్రగుప్తుని మహార్య సామ్రాజ్యమిళితమైపోయినది.

ఇట్లు మన యైతిహాసిక కాలమునందు - సింధునదీ పర్యంత మేకసామ్రాజ్యనిర్మాణ మొనర్చిన యదృష్టశాలి చాణక్యుఁడే! కాని యీ కార్య మింకను పూర్తిగాలేదు. కావలెనన్నచో—

సింధునదిగాదు - భారతదేశముయొక్క నైసర్గిక సీమ హిందూకుశపర్వతములే!

చంద్రగుప్త చాణక్యులు సింధునదీతటపర్యంతము రాజ్యమును బ్రసరింపఁ జేయుటతోఁ దృప్తిపడలేదు. వారి ప్రతిజ్ఞ యఖండభారతీయసామ్రాజ్య స్థాపన, మ్లేచ్ఛ నిర్వాపణము. నాఁడు భారత దేశ మున్నది సింధునదిప్రాంతము వరకే గాదు. దానికి పైనున్న గాంధారమును యీ దేశము నందలి భాగమే! కాబూలు (కుభా) కుర్రం (క్రము) స్వాత్ (సువాస్తు) గుమల్ (గోమతి) మొదలైన - నేఁడు ఆఫ్గనుస్థానమునకుఁ జేరిన ప్రదేశములన్నియు- పూర్వము భారత దేశముగా గణనకెక్కినవే! నాటి భారతదేశము హిందూకుశపర్వతముల శిఖరమువఱకు - అంతవఱకు వైదికధర్మానుయాయులయిన భారతీయులు- వారి జనపదములు - నివసించుచుండిరి పరంపరాగతముగ వచ్చిన రాజులు-వీరినిఁ బాలించుచుండిరి. ఈ ప్రదేశములు హిమశీతలములుగదా!

అందుచే నిక్కడి జనులు గౌరవర్ణులు. ఆ కారణముచే మనవా రా ప్రాంతమును శ్వేతభారతమని పిలచుచుండిరి. కనుక సింధునదికి దక్షిణపువైపు - రాజ్యమును బ్రవృద్ధము గావించిన చాణక్య చంద్రగుప్తుల పట్టుదల యంతటితో

(11)

నాగలేదు. హిందూకుశపర్వత శిఖరములపైన సామ్రాజ్య ధ్వజమును స్థాపించు టెట్లనియే వారి యాలోచన. అవకాశమునకై వారు కాంచికొనియుండిరి.

"శ్లో॥ యత్రాక్రాంతుంతి తపోభి రన్య మునయః
తస్మిన్ తపస్యన్త మిరా......"

## గ్రీకు సామ్రాజ్యమునఁ గలఁతలు - రాజ్య విభాగము

ఇంతలో గ్రీకు సామ్రాజ్యమునఁ గలఁతలు రేగినవి. యుద్ధముకూడ జరగెను. కడకు 'సికందరు శాహి' సామ్రాజ్యమును - ఆ సేనాపతులు దమలోఁ దాము బంచుకొన్నారు. ఆ పంపకముతో భారతదేశముయొక్క సీమలలోనికి వ్యాపించిన బాబిలోనియా రాజ్యము సెల్యూకస్ భాగమునకు వచ్చెను. వీఁడు మహాశూరుఁడు. సమర్థుఁడైన సేనాపతి. బాబిలోనియా ప్రాంతములకు నాతఁడు స్వతంత్రుఁడైన యధికారి యయ్యెను.

ఇంతలో భారతదేశమున మార్పులు జరగినవిగదా! పంచనదమునుండి సింధుదేశమంతయు బూర్తిగ భారత సామ్రాజ్యములోని భాగమైపోయినది. తన రాజ్యమునుఁ దనకు వెనుక కివ్వవలెనని సెల్యూకస్ చంద్రగుప్తునకు రాయబారమంపినాఁడు; కాని నేటి భారతదేశ స్థితే వేరు. తక్షశిల రాజైన - అంబుజునివంటి దేశద్రోహులు నేఁడు లేరు. అతని మహామాత్యునివంటివారు లేరు. నేఁ డున్నది చంద్రగుప్తునివంటి రాష్ట్రాభిమానపూరితుఁడైన రాజు; చాణక్యునివంటి మహామాత్యుఁడు. సెల్యూకస్ పంపిన రాయ

భారమునకు చాణక్య చంద్రగుప్తులు నవ్వినారు. వారు ప్రతిసందేశ మిట్లొసఁగిరి: "పంచనద సింధు ప్రాంతములు భారత దేశములోనివే! వానిని మానుండి వెనక్కు కోరుటలో నీకు న్యాయములేదు. ఇఁక గాంధారమును - హిందూకుశ పర్వతములవఱకున్న - భాగములు భారత దేశమునకుఁ జేరినవి. వానిని బలవంతముగ నింతకుముందు గ్రీకు లాక్రమించిరి. ఆ ప్రదేశములను మాకు వెనుక కివ్వవలెను."

## అసంఖ్య గ్రీకు సేనతో - సెల్యూకస్ భారతముపైకి నడచినాఁడు

ఈ ప్రతిసందేశమునకు సెల్యూకస్ సేనాపతి కోడలు మండినది. వాఁడు హిందూదేశముపైకి - దాడివెట్టెను. ఈ సంఘటన జరిగినది క్రీ॥ పూ॥ 315 వ ప్రాంతములో. సికందరు భారతముపైకి దండెత్తినది 320 వ ప్రాంతములో నంటిమిగదా! అతఁడు సింధును దాటి 327 వ సంవత్సరమున భారత దేశమును ప్రవేశించెను.

ఈ వివరము లింతకుముందే జెప్పితిమి. ఈ 'సెల్యూకస్' యుద్ధము భారతముపై జరిఁగిన రెండవదాడి.

సింధునదిని దాటినంతనే యెదుటఁబడు చిన్న చిన్న గణరాజ్యములను - సులభముగ జయింపవచ్చునని సెల్యూకస్ దలఁచెనేమో? కాని నేఁడట్లు జరుగలేదు. చంద్రగుప్త చాణక్యుల ప్రయత్నములతో, భారతము బునరుజ్జీవితమైనది. సింధునదీ ప్రాంతములు - పంచనద ప్రాంతములు - సింధు సాగర భూములు సుసంఘటితములై ఏక ఛత్రముక్రిందికి

వచ్చినవి. వారి సైన్య మొక నాయకుని యాజ్ఞలకు లోఁబడి నది. వారి కత్తులు వాడియైనవి. ఆ సైన్యములను నడపిన నాయకుఁడు చంద్రగుప్తుఁడు.

ఇరువాగులును కలసిన వెంటనే యుద్ధ మారంభ మయ్యెను. గ్రీకు సైన్యములు - ప్రచండమైన సాహసమును ప్రదర్శించినవి. కాని భారతసేనావారము నెదుట - వారి యాటలు బనికిరాలేదు. రెండు మూఁడు యుద్ధములుజరఁగినవి. అన్నిటియందును గ్రీకు లోడిరి. ఇక సెల్యూకస్ నకుమిగిలిన దొకటే మార్గము. అది చంద్రగుప్తుని శరణుజొచ్చుట.

## పౌరవ పరాభవ ప్రతీకారము

సికందరు శాహి బ్రతికియున్నప్పుడు పౌరవు నాతఁడు జయించెను. అపుడు జరగిన యత్యాచారములకు లెక్క లేదు. గ్రీకులపై చంద్రగుప్తుఁడు సాధించిన యీ విజయము- పౌరవుని యవమానమునకుఁ బ్రతీకారము.

## పరాజితుఁడైన సెల్యూకస్ చంద్రగుప్తుఁడు విధించిన యన్ని షరతులకుఁ లోఁబడినాఁడు

సంధి షరతుల ప్రకారము - సింధునదికి దక్షిణమం దున్న భాగములు - సర్వమును చంద్రగుప్తునకు వదలివేయఁ బడినవి. ఇంతమాత్రమే గాదు. గాంధారము మొదలైన భూములు - హిందూకుశ పర్వతములవఱకును - చంద్రగుప్తుని సామ్రాజ్యమునకే జేరినవి. ఈ నియమమున కంగీకరించు వఱకును- యుద్ధము నిలువదని- మహామాత్యులు చాణక్యుల యాజ్ఞ! సెల్యూకస్ కిమ్మనలేదు. అన్నిటికి సమ్మతించి

నాఁడు. విజయోత్సాహముతో - భారతమును సాధింతుమని తలలెత్తుకొని వచ్చిన - గ్రీకుసేనలు యవమానముచే నధోముఖములై - హిందూకుశ పర్వతములను దాటి - వెన్కకుఁ బ్రయాణించెను.

## భయము లేక ప్రీతి లేదు

చంద్రగుప్తుఁడు సాధించిన యీ విజయములచే హిందూకుశ పర్వతములవఱకును - నాతని రాజ్యమయ్యె నంటిని. దాని నానుకొనియే "సెల్యూకస్" రాజ్యము. సెల్యూకస్ మేధావి. అతఁడు చంద్రగుప్తుని పరాక్రమమును గమనించెను. చాణక్యుల బుద్ధి సంపద కచ్చెరువందినాఁడు. వీ రిరువ్వురి స్నేహమే తన యభివృద్ధికి మార్గమని యాతఁడు నిర్ణయించికొన్నాఁడు. ఇంతమాత్రమేగాదు. సికందరు శాహి సేనాపతులు దమలోఁ దాము - సామ్రాజ్యమును విభాగించుకొన్నారు గదా! వారిరాజ్యములు సెల్యూకసునకుఁ బ్రక్కప్రక్కనే యుండినవి. వా రేనాఁడైనను దనపై కెత్తివత్తురేమో యన్న భయమును సెల్యూకస్నకుండెను. రాజ్యాశలకుముం దేబాంధవ్యములు నిలువవుగదా! వారి నెదిరించుటకైనను - గ్రీకురాజు - చంద్రగుప్తుని మైత్రి సంపాదించుకొనవలెను ఈ చిక్కులన్నియు మనసున నుంచుకొని- యవనాధిపుఁడు చంద్రగుప్తునితో సంధి చేసికొన్నాఁడు.

ఇంతమాత్రమేగాదు. అతఁడు చంద్రగుప్తుని మైత్రిని బాంధవ్యముగఁగూడ బరివర్తింప యోచించెను. అందుకై సెల్యూకస్ తన బిడ్డను చంద్రగుప్తున కొసఁగి వివాహ మొనర్చినాఁడు.

యవనరాజొనర్చిన- యీ సాలంకృత కన్యాదానము- చంద్రగుప్తుని కీర్తి మందిరమునకు- రత్నకీలితమైన గోపుర మైనది.

## మహామాత్యులు - చాణక్యుల ప్రభావము

చాణక్యుల ప్రతిభవలన సువిశాల మౌర్యసామ్రాజ్యము వంద సంవత్సరములు సుస్థిరముగ నిలచెను. చాణక్యులు - కౌటిలీయార్థశాస్త్రమును వ్రాసినారు. చాణక్యుల జీవితము- లక్ష్యము, వారు రచించిన గ్రంథము- లక్షణము. ప్రతిభాసంపన్నులైన చాణక్యులు- దమ రాజకీయ విజ్ఞానముతో - మహా గ్రంథమును వ్రాసి- వ్రాసినట్లు దామాచరించి, లోకమునకుఁజూపి కృతార్థులైరి. చాణక్యుల శాస్త్రశక్తి, చంద్రగుప్తుల శస్త్రశక్తి - రాజ్యమున శాంతి సువ్యవస్థల నెలగొల్పినవి. ఆనాటి వైభవ మెట్టిదో మెగస్తనీసు వ్రాసిన - గ్రంథమును జదివిన మనకుఁ దెలియును. మెగస్తనీసు గ్రీకు రాయబారి. ఆతఁడు సెల్యూకస్ చేఁ బంపఁబడెను.

ఒకానొకనాడు- ఒక గడియసేపు - దటస్థపడిన యొక యైతిహాసిక సన్నివేశము - ఒక్క వేయి సంవత్సరముల యితిహాసము మార్చివేయును. ఈ యద్భుతశక్తి కాలపురుషుని యింద్రజాలములలో నొకటి. చంద్రగుప్తుఁడు గ్రీకుల నోడించినాఁడుగదా! ఈ పరాక్రమ ప్రదర్శనము భారతేతిహాసమునే మార్చివేసినది. దాని ప్రభావ మంతటిది. సెల్యూకస్ దాడినిగురించి వర్ణించుచూ 'విన్‌సెంట్ స్మిత్' యీ క్రింది వాక్యములు వ్రాసినాఁడు: "చంద్రగుప్తుఁడు గ్రీకుల కొనర్చిన పరాభవము వారి మనస్సులలో గాఢముగ నాటు

కొన్నది. వారెక్కువ భయపడిపోయిరి. మరల సుమారు 1500 సం॥ములవఱకు యూరోపునందలి యే స్వతంత్ర రాజ్యమేగాని - భారత దేశమువైపు దలయెత్తి - చూడనే లేదు. సెల్యూకస్‌తో జరగిన సంధిషరతుల ప్రకారము- హిందూకుశ పర్వతములు - బెలూచీస్థాన ప్రాంతములు - భారత దేశ సామ్రాజ్యమునకు లోఁబడినవి. ఇవియే భారత దేశమునకు నిసర్గమైన యెల్లలు. ఇది చంద్రగుప్తుఁడు సాధించిన యద్భుత విజయము. మరల నిట్టి విజయమును సాధించుటకై, యెందరో ప్రయత్నించి విఫలులైరి. ఆంగ్లేయులు ప్రయత్నించి నిరాశులైనారు. ప్రబలులైన మొగలు చక్రవర్తులుగూడ - నీ భాగములను జయింప లేకపోయిరి. ఇట్టి మహా విజయమును భారత దేశపు మొట్టమొదటి చక్రవర్తి - చంద్రగుప్తుఁడు రెండువేల సంవత్సరములకు - ముందే సాధించెను.'' 'విన్ సెంట్ స్మిత్' వ్రాసిన యీ క్రింది వాక్యములు జూడుఁడు :

"...... The first Indian Emperor, more than two thousand years ago thus entered into possession of that 'Scientific Frontier' sighed for in vain, by his English successors, and never held in its entirety even by the Moghul Monarchs of the 16th and 17th Century."

— (Early history of India : by V. Smith.)

అలెగ్జాండరు జగజ్జేత గాలేదు; భారత జేతయుఁ గాలేదు.

ఐరోపీయ సంస్కృతులలో గ్రీకు సంస్కృతియే ప్రాచీనము. అందుచే నేటికిఁ గూడ ననేక పాశ్చాత్యులు -

ఆ సంస్కృతినిఁ దమ మాతృస్థానముగ మన్నింతురు. కనుక నలెగ్జాండరు జూపించిన పరాక్రమముపై నేటికినీ పాశ్చాత్యులకుఁ బక్షపాతమెక్కువ. ఐరోపీయ చరిత్రకారు లాతనిని "Alexander the great" అనియే బిలతురు. అతని జీవితముపై నొనర్చిన యలౌకిక కల్పనలకు లెక్క లేదు. వాని నాయకులు ఊర్చియూర్చి చదువుదురు కాని యాతనికిఁ దీవ్ర ప్రతిద్వంద్వులై భారతేతిహాసమునే మార్చిన చాణక్య చంద్రగుప్తుల చరిత్రలు ఎవరో చరిత్రకారులకుఁ దప్ప యూరోపులో సామాన్యయువకులకుఁ దెలియదు. వారు దెలియనివ్వరు. ఆంగ్లేయులు మనకుఁ శాలకులైన దురవస్థ బట్టిననాఁడు మన పాఠశాలలకుఁగూడ వారే చరిత్రలు వ్రాసిరి యథాప్రకారము వానిలోను అలెగ్జాండరు విక్రమ వర్ణనలు ప్రవేశించెను. నాలుగైదు తరములుగ నీపాఠము లిట్లే వల్లించుట జరిగినందున మనలోఁగూడ గొందరు చారిత్రకుల మనుకొనువారికి యలెగ్జాండ రారాధ్యదేవుఁడైనాఁడు. అతనిని గూర్చి యెఱిఁగినంతగ వారు చంద్రగుప్త చాణక్యులఁగూర్చి యెఱుఁగరు. ఈరీతి యైతిహాసిక విపర్యాసముచే దేశమునకెంత నష్టము గలిగెనో వివరించి చెప్పఁ బనిలేదు. ప్రతి విషయమందును భారతీయుల యవనతిని జూపింపనిది పాశ్చాత్యులకుఁ దృప్తిలేదు. దీనినిగురించి వా రెన్నో గాథ లల్లిరి. ఆ గాథలు పాఠశాలా పుస్తకములలో ప్రవేసించినవి. ఉదాహరణార్థమై యీక్రింది వృత్తాంతము జదువుదముగాక!

పాశ్చాత్యదేశములలో పాఠశాలాపుస్తకములలో నున్న యొక భాగ మిది :

"అలెగ్జాండరు జగజ్జేత యగునని జనులు నమ్మిరి. భారతమునంతయు నాతఁడు జయించితీరుననియు వారి విశ్వాసము. పరాక్రమియైన యీ పురుషుఁడు- జగత్తునంతయు జయించి స్వదేశమునకు మరలివచ్చెను. ఇఁక నాతఁడు జయించుట కే దేశమును మిగులలేదు. ఇది యాతనికి పెద్ద నిరుత్సాహ కారణమైనది. దీనితో నాతఁ డెంతయో బాధపడెను."

ఇది యీ పుస్తకములలో నున్న కథ. ఈ విషయము యూరోపునందేగాదు; భారతదేశమున వ్రాసిన గొన్ని చరిత్రలలోను గలదు. ఈవ్రాత యెంత హాస్యాస్పదమైనది? అలెగ్జాండరు కాలమున చీనాదేశము ప్రచండమైన సామ్రాజ్యము. దానివై పాతఁడు దిరిగి చూడనేలేదు. అతఁడు భారతమున ప్రవేశించెను. కాని- మగధదేశమువఱకైనను జయించికొనుచు రాలేదు. తాను భారతదేశము నంతయు జయింతునని యాతఁడు నమ్మెను. కాని, యీ విశ్వాస మంతయు ముక్కలు చెక్క లెట్లయ్యెనో యింతవఱకు వర్ణించికొని వచ్చితిమిగదా! అలెగ్జాండరు పరాక్రమవంతుడు గావచ్చును. విజేత గావచ్చును. కాని జగజ్జేతకాదు; భారత విజేత అసలే కాలేదు. మఱి యిట్టివాఁడు "జయించుట కింక యేదేశమును మిగులలేదే" యని అన్నట్లు వారు వ్రాయుట కేవల కల్పన. అతఁడు భారతమునందు జయించినది యొకానొక చిఱుమూల మాత్రమే! ఆ భాగములుగూడ వెంటనే దిరుగఁబడినవి. కనుక గ్రీకుచక్రవర్తి "భారతదేశము నంతయు నేను జయింపలేదే! నా జీవితమంతయు ప్రగల్భమయ్యెనే!" యనిమాత్రము బాధపడియుండును. "గోమాంతకే" యనెడు కావ్యమునం దిట్లున్నది:

శ్లో॥ అన్య కుణాచా అసో సికందరు పరంతు భారత జేతా నా
అంగణ హి నాతయేఁ దేఖిలేఁ కళలాహీనా కుణా కుణా॥

## వేయి సికందరు శాహులు.

గొప్పవారి నొకరితో నొకరినిఁ బోల్చుటయే కష్టము. ఎవరి వెల వారిదే! కాని అట్లుబోల్చి చూపుటొక దురభ్యాసముగ ప్రచారములోనికి వచ్చినది. ఈ యాచారము నారంభించినవారు పాశ్చాత్య చారిత్రకులే! వా రలెగ్జాండరును 'The great' అని సమ్మానించిరి. ఆతని ప్రతిద్వంద్వియైన చంద్రగుప్తుని పేరుఁగూడ నెత్తలేదు ఇది చంద్రగుప్తుని కవమానముగదా! నిజమునకుఁ జూచినచో నొక చంద్రగుప్తుఁడు వేయి సికందరుల వంటివాఁడు. సికందరు శాహికి వెనుక బలమున్నది. అంతకుముందే యాతనితండ్రి గొప్ప సామ్రాజ్యమును సంపాదించిపెట్టెను. దానిసహాయముతో నాతఁడు – గ్రీకు సామ్రాజ్యమును నిర్మించెను. చంద్రగుప్తున కట్టి యనుకూలము లేదు. ఆతనికడ నొకసైనికుఁడును లేడు. తండ్రి దేశ బహిష్కృతునిఁ గావించెను. ఆతనికి సహాయకుఁ డొక్కఁడే! ఆర్య చాణక్యుఁడు. వీ రిద్దరును శూన్యములోనుండి యొక మహాసృష్టి నొనర్చిరి. సైన్యమును సమకూర్చికొనిరి. సెల్యూకస్‌వంటివాని నోడించిరి. సికందరు పాలించిన సామ్రాజ్యమునకంటెను – గొప్ప సామ్రాజమును బాలించిరి. భారత చరిత్రయందుఁ దమ నామములను స్వర్ణాక్షరములతో లిఖించిరి. ఒకచంద్రగుప్తుఁడు వేయిసికందరు శాహులకు సాటిగాదా? అతని జీవితము భారతచరిత్రలో నొక స్వర్ణ పత్రము గాదా?

తప్పక యైనది.

# 2

## యవనాంతకుఁడు : పుష్యమిత్రుఁడు.

చంద్రగుప్త మౌర్యుఁడు క్రీస్తునకు ముందు 298 వ సం॥న మరణించెను.

అతని యనంతరము సింహాసనము నెక్కినవాఁడు బిందుసారుఁడు. ఇతఁ డాతని సుతుఁడు. ఇతఁడును మహా పరాక్రముఁడు. "అమిత్ర ఘాతకుఁడ" ని యితనికి బిరుదుగద్దు. చంద్రగుప్తుని యనంతరమును జాణక్యుఁడు మహామాత్యుఁడుగ నుండెను. ఇతని సాయమున బిందుసారుఁడు – తండ్రి దృష్టిలోనుంచికొన్న సూత్రమును గొనసాగింప మొదలు పెట్టెను. చంద్రగుప్తుని యాదర్శ మేదో ముందే జెప్పితిమి. భారతదేశము నేకచ్ఛత్రమునకుఁ దెచ్చుట. ఆతని జీవితమున నీ యాదర్శములో నర్ధభాగమే సాధితమైనది చంద్రగుప్తుని కాలముననే మ్లేచ్ఛులు వెనుకకు నెట్టఁబడిరి. భారత మంతయు స్వతంత్ర మయ్యెను. ఉత్తరభారతమున నేకచ్ఛత్ర సామ్రాజ్య మేర్పడెను. కాని – అతని యాదర్శ మంతే గాదు. భారతదేశమంతయు నొకనీడక్రిందికి రావలెనని యాతఁడు గాంక్షించెను. దక్షిణ భారతమునుఁగూడ నాతఁడు జయింపఁ దలఁచెను. ఈ పని పూర్తిగాలేదు.

దక్షిణభారతమందు నాఁడు వేఱు వేఱు రాజ్యము లుండెను. అవి ప్రాచీనములు. స్వతంత్రములు. ఇతరుల

దాడి వారిని బాధింపలేదు. మ్లేచ్ఛులు వారిని గన్నెత్తి చూడలేదు. కాని భారతమంతయు నొకరాష్ట్రమగుటలో నున్న శాంతి - విభిన్న రాజ్యములుగ నుండుటలో లేదని చంద్రగుప్త చాణక్యులు గ్రహించిరి. కాని యీ యాదర్శమును సాధించుటకుముందే చంద్రగుప్తుఁడు మరణించినాఁడు.

బిందుసారుఁడు దక్షిణముపై నెత్తెను. అతఁడు జతురోపాయ చతురుఁడు. దక్షిణమున ననేక రాజు లాతని యానతిని శిరములఁ దాల్చిరి. పూర్వ, పశ్చిమ సముద్రముల మధ్యనున్న రాజ్యములు సుమారు పదునేడు బిందుసారుని రాజ్యమున విలీనము లైపోయెను. చంద్రగుప్త చాణక్యుల కలలు సత్యమొనర్చుటకై బిందుసారుఁ డెంతయో గష్ట పడెను. ఇది యాతఁడు సాధించిన గొప్ప విజయము. ప్రయాణములకే యనుకూలములు లేని యీ కాలమున నింతటి విజయమును సాధించుట యాశ్చర్యములలో నాశ్చర్యము.

లోకమందు యింత సైనికబలమున్న సామ్రాజ్యములేదు;
గ్రీకులకుఁగూడ నంత బలము లేదు.

చాణక్యుఁ డనుసరించిన రాజనీతి నియమములు చాల గొప్పవి. అతఁ డేర్పాటు జేసిన పద్ధతులు ప్రజల కెంతయో క్షేమకరములు. జను లా రాజ్య పద్ధతి నెంతయో ప్రశంసించిరి. అశోకుఁడు బౌద్ధుడుగ మారిన యనంతరముగూడ- సుమారు నూరువర్షములు మౌర్యసామ్రాజ్యముపైకి దండెత్తి వచ్చిన దిట్ట లేడు. ఆ సామ్రాజ్యముయొక్క భూమార్గములు, సముద్రమార్గములు - వీనియం దేశత్రువులుగూడ

ప్రవేశించి యుపద్రవము గలిగింప వీలులేకుండెను. చాణక్యు లేర్పఱచిన యాచారము లంత పటిష్ఠములు.

## పు ణ్యా శ్లో కుఁ డ శో కుఁ డు.

చక్రవర్తియైన బిందుసారుఁడు క్రీ॥ పూ॥ 273 వ సం॥న కాలగతిఁ జెందెను. అతని సింహాసనముపై నశోకుఁడు గూర్చున్నాఁడు. అతనికన్న పెద్దవారు సోదరు లుండిరి. వారిని దొలఁగించి యాతఁ డధివసించెను. భారతేతిహాసమునందు మాత్రమేగాదు; లోకముయొక్క యితిహాసమునందుగూడ "అశోకుఁడు పుణ్యశ్లోకుఁడ"న్న కీర్తి యాతని కొక్కనికే దక్కినది. కాని - యతని జీవితము మాత్రము ఇతిహాసమున స్వర్ణపత్రములలో నొకటిగా లేకపోయినది. కారణమేమనఁగా- నీ గ్రంథము మొదటనే యొక నరపాలుఁడు గొప్పవాఁ డనుటకు మా యంచనాలేమో నిర్ణయించి మనవిఁజేసితిమి.

అశోకుఁడు బౌద్ధమతానుసారియైనాఁడు. అతఁ డా మతమును స్వీకరించిన వెనుక దాని మూలసూత్రములైన యహింస మొదలగు వానికి విపరీతముగ ప్రాధాన్యము నొసఁగెను. దాని పరిణామములు పరమ దుష్టములై - భారతదేశ రాజకీయములపై - వారి స్వాతంత్ర్యములపై - వారి సామ్రాజ్యముపై ప్రతిఫలించినవి. ఈలోపము అశోకునియందు మాత్రమే గాదు; ముఖ్యముగ బౌద్ధమతముయొక్క మూలసూత్రములలో; ప్రవృత్తులలోనే యుణఁగియున్నది.

## "నమో భగవతే బుద్ధాయ"

బౌద్ధమతమునుగుఱించి విమర్శించుటకు ముందు పాఠకుల నీ విషయములు జక్కఁగా జ్ఞాపక ముంచికొనవలయునని మనవి జేయుచున్నాను. లేకున్నచో – నా వాదమును వారస్తవ్యస్తముగ నర్థము జేసికొను ప్రమాదముగలదు. "బౌద్ధమతముపై నాకు, గొప్ప యాదర మున్నది. భారతేతిహాసమున గొన్ని యుత్తుంగములైన శిఖరములు గలవు. ఆ శిఖరముల కాంతులు జగత్తునే విభ్రాంతి పరచునవి. అట్టి గగనచుంబిశిఖరములలో నొక శిఖరమే బుద్ధభగవానుఁడు." ఇట్టి యాదరమును భగవంతునిపైఁ గలిగి యాతని శిష్యునివలె సమీపమునఁ గూర్చుని యా భగవానుని గొన్ని ప్రశ్నలడుగ నిచ్ఛయున్నది. ఆ ప్రస్తావనకుముందు "నమో భగవతే బుద్ధాయ" యని మనసార నా మహానుభావునకు నమస్కరింతును. వారు జన్మించుటచే హిందూదేశము బవిత్రమైనది. బుద్ధభగవానుని శ్రీ మహావిష్ణువుయొక్క తొమ్మిదవ యవతారముగ ననుభవజ్ఞులు గుర్తించిరి.

## బౌద్ధధర్మము భారతదేశమున నామావశేషమగుటకుఁ గారణమేమి ?

అశోకునికి ముందు 300 వర్షములవఱకును బౌద్ధమతము మగధదేశము పరిసర ప్రాంతములందు మాత్రమే వ్యాపించెను. ఆ ప్రాంతములందే యక్కడక్కడ నుపదేశింపఁ బడుచుండెను. ఆ దినములలో దాని ప్రచారమనఁగా హృదయ పరివర్తనము మాత్రమే. అందుచే

దాని ప్రసారము మందముగనే జరిగినది. సికందరు సెల్యూకసుల కాలములవరకును "పంచనద - గాంధార" ప్రభృతి ప్రాంతములలో దాని పేరుగూడ వ్యాపింపలేదు. ఈ విషయ మింతకుముందే దెల్పితిమి. గ్రీకుల కా మతముయొక్క యూసే తెలియదు. చాలమంది చరిత్రకారులు బౌద్ధమతము వేదముల ప్రామాణ్యము నాక్షేపించెననియు, నిరీశ్వరవాద మనియు, నందువలన నా కాలమునందలి వైదికధర్మానుయాయులైన జనులు దానిని ప్రబలముగ విరోధించిరనియు విశ్వసింతురు. ఇంతవరకును సామాన్యజను లట్లే నమ్ముచు వచ్చిరి. కాని ఇది సత్యముగాదు. గౌతమబుద్ధుడు వేదనిందకుడనుట పరిహాసభాజనము. అట్లే నిరీశ్వరవాదమునకు, శూన్యవాదమునకు నతడే మూలపురుషు డనుటయు నసత్యము. బుద్ధభగవానుని జన్మకు ముందే- భారతదేశమున నవైదికములు, నిరీశ్వరములునగు సంప్రదాయములు సుమారు యేబదివఱకుండినవి. బౌద్ధ గ్రంథములనుబట్టిగూడ నీవిషయము తెలియును. బౌద్ధము వైదికమా? కాదా? యను చర్చ మేధావుల వాద వివాదములకు సంబంధించిన తార్కిక విషయము. ఇక హృదయ పరివర్తనాకార్య మందుమా - ఏమత మెవ్వనికి రుచించిన దానిలో వాడు జేరును. దీనితో నొరులకు లాభనష్టములు రెండును లేవు. బుద్ధుని కాలమునుండి శంకరుని కాలమువఱకును బౌద్ధ మొకప్పుడును పట్టుమని పది దినములు శాంతితో గడపినది లేదు. దానికెప్పుడును సంఘర్షణలే! శంకరుల మేధస్సుతో నది సంపూర్ణముగ తాడితమైపోయినది. కాని శంకరులకు ముందే వైదికధర్మాభిమానులైన విప్రులు,

క్షత్రియులు బౌద్ధధర్మములను, దాని పరిణామములను, వాని యనుయాయులను దీవ్రముగ ద్వేషింప నారంభించిరి. ఈ ద్వేషములకుఁ గారణము తాత్త్వికములైన విషయములలోఁ గల భిన్నత గాదు. దానికి రాజకీయములైన కారణములే ప్రధానములు. అవి యేవో గొంత సంక్షేపముగ దెల్పెదను.

## అశోకుఁడు వైదిక ధర్మముపై బౌద్ధధర్మమును బలవంతముగ రుద్దెను.

అశోకుఁడు బౌద్ధమతమును స్వీకరించెనంటిని. వయస్సు గడచుకొలఁదియు నాతనికి బౌద్ధమతాభినివేశ మెక్కువై పోయినది. అంతవఱకును బౌద్ధమతవ్యాప్తి యుపదేశమూలకముగనే జరుగుచుండెను. దీనితో నాతనికిఁ దృప్తి గలుగలేదు. రాజబలముతో నాతఁడు దానిని బ్రచారముసేయఁదలఁచినాఁడు. వైదికధర్మానుసారము ముఖ్యములైన ధర్మములు గొన్ని గలవు. అవి బౌద్ధులకు నిషిద్ధములు. వారి మతము ననుసరించిన యతఁడు బౌద్ధుల కనిష్టములైన వైదిక ధర్మములను దండనార్హములని బ్రకటించెను. యజ్ఞయాగములు హింసాప్రధానములని యశోకుఁడు దన సామ్రాజ్యమున వాని నాచరింపరాదని గఠినముగ శాశించెను. వైదిక ధర్మమునకు యజ్ఞానుష్ఠాన మాదరకేంద్రము. వేదకాలము నుండియు యజ్ఞగోష్ఠులు వైదిక సంస్కృతికి వికాసస్థానములుగ నుండెను. ఇట్టి యజ్ఞముల నపరాధములని యశోకుఁడు హఠాత్తుగఁ బ్రకటించినాఁడు. అశోకుని సామ్రాజ్యమున నూటికి ఎనుబదిమంది బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలైన వైదిక ధర్మానుయాయులే యుండిరి. అశోకుని యీ ప్రకట

నము వారి మనస్సున కెంతయో బాధను గలిగించినది. వేటాడుటఁగూడ నపరాధ మని యారాజు నిర్ణయించి నాఁడు. వైదిక ధర్మములలో క్షత్రియునకు వేట కర్తవ్య ముగ నిర్ణయింపఁబడెను. లక్షలాది ప్రజలయొక్క ఆహా రముగా ఉన్న చేపలు, కోళ్లు కూడ చంపుట అశోకుడు నిషే ధించెను. ఇవియేకాక అరణ్యములలోనున్న హింసాపశువులను చంపుటకూడ నిషేధించెను. ఒకవైపీ పని యొనర్చుచునే యాతఁడు పెద్దపెద్ద స్తంభములపై "సర్వధర్మములను సహిష్ణు వులుగ మన్నింపవలెను: శ్రమణులను - బ్రాహ్మణులను గౌరవింపవలె"నని బ్రహ్మాండముగ జెక్కించినాఁడు. మరి - తా నెందు కట్లు ప్రవర్తింపలేదో! అంత గొప్ప చక్రవర్తికి దన మాటలకును - చేతలకును గల యీ విసంవాదిత్వము స్ఫురింపక పోవుట గొప్ప యాశ్చర్యము.

బౌద్ధమతము బోధించు నీ ధర్మములు భారతదేశము యొక్క సామాజిక జీవనమునకును- రాష్ట్రీయ శక్తికిని హాని గలిగించునని చాణక్యుఁ డెన్నడో యంచనా వేసినాఁడు. అశోకున కేబది సంవత్సరములకు ముందున్నవాఁడు చాణ క్యుఁడు. ఈ ప్రమాదములను గమనించిన చాణక్యుఁడు దన యర్థశాస్త్రమునందు "సంసారమును వదలి భిక్షుకులై పోవు వారిపై" గొన్నినిబంధనలను విధించినాఁడు. "చిన్నవయస్సు నందున్న స్త్రీ తన తల్లిదండ్రులయొక్క, రాజుయొక్క అను మతి లేనిదే సన్యసించుటనుగూర్చి చాణక్యుఁడు తీవ్రమైన యసమ్మతిని దెలిపెను. అట్లే పురుషుల విషయమునగూడ భార్యాపుత్రులకు జీవనోపాధి చూపనిదే సన్యసింపరాద"ని

నియమించెను. ఇట్టి పెన్ని విషయములనో చాణక్యులు సమాజ క్షేమమునకై జెప్పెను. కాని యశోకుని కాలమున నీ నియమముల నన్నింటిని సడలించినాఁడు. ఎవ్వరేగాని యెట్టి వయస్సులో నున్నను నిర్బాధముగ భిక్షుసంఘమునఁ జేరవచ్చునని-యాతఁడు శాసించెను. జనులు గుంపులు గుంపులుగ జేర నారంభించిరి. మఱి-యీ నిర్వ్యాపారుల కన్నవస్త్రములు? వారిని బోషించుట రాజు పరమ ధర్మముగ భావించెను. రాజకోశమునుండి లెక్క లేనంత ధనము బౌద్ధసన్యాసుల వెచ్చముల క్రింద బోవుచుండెను. ఈపని యంతయు ధర్మమనెడి ముసుగు క్రింద నొనర్చినదే! కాని - యీ ధనమంతయు నెవ్వరిది? వైదికధర్మానుయాయులగు ప్రజలది. అశోకుని రాజ్యమున ననేకులు - వైదికధర్మానుయాయులే యని చెప్పితిమి. తమ ధనమంతయును దమకు విరుద్ధములైన లక్ష్యములకై ఖర్చుపెట్టబడుచుండుట యా జనుల కసహ్యమైనది. వారిలో నతృప్తి ప్రబలెను. ఇది సహజమే!!

## సామ్రాజ్యముయొక్క శస్త్రబలమునకు మూలోచ్ఛేదనము.

అహింసాధర్మమున కశోకుఁ డొసఁగిన మితిమీఱిన ప్రాధాన్యముచే సామాజిక జీవనమునకు - రాష్ట్రజీవనమునకు యెంత దెబ్బ దగిలెనో! ముందే తెల్పితిమి. ఇంతకంటెను నపకారక విషయ మొకటి గలదా? "శస్త్రబల మెల్లను హింసామయము. పాపకారక" మని యతఁడు విశ్వసించెను. ఆతని పాలికి క్షాత్రధర్మమే బనికిరానిదై పోయినది. పరాక్రమ ప్రదర్శన క్రమము అధర్మము. అందుకై యాతఁడు శస్త్రత్యాగ మొనర్పవలె నని

ప్రేరేపించెను. సంసారముల వదలి యనేకులు భిక్షువులలో జేరి - విహారములలో విశ్రాంతి గైకొన జొచ్చిరి. దేశస్వాతంత్ర్యమును రక్షించుటకై - యాత్మార్పణ మొనర్చు మహావీరుని కంటెను - విహారములలో సోమరిపోతుగ నిద్రించు సన్యాసి పుణ్యవంతుడుగ - పూజార్హుడుగ గౌరవింపబడెను. అశోకుడు ప్రచారమొనర్చిన యిట్టి ప్రవృత్తులచే సామాన్యజనులలో శస్త్రధారణమందును, విక్రమ ప్రదర్శనము లందును - నాసక్తి తగ్గిపోజొచ్చెను. సైనికవృత్తి నవలంబించువాడు పాపిగ నెంచబడెను. తిండిపోతులైన బౌద్ధసన్యాసులు సమాజముల దిద్దు నేర్పుకాండ్రైరి.

అశోకుడు తాను దేశమున నెలకొల్పిన స్తంభములపై నీ వాక్యముల జెక్కించినాడు. "శస్త్ర విజయమునకన్నను - ధర్మవిజయము శ్రేష్ఠమైనది." కాని - పాశవికవృత్తులు జెరలాడు నీ యైహిక ప్రపంచమున నూటికి నూరుపాళ్ళు ధర్మవిజయము సాధ్యమే గాదు. మానవుడు సాత్త్వికుడగుట గొప్ప సిద్ధియే! కాని - యది వైయ్యక్తికము. దీని నొక సమాజమునకే యన్వయించుట యపాయకరము. అమృతమును ద్రావిన మనుష్యుడమరుడగును. కాని యా యమృతము సిద్ధించు టెట్లు? అది యంగడిలో నమ్ము పదార్థము గాదు.

అశోకుడు శస్త్రబలమును బరిత్యజించె నంటిని. అశోకుడు ధర్మవిజయము గొప్పదను నీ సూక్తిని దనరాజ్యమున గ్రామ గ్రామమునందును వెల్లడించెను. పరరాజ్యములలోగూడ నాతడీ ధర్మభేరిని జాటింపజేసెను. ఆతనికి సాధన

సామగ్రి సంపూర్తిగ నుండినది. ఎందరో ధర్మోపదేశకులు-దూరదూర దేశములకు వెళ్ళి - యా ధర్మమును ప్రచార మొనర్చిరి. కాని యా యైహిక ప్రపంచమున - బరిపూర్ణముగ ధర్మవిజయ మేనాటికినీ నశక్యమే! తొలినాళ్ళలో నశోకుఁడు సింహాసనమును శస్త్రబలముచేతనే సాధించుకొనెను. దానిని స్థిరపరచికొన్నదియు సైన్యబలముచేతనే. అతఁడు సింహాసనమునకు వచ్చిన వెంటనే "ధర్మబలమే ప్రధానము"ని యీ విహార మా విహారమని దిరుగుచున్నచో నశోకుఁడు చక్రవర్తియే యైయుండఁడు. భారతదేశమునకుఁ బ్రక్క-ప్రక్క-లనే గ్రీకులు మొదలైన వా రుండిరి. అత్యంత హింసకులై - కేవల శస్త్రజీవులైన శకులు - హూణులు - కుషాణులు మొదలైనవా రుండిరి. వారికి భారత చతురంగ సేనను జూచిన భయము. అది సర్వత్ర జయశీలమని వా రెఱుఁగుదురు. అశోకుని కాలమునకు ముందును - నతని కాలమునను వా రీ దేశముపై దండెత్తి రాకుండుటకు గారణము శస్త్రసజ్జితమైయున్న సైన్యబలమే! కాని - యశోకుఁడు దయారుచేసిన భిక్షువులను జూచికాదు. అశోకుని యనంతర మాతని రాజ్యము ఛిన్నాభిన్నమై పోయినది. చంద్రగుప్త చాణక్యు లెంతో కష్టపడి సంపాదించిన ఘనవిజయము అశోకుని సన్యస్తశస్త్రమునకుఁ బలియై పోయినది.

ఈ చర్చ యిక్కడ సంక్షిప్తముగానే ముగింతును. కారణము స్థలాభావము. విశేషముల నెఱుఁగగోరువారు నా రచించిన "సన్యస్త ఖడ్గము" నాటకమును జూడవచ్చును.

బుద్ధుని యుపదేశములతో నారంభమైన యీ లోటును దురదృష్టవశమున భారతదేశ మెంతఘోరముగ ననుభవించినదన్నసంగతి - దానిలో విపులముగ వ్రాయఁబడినది. ఇట్టి భయంకరమైన ప్రచారముపై వైదికధర్మానుయాయులు గట్టిఁ గట్టకుందురా!

## బౌద్ధధర్మముయొక్క చర్చగాదు, మఱి - దాని రాజకీయ పరిణామముయొక్క చర్చ.

మే మిపుడు వైదిక - బౌద్ధ ధర్మములలోని తత్వములలో దర తమ విచార మొనర్చుటలేదు. అట్లే యజ్ఞ యాగములు - సన్యాసములు మొదలగు నాచారములకుఁ బారలౌకిక దృష్టిలో వెల యేదియనియు నిర్ణయించుటలేదు. ఐహిక దృష్టితోఁగూడ నీ తత్వములకు వెలయెంతయని సమగ్రముగ విలోకించుటయు లేదు. వారి యీ తత్వములలో నేటి దేశ కాల పరిస్థితుల ననుసరించి యేవి విశ్వాసార్హములనియే మా విమర్శనము. ఈ విషయమునందుఁగూడ మాకు బొత్తిగా నభినివేశము లేదు. మఱి- మాకిపుడు చర్చనీయాంశము- యే యే కాలమునందు బౌద్ధము మొదలైన ధర్మములు- వాని యనుయాయులు మొదలగువానితో నే యే విపరిణామములు భారత సామాజిక జీవనమున ప్రతిఫలించినవి- భారత సామాజిక జీవనము నెట్లు మార్చినది వినుటమాత్రమే.

## అశోకుని మృత్యువు తరువాత

విశ్వధర్మమును మనస్సునం దుంచుకొని లోక కళ్యాణార్థమై శ్రమించిన పుణ్యశ్లోకుఁ డశోకుఁడు-క్రీస్తు పూర్వము 232 వ ప్రాంతములలో గతించెను.

యితని యంతమే మౌర్య సామ్రాజ్యముయొక్క యంతమునకు శ్రీకారమైనది.

అశోక చక్రవర్తి సుమారిరువదియైదు సంవత్సరములు తను- మనో ధనములను బౌద్ధప్రచారమునకై వినియోగించెను. అతని యనంతరము సింహాసనమెక్కినవారు నికరమైన బౌద్ధులు. శస్త్రబలమును నమ్మనివారు, దుర్బలులు. దీనితో సుమారేబది వర్షములనుండి పటిష్ఠమై వచ్చిన సామ్రాజ్య శస్త్రబల ముపేక్షితమై పోయినది. బలసన్నద్ధమై- వాయువ్య పర్వత ప్రాంతములందున్న సామ్రాజ్య సైన్యము- అహింసా ప్రచారముతో విశకలితమై, అనుత్సాహదగ్ధమై పోయినది. భారతమునకు పొరుగుభాగములందే శత్రువులు గాచుకొని యుండిరి. అశోకుని యనంతరము ముప్పది వర్షములకు భారతముపై మరల వారి దాడి యారంభమయ్యెను.

## "బ్యాక్ట్రియన్" అను గ్రీకురాజుయొక్క దాడి

చంద్రగుప్తుడు సెల్యూకసును బరాభవించి క్రీ॥ పూ॥ 315 వ ప్రాంతములలో గ్రీకులను హిందూకుశ పర్వతములను దాటిపోవున ట్లొనర్చెను. హిందూకుశ పర్వతముల నానుకొని యే 'బ్యాక్ట్రియా' యను ప్రాంతము లున్నవి. వానికి రాజై సెల్యూకస్ గ్రీకు సామ్రాజ్యమును స్థాపించెను. ఈ గ్రీకులు స్వతంత్రులుగదా! వీరికిని యూరోపియను గ్రీకులకును నడుమ నెంతయో దూర ముండెను. అందుచే కాలక్రమమున వారి స్నేహబాంధవ్యములు దెగిపోయెను. స్వల్పముగా వైరములు గూడనుండెను. 'బ్యాక్ట్రియా'లోనున్న గ్రీకులను ఆసియాగ్రీకు

లనుచుండిరి. "సికందరు శాహి" యున్నపుడు శౌర్యసాహసములుగల గ్రీకుజాతి - కొంత కాలమునకు బలహీనముగ మారిపోజొచ్చినది. వారిలో శౌర్య మెంతయో తగ్గెను. కాని వారిలో నొక్క గుణముమాత్రము బోలేదు. సికందరు శాహి భారతమును జయింప బ్రతిజ్ఞ యొనర్చెనుగదా! ఆ యాదర్శమును బూర్తి యొనరింపవలెననుకోర్కె వారికిఁగద్దు. మౌర్యసామ్రాజ్యముయొక్క శస్త్రశక్తిని యహింసా ప్రచారమును జంఝూవాత మార్పివేసినది. అందుచే ఆసియా గ్రీకులలో భారతమును జయింపవలెనను నాశ మఱల మొలకెత్తెను. "డెమేట్రియస్" యను గ్రీకు చక్రవర్తి హిందూకుశములను దాటి భారతముపైకి వచ్చినాఁడు. భారత దేశమున కెదిరించు శక్తి యేదీ? అతఁడు కాంభోజ - గాంధార ప్రాంతములను సులభముగ దాటి సింధునది నుత్తరించెను "పంచ నదమును" హస్తగతమొనర్చికొని మగధపై నాతఁడు నడచెను. "పాటలీపుత్రమును జయించి భారతదేశ సార్వభౌముఁడ నౌదు నన్న యలెగ్జాండరుయొక్క కలను నేఁడు సాధించి తీరెదము"ను విజయ ఘోషలు గ్రీకుసైన్యములోఁ జెలరేగినవి.

## పంచనదాదిక భారతీయులకు యింతలో నెట్లు వీరవృత్తి మాయమయ్యెను?

నూరువర్షములకు ముందు గ్రీకులెత్తివచ్చినప్పుడు ఆ గణతంత్ర రాజ్యము లడుగడుగునను నిలచి యుద్ధము లొనర్చెను. ప్రజ లుద్రిక్తులై గ్రీకుల మార్గములను క్షణక్షణ మరికట్టిరి. అలెగ్జాండరున కీ భూమిని జయించుట దుర్భగ

మనిపించెను. ఇట్టి జాతి నాటి గ్రీకులకంటెను పరాక్రమమున నల్పులైన "బ్యాక్ట్రియన్" గ్రీకుల కెట్లు తెలు వాసఁగినది? అడుగడుగునను యుద్ధము లొనర్చు భారతీయుల విక్రమము నకు- సికందరు- సెల్యూకసులు - జకితులై అడుగు పెట్టలేక పోయిరిగదా? ఈనాఁడు "డెమేట్రియస్" అయోధ్యా ప్రాసాదములలో సుఖముగ నిద్రించుచున్నాఁడు.

అశోకుఁడు బౌద్ధుఁడైన నలుబది సంవత్సరములకే "డెమేట్రియస్" దండెత్తివచ్చెను. మఱి యింతలోపల నగ్గినైనను పుడిసిలింతు మను పంచనద ప్రాంతీయుల వీరవృత్తి యెక్కడ బోయినది? వారి వీరవృత్తిని మూలమట్టముగ నణచివేసిన సంఘటనమేదియు జరగినట్లు ఐతిహాసిక ప్రమాణములు లేవు.

సెల్యూకస్ సైన్యముల కంటెను - డెమేట్రియస్" సేనావారములు విక్రమముగలవియా? కావు. తమ కంటెను దమపూర్వులే యధిక తేజస్సంపన్నులని "బ్యాక్ట్రియన్" గ్రీకులే యొప్పుకొనుచుండిరి. మఱి భారతదేశ మోడిపోవుటకుఁ గారణము? భారతక్షత్రియులలోఁ గలిగిన వీరతాహ్రాసమే.

సికందరు క్రీ॥ పూ॥ 327 ప్రాంతములలో భారతముపై దాడి వెట్టెను "డెమేట్రియస్" దాదాపు క్రీ॥ పూ॥ 200 ప్రాంతములలో భారతదేశముపై కెత్తివచ్చినాఁడు. ఈ నడిమి కాలమున భారతీయుల వీరవృత్తిని సమూలనాశన మొనర్చుటకై జరగిన సన్నివేశ మొక్కటే! అది యశోకుని 'యహింసా ప్రచారము.' అశోకుఁడు బౌద్ధధర్మమును స్వీక

రించిన పిదప తన సింహాసనాధికారమును దోడు చేసికొని
బౌద్ధధర్మమును వ్యాపింపఁ జేయ మొదలువెట్టెను. ఆ ప్రచా
రము బ్రహ్మాండముగ జరగినది. ఇంతకన్నను మఱియొక యైతి
హాసిక ఘటన యీ మధ్యకాలమున జరగినదే లేదు.



## అలెగ్జాండరు కాలమున భారతీయుల మనోవృత్తి-
## డెమేట్రియస్ కాలమున భారతీయుల మనోవృత్తి.

సికందరు కాలమున కాంభోజ, గాంధార, పంచనద
ములలో బౌద్ధమతముయొక్క ప్రచారమే లేదంటిని. ఆనాటి
జనులు వైదికధర్మావలంబులు, వీరోపాసకులు. క్షాత్ర
వృత్తి నభిమానించు యౌధేయము మొదలైన గణతంత్ర
రాజ్యములవంటివి యానాఁడు వెలిఁగెను. వారు ముఖ్యముగ
నాయుధ జీవులు, నాగరకులు, సుసంస్కృతులు. అవసరము
వచ్చినపుడు క్షత్రియులేగాక సమస్తవర్ణములును గత్తివట్టు
చుండెను. స్త్రీలుగూడ యుద్ధము లొనర్చుచుండిరి. శస్త్ర
ధారణము వారి జీవితములలో నొక భాగము. శత్రువు లెత్తి
వచ్చునపుడు స్త్రీ పురుషు లిర్వురును ఖడ్గమును బట్టెడువారు.
దుర్దైవవశమున నోడిపోయినప్పుడు స్త్రీలు వారి శిశువులతోఁ
గూడ నగ్నిప్రళయమందు లీనమై పోవుచుండిరి. ఈ విష
యము లన్నియు నింతకుముందే దెల్పితిమి. ఆనాటి క్షాత్ర
వృత్తిని గుఱించి- చాణక్యుఁ డన్న ఈ క్రింది మాట లెంతో
తేజస్సు గలవి. 

అర్థశాస్త్ర మౌర్య చాణక్యుల రాజకీయములకు
లక్షణగ్రంథ మంటిని. చంద్రగుప్తుఁడు బరిపాలనా విషయ

మున తు॥ చ॥ తప్పక యనుసరించిన గ్రంథ మదే! ఆ చాణక్యు లేమనుచున్నారో జూడుఁడు :

"అమర్యాద ప్రవృత్తేన శత్రుభిః సంగరే కృతే
సర్వైవర్ణాశ్చ దృశ్యేయుః శస్త్రవంతో యుధిష్ఠిర !

వైదిక ధర్మానుయాయుల పరంపర యిదే! అవసరము వచ్చినపుడు బ్రాహ్మణుఁడు మొదలైన నాగరికులుఁగూడ యుద్ధములకుఁ దొలఁగి నిలువలేదు. సామ్రాజ్యమునందలి మహాసైన్యములు శత్రువులపై నుఱుకుటకు రణభూమియందు సన్నద్ధులైనపుడు రాజులు సైన్యముల సంబోధించి యిట్లు పలుకవలెనట !

"వేదేష్వ ప్యనుశ్రూయతే! సమాప్త దక్షిణానాం యజ్ఞానా మవభృథ స్నానేషు యా సా గతిః శూరాణా మితి॥ క్షణేన తా మ ప్యతియాంతి శూరాః ప్రాణా౯ సుయుద్ధేషు పరిత్యజంతి, తుల్యభోగోస్మి భవద్భిస్సహ॥ భోగ్య మిదం రాజ్యం॥ పరా౯ హంతవ్యం॥"

"యజ్ఞములచేతఁగలుగు సద్గతి శూరులకు రణాంగణమున లభించును. న్యాయమైన యుద్ధమునఁ బోరి ప్రాణార్పణ మొనర్చు వీరులకు స్వర్గము తక్షణమే - ప్రాప్తించును. ఈ రాజ్యము నావలెనే మీరును - నింతవరకు దీని ననుభవించితిరి. వెనుకకు జంకకుఁడు; శత్రువులపైఁబడుడు." ఉత్తేజకరములైన నిట్టి వాక్యములతోనే సెల్యూకస్‌పైకి నడపుచున్న దన సైన్యములకుఁగూడ చంద్రగుప్తుఁ డుత్సాహమును గలుగజేసెనేమో ? ఎవ్వారి కెరుక. ఆక్రమకులై - దురి

తమున కొడిగట్టి - పరులు మనపై నెత్తినపుడు స్వరక్షణార్థమై జరుపు యుద్ధములను - వైదికులు హింస యనలేదు. దానిని వారు ధర్మయుద్ధమని పిలచిరి.

"పరిత్రాణాయ సాధూనాం। వినాశాయ చ దుష్కృతాం।" యనునది వారి విజయఘోష.

సికందరు దేశముపై దండెత్తి వచ్చినపుడు- ఇట్టి ధర్మ యుద్ధము జరుగఁబోవుచున్నదనియు- భారతీయులు వీరశ్రీని ప్రదర్శింపవలసినదనియు- దేశము నలుమూలల బ్రహ్మాండముగ బ్రచారములు సాగెను. ఇట్టి ప్రచారకులను కొందరను బట్టి సికంద రురితీసెననిగూడ లోగడ చెప్పితిమి. ఆ ధర్మ యుద్ధములలోఁ గొందరు వైదిక విప్రులుఁగూడ- బాల్గొనిరి.

ఇట్లు- విక్రమముచే ద్రోణికిసలాడు చంద్రగుప్త చాణక్యుల సైన్యము- యవనాధిపుని హిందూకుశ పర్వతముల దాటిపోఁదోలినది. వారంతతో నిద్రఁబోలేదు. భారతదేశమునందేగాక ప్రపంచమందంతటిలో బలవత్తరమైన సైన్యశక్తిని సమకూర్చుటకు సన్నాహములు సంతత మొనర్చుచుండిరి. భారతసైనికుల విక్రమము, గ్రీకులనుఁ గలఁచివేసెను. అందుకే దాదాపు క్రీ॥ పూ 125 సంవత్సరముల ప్రాంతము వరకును- వీరు- యీ దేశమువైపు గన్నుదిప్పి చూడనేలేదు. అనగా నశోకుఁడు వీరవృత్తి నాదరించుచు వైదికధర్మానుయాయియై యున్నంతవరకన్న మాట!. దాదాపు క్రీ॥ పూ 252 వ సం॥ ము వరకును హిందూకుశ పర్వతముల కావల నున్న గ్రీకులు- భారతదేశమన్న భయపడుచుండిరి.

కాని యశోకుఁడు బౌద్ధధర్మమును స్వీకరించినవెంటనే యీ సమస్తములైన రాష్ట్రీయగుణములు జనులలో హఠాత్తుగ మాయమయ్యెను. గౌతమబుద్ధుఁడు దనకు సంసారమునం దరుచి జనించినదే తడవు శాక్యరాజ్యమును వదలి భిక్షువై పోయెను. అట్లే యశోకుఁడును బౌద్ధధర్మావిష్టుఁడైనంతనే సామ్రాజ్యమును వదలి భిక్షువై పోయి-బౌద్ధమతమును ప్రచారము చేయుచున్నచో- భారతీయుల రాష్ట్రధర్మమున కింత దెబ్బ దగిలి యుండెడిదిగాదు. అశోకుని త్యాగము లకును నది యొఱపిడిగల్లుగ నుండియుండును. కాని చచ్చువఱకు నశోకుఁడు సింహాసనమును వదలలేదు. రాజ్యమునంతయు నాతఁడు బౌధమత ప్రచారకుల మఠముగ మార్చివేసెను. రాజ్యమునకు వాయవ్య ప్రాంతములలో నాతఁడు "ధర్మ విజయమే శస్త్ర విజయమునకన్నను శ్రేష్ఠమైనది"; "అక్రోధమున క్రోధమునుజయింపవలెను";"అహింసాపరమోధర్మః"; "మా హింస్యాత్ సర్వభూతాని" ఇత్యాది వాక్యములను పెద్ద పెద్ద స్తంభములపై జెక్కించినాఁడు. ఇవి యన్నియును వైదికధర్మములే! దేశకాల పాత్రముల ననుసరించి హితకారకములే! కాని బౌద్ధమతమున నా వివేకము బోయినది. సమాజమునకే యీ సూత్రముల నన్వయింప మొదలువెట్టిరి. బౌద్ధ భిక్షువులు రాజకోశములందలి ధనముల దినుచు దేశముల దిరిగి శస్త్రబలము పాపమని ప్రచారము చేయసాగిరి. అశోకుని సామ్రాజ్యమున "రజ్జుకులు" "ధర్మమహామాత్రులు" "ప్రాంతీయాధికారులు" అనెడి పదవులుండెడివి. వీరిచే ఆ యా ప్రాంతములయందు అశోకుని ఆజ్ఞ ప్రకారము బౌద్ధ

మత ప్రచారమును, ఆ ధర్మము నాచరించుటకు ప్రోత్సాహమును చేయవలసి వచ్చుచుండెడిది ఈ పదవులకు బౌద్ధులే నియమింపఁబడిరి. బౌద్ధ భిక్షువుల కీ ప్రోత్సాహము లభించినది. గాంధార పంచనదాది క్షేత్రములలో కేవలము నాగరకులందేగాక సైనికులలోఁగూడ బౌద్ధధర్మ ప్రచారము సాగెను. దీనితో సైనికులకు వీరపురణమునం దాసక్తి మందగించినది. ఇరువది వర్షములు వీరవృత్తి నిరోధకము, అరాష్ట్రీయమునైన ఇట్టి ప్రచారమను సాగించి యశోకుఁడు మరణించెను. అతని పిదప సింహాసనముపై దుర్బలు లెక్కిరి. వారును బౌద్ధులే! చంద్రగుప్త చాణక్యు లెంతో కష్టపడి సాధించిన రాష్ట్రీయభావ మశోకుని యుపేక్షతో నిర్ధళితమై పోయెను. కోట - క్రొత్తడము లుపేక్షింపఁబడెను.

## సారాంశము

బౌద్ధులు శస్త్రబలమును నిందించిరి. జనుల స్వాతంత్ర్యమును, బుద్ధి నరికట్టిరి. వీరవృత్తి నుపేక్షించిరి. అహింస నతిరేకముగఁ బ్రచార మొనర్చిరి. ఆ ప్రచారమునకు రాజే తన సర్వబలములతో చేయూత నొసఁగెను. దేశమెల్ల బౌద్ధమతములుగ మారెను. సైనికులు బౌద్ధభిక్షువులైనచో జనులు, వారిని సేవింపవలెనని యాదేశములు సాగినవి. ఈ ప్రచారములు వాయవ్యదిశలో నెక్కువగ సాగెను. దీనితో సైనికులు వ్యూహరచనాచమత్కారములు మఱచి పోయిరి. వీరహుంకారముల నేమరిరి. అందుచే "డెమేట్రియస్" నడపిన గ్రీకు సైన్యములు హిందూకుశములను దాటి మగధదేశమువైపు నడచెను.

సామ్రాజ్యాధికారము లన్నియు - బౌద్ధులచేతియందే యుండినవి. ప్రాంతీయ సామంతులు వారు, న్యాయాధిపులు వారు, కోశాధిపులు వారు. కాని - వీరిలో నెవ్వరును శత్రువులైన యవనుల నెదిరింప ముందుబడకుండిరి. భారత రాష్ట్రీయ భావమునకుఁ గలిగిన యవమానమునకై వారి కొక నిట్టూర్పును రాలేదు. నాటి మౌర్యరాజు బృహద్రథుఁడు. అతఁడు బౌద్ధుఁడు. అతఁడుగాని తన యింటికిఁ జిచ్చువెట్టఁ బూనుకొన్న గ్రీకుల నదలింపఁ దలఁపలేదు.

'ధమ్మపదము'లోఁ జెప్పిన ట్లక్రోధముతో క్రోధమును జయింపవలెనన్న సూక్తిని మనన మొనర్చికొనుచు గ్రీకులను దన మనస్సునందే జయించికొనుచు బృహద్రథుఁడు పగటికలలు గనుచుండెనేమో ?

## వైదికులలోఁ గలిగిన రాష్ట్రీయ ప్రక్షోభము; కళింగరాజు కారవేలుఁడు గ్రీకులపై నడచెను.

గ్రీకుల దాడితో బౌద్ధుల మనస్సులలో నేమియు గలవరము గలుగలేదని జెప్పితిమి. కాని - వైదికధర్మానుయాయులుమాత్రము హృదయములలో నమితముగ బాధపడిరి. మఱి దీనికిఁ బ్రతీకార మొనర్చు టెట్లు ? వైదిక ధర్మము నుద్ధరించుటకుఁ బూనుకొన్న రాజ్య మేదియు నుత్తర భారతమున వారికిఁ గానరాలేదు. కాని - దక్షిణదేశమునఁ గళింగులును - ఆంధ్రులును విజృంభించిరి. ఈ రెండు దేశములును అశోకుఁడు మరణించిన వెనుక స్వతంత్రములై మౌర్య సామ్రాజ్యముయొక్క యధికారమును మన్నింపవయ్యెను.

కళింగులును, ఆంధ్రులును వైదికాభిమానులే! అందువల్లనే భారతరాష్ట్రాభిమానులు. ఈ రాజు లిర్వురును పరాక్రమవంతులు. గ్రీకురాజు మగధపై కెత్తివచ్చుచున్నాఁడనియు-బృహద్రథుఁడు వారి కేమియుఁ బ్రతీకార మొనర్పఁ దలఁపలేదనియు వారి చెవిసోకినది. ఈ సంగతి విని దక్షిణదేశమందలి వైదికధర్మానుయాయులైన ప్రజలలోఁగూడ మహాసంక్షోభము చెలరేగెను. అపుడు కళింగరాజైన 'కారవేలుఁడు' సైన్యములను గూర్చికొని గ్రీకురాజుపై నడువ నిశ్చయించికొనెను.

## యవనుల భయము

కారవేలుఁడు పెద్ద సైన్యములతో మొదలు మగధను జయించెను. జయించి - యయోధ్య సమీపమున యవనుల నెదిరించెను. భయంకరమైన యుద్ధము జరగెను. గ్రీకులకు జరగిన నష్టములకు లెక్కలేదు. "డెమేట్రియస్"అనుత్సాహదగ్ధుఁడై సైన్యముల మఱలించికొని పంచనదములవైపు బరువిడినాఁడు.

## రాజసూయ యజ్ఞము

యవనులను భారతీయులు భారత దేశపు సీమలఁ దాటఁ దరిమిరి. కారవేలుఁడు జయించిన ప్రదేశములలో సువ్యవస్థను నెలకొల్పుట కాతని కవధి జిక్కలేదు. వెంటనే యాతఁడు కళింగమునకు మఱలవలసివచ్చెను. దానికిఁ గారణము కళింగమున రేగిన రాజకీయములు. కారవేలుఁడు మగధరాజును పదచ్యుతు నొనర్పలేదు. భారత స్వాతంత్ర్యము, సన్మానముల యొక్క రక్షణకై గ్రీకులపై సాధించిన విజయమునకు

జ్ఞాపకముగ కారవేలుఁడు రాజసూయ యాగమును సేయ మొదలు పెట్టినాఁడు. ఈ రాజసూయము రాష్ట్రీయ భావము నకు ప్రతీకము. ఇంతవఱకును నశోకుఁడు సమస్త యజ్ఞ యాగములను బలాత్కారముగ నిషేధించెను. ఈ యేబది వర్షములొక్క యజ్ఞమును దేశమున జరుగలేదు. ఆంధ్ర కళింగములలో వైదిక రాజ్యములు నెలకొన్నవి. మఱల వైదిక ధర్మముల పునరుజ్జీవనము జఱిగినది. వైదిక ధర్మప్రతీకమైన రాజసూయ యాగము మహా వైభవముతో జరగెను.

## మఱల గ్రీకుల దాడి.

'కారవేలుఁడు దక్షిణమునకు వెళ్ళిన సమయమును గని పెట్టి- కాంభోజ, గాంధారములలో పీఠము వెట్టిన గ్రీకులు మరల విజృంభించినారు. నేఁడు వారి నాయకుఁడు 'మిన్యాండర్'. నాఁడుగూడ పంచనద ప్రాంతములలో గ్రీకుల నెవ్వరు నెదిరింపలేదు. వా రందరు బౌద్ధులుగదా! ప్రతీకార శూన్యులు. మగధరాజుగూడ గ్రీకుల నేమియు ననఁ దలఁపలేదు.

## భారతీయ బౌద్ధులకు భారత శత్రువులైన గ్రీకులపై సానుభూతి.

ప్రతీకారము చేయకపోవుటయేగాక – 'మిన్యాండరు' పై ననేక బౌద్ధులు సానుభూతినిఁగూడ జూపిరి. కారణ మేమనఁగా – 'బౌద్ధమతమునందలి చాలావిషయములు నాకు నచ్చినవి నేనును అనతికాలములోనే బౌద్ధమతమును స్వీకరించెద'నని మిన్యాండరు చెప్పుచుండెడివాఁడు. అందుచే

గ్రీకులు వైదికులపైననే గత్తిఁగట్టినారని బౌద్ధులు భావించిరి. భారతదేశము నాక్రమించిన తరువాత గ్రీకులందరు బౌద్ధులే యగుదురని వారు నమ్మిరి. అపుడు - స్వ, పర, రాష్ట్రభేద మేమున్నది? జాతి - రాష్ట్రము - వంశము వీనిపై బౌద్ధమునకుఁ గౌరవములేదు. కనుక గ్రీకులు బౌద్ధులకు సాయ మొనర్చుటకే వచ్చిరని బౌద్ధ భిక్షువులు జనులలోఁ బ్రచార మొనర్చిరి. వీరి యవివేకమును 'మిన్యాండరు' చక్కఁగా వాడుకొనెను. అతఁడు భారతముపైఁ దన దాడి బౌద్ధులను రక్షించుటకేయని ఘోషింపసాగెను. దుర్బలుఁడైన మగధ రాజును జయించి భారతీయ వైదికధర్మానుయాయులు మగధరాజ్యమును పాలించ ప్రయత్నించుచున్నారు. కాన వారలను నేను నాశనమొనర్చెదనని 'మిన్యాండరు' పలికిన పలుకులు. 'మిన్యాండరు' మరల పంచనదముల జయించి యయోధ్యవఱకు వచ్చెను. డెమేట్రియస్‌యొక్క జీవితంలో జరిగిన అనుభవములను బట్టి మరల అట్టి స్థితి తనకు పట్టకుండుటకు అతఁడొక పనితనము నెఱపినాఁడు తాను జయించిన ప్రదేశములలో నంతయుఁ గన్నుగలిగి చక్కని వ్యవస్థను నెలకొల్పుచు వచ్చెను. అప్పుడపు డాతఁడు క్రొత్త సైన్యములనుగూడ జేర్చుకొనుచు వచ్చెను. హఠాత్తుగ నొకనాఁడు పాటలీపుత్రముపైఁ బడుట కాతఁడు సమయము నకై వేచియుండెను.

## పాటలీపుత్రములో!

కళింగరాజైన 'కారవేలుఁడు' సంపాదించిన విజయముతో వైదికధర్మజ్యోతి యుత్తర భారతమున మరలఁ జిఱు

వెలుఁగుల నెరప నారంభించినది. ఇంతలో 'మినాండరు' మగధపై దండెత్తి వచ్చుచున్నాడన్నవార్త వ్యాపించెను. స్వదేశీయులైన బౌద్ధులు గ్రీకులతోఁ జేయిగలిపి - దేశమును నాశమొనర్పఁ జూచుచున్నారన్న సంగతియు వారి కవగతమైనది. గ్రీకు సామ్రాజ్యము భారతమున స్థాపింపఁబడినచో నిక - రాష్ట్రీయభావ పునరుద్ధరణము జరుగుట గలలోని వార్త. ఈ భావములు మనస్సులనుఁ గలఁచిన వేదమార్గానుయాయులు 'బృహద్రథుని' సింహాసనమునుండి తొలఁగించి. చంద్రగుప్తునివంటి సమర్థుఁడైన మరియొకని మగధ సామ్రాజ్యమున కభిషేకింపఁ జూచుచుండిరి. బ్రహ్మాండమైన రాజకీయ క్రాంతి రహస్యముగ నుత్తర భారతమున సాగుచుండెను. కాని- దీనికి - నాయకుఁడై నడపించువాఁ డెవ్వఁడు? బృహద్రథు నోడించి- సింహాసనముపై నధివసించుటకు శక్తిగల మగవాఁడు?

## పుష్యమిత్రుఁడు!

మగధరాజుకడ నొక యల్పసైన్య ముండెను. అది పేరునకు మాత్రమే. దానియందుఁ బుష్యమిత్రుఁ డొక సైనికోద్యోగి. ఇతఁడు బ్రాహ్మణుఁడు. వైదికధర్మాభిమాని. దేశస్వాతంత్ర్యమును నిలుపవలెనను నాకాంక్ష గలవాఁడు. నిష్ఠగల శివభక్తుఁడు. ఈతనిది శుంగకులము. ఈతని శౌర్యాది గుణములు బృహద్రథునకుఁ బ్రీతి గలిగించినవేమో! అందుచే- నతఁ డీతనిని సేనాపతి నొనర్చి గ్రీకులతోఁ బోరఁ బంపెను. సేనాపతియైన వెంటనే పుష్యమిత్రుఁడు తీవ్రముగ సైనిక సన్నాహముల నొనర్చినాఁడు. రాజ్యమునందలి వైది

కుల కన్నులన్నియు నాతనిపైఁ బడినవి. ఇతఁడే దమ్రకాంతి నాయకుఁడని వా రెన్నికొనిరి ఇతనికన్నను - మగధసింహాసనము నెక్కుటకు యోగ్యుఁడు వారికిఁ దోపలేదు.

ఒక్కొక్కప్పు డితిహాసమునందు "ఫలానుమేయాః ప్రారంభాః, సంస్కారాః ప్రాక్తనా ఇవ" అన్నట్లు జరగును.

అనేక సంఘటనలు దేశచరిత్రలోమాత్రము పైని కాళిదాసుమహాకవి యన్నట్లే జరగును. సాధారణముగ రాజ్య విప్లవములు రహస్యాత్మకములు. మగధలోని రాజ్యక్రాంతిని గుఱించి కొంత సంక్షేపముగ నింతకుముందే దెలిపితిని. పైని వర్ణించిన విషయమునుబట్టి పుష్యమిత్రుఁడే యాక్రాంతికి నాయకుఁడుగనుండి రహస్యముగ దానిని నడపించుచుండెనని మీ రూహించియుందు రనుకొందును. రాజసైన్యములలోని యితర నాయకులు, ప్రజలలోని ప్రముఖులు యీతని నేతృత్వమున కంగీకరించి సహాయమొనర్చుచుండిరి.

## బృహద్రథ మౌర్యుని శిరచ్ఛేదము

పూర్వరంగమంతయు సిద్ధమైనది. ఒకా నొకనాఁడు పాటలీపుత్రమున అంతఃపుర పరిసరములలో సైన్యముల యొక్క సంచాలన క్రమములు జరగుచుండెను. ఇవి వేడుకకుగాఁ నేర్పాటుఁ జేయఁబడినవి. ఈ సైనికుల విన్యాసములు జూచుటకై స్వయముగ బృహద్రథుఁ డచటికి వచ్చెను. సేనాపతియైన పుష్యమిత్రుని యానతో సైనికులు బహువిధచాతుర్యములు నెఱపుచుండిరి. ఇంతలో బృహద్రథుఁడుగూర్చున్నవైపు

సైనికులలో నొక కలకలము రేగినది. దీనికిఁ గారణమేమో చరిత్రలో దొరకుటలేదు. ఆ కలకలములోనే సేనాపతియైన బుష్యమిత్రుఁడు సమ్రాట్టు బృహద్రథుని తల నఱకెను ఈ శిరచ్ఛేదముతో మౌర్య చక్రవర్తుల పాలన మంతరించినది. బౌద్ధుల రాజ్యము గడచిపోయెను.

అకస్మాత్తుగ జరగిన యీ సంఘటనముతోఁ బ్రజలలో కొంత కలవరము బయలుదేరెనేకాని అక్కడ మౌర్య రాజునకుఁ జెందినవా రెందరో యుండినను వారిలో నొక్కరునుఁ బుష్యమిత్రునిపై ప్రతీకారేచ్ఛతో విఱచుకొని పడలేదు. మఱి యీ సైనికులందఱుఁ బుష్యమిత్రునకు జయకారములు వేసిరి. దీనికిఁ గారణము?

సైనికులలో ననేకులకు మౌర్యునిపై నసమ్మతి యుండెను. కాని - యెవ్వరును నేమియుఁ జేయలేకుండిరి. బృహద్రథుని సంహరించుట యను మహాకార్యమును సాధించుటకు బుష్యమిత్రుఁడు సిద్ధపడెను. అంద రాతని శౌర్యమును బ్రశంసించిరి. మగధ దేశమును, భారత రాష్ట్రీయ భావమును సంరక్షించుటకు వారికి మౌర్యుని వధ దప్పనిదయ్యెను. ఈ మహాప్రయత్నమును సాధించుటకుఁ బుష్యమిత్రుఁడు సిద్ధపడెను.

భారతీయ స్వాతంత్ర్యరక్షణకొఱకై చంద్రగుప్తుఁడు
జేసిన పనినే నేఁడు బుష్యమిత్రుఁ డొనర్చెను.

సికందరు మొదట భారత దేశముపై దండెత్తి వచ్చినపుడు మగధరాజు మహాపద్మనందుఁడు గదా! అతఁ

డసమర్థుఁడు. అందుచే గ్రీకులకుఁ బ్రతీకారమొనర్చుటకై మహా పద్మనందుని వధింపవలసినదని చాణక్యుఁడు చంద్రగుప్తుని బ్రేరేచెను. అతఁడాపనినొనర్చి గ్రీకులఁ బారద్రోలినాఁడు. అట్లే నేఁడును నసమర్థుఁడైన బృహద్రథమౌర్యునిఁ బరిమార్చి - పుష్యమిత్రుఁడు దేశమును రక్షింపఁ బూనుకొనెను.

## శుంగవంశజుఁడు పుష్యమిత్రుఁడు

ఈ ఘటన దాదాపు క్రీ॥ పూ॥ 184 వ సంవత్సర ప్రాంతములందు జరగెను. వైదిక విధుల ననుసరించి పుష్య మిత్రుఁ డభిషిక్తుఁడై పాటలీపుత్రమున నశోకుని సింహాస నముపైఁ గూర్చున్నాఁడు. మౌర్యవంశ మంతమై శుంగ వంశముయొక్క పాలన యారంభమైనది.

## గ్రీకులపై 'బుష్యమిత్రుని' దాడి.

సింహాసన మెక్కిన దేతడవు పుష్యమిత్రుఁడు రాజ్య మును గట్టుదిట్ట మొనర్చెను. కోట క్రొత్తడములు జక్క బరచెను. బలవంతములైన చతురంగములను సమీకరించెను. రాష్ట్రీయభావమును బ్రజలతో రేకెత్తించెను. అయోధ్య వైపు నడచి - 'మిన్యాండరు' నెదుర్కొనెను. భారతీయుల ధాటికి గ్రీకులు నిలువలేకపోయిరి. 'మిన్యాండరు' పంచనదము వైపు బరువిడెను. ఇంతకుముందును "డెమేట్రియస్" యోడి పోయినవాఁడే! కాని యాతఁడు వెనుదిరిగిన దేతడవు కొర వేలుఁ డాతని వెంబడింపక బారిపోనిచ్చెను. పుష్యమిత్రుఁ డట్లు సేయలేదు. పరువెత్తు గ్రీకులను వెంటఁదరిమెను. అపు డపుడు వారు వెనుదిరుగుచుండిరి. తిరిగిన దేతడవు పుష్య

మిత్రుఁడు భయంకరముగఁ బోరాడుచుండెను. అట్లు జరగిన ప్రతియుద్ధమునను గ్రీకుల కోటమి తప్పలేదు. వారి వ్యూహములు నిలువలేదు. పుష్యమిత్రుఁడు 'మినాండరు' సింధు నదిని దాటిపోవువఱకును – దరిమినాఁడు. సింధునదీపర్యంత భూములన్నియు స్వతంత్రములైనవి.

గ్రీకులు అవమానముతోఁ దలలు వంచికొనిరి – వారికత్తు లట్టువ నెక్కెను.

భారతదేశముపై గ్రీకులొనర్చిన కడపటి దాడి యిదే! సమ్రాట్టు బుష్యమిత్రుఁ డొనర్చిన పరాభవము వారి శత్రుజీవితమునే నాశనమొనర్చినది. వారు మరల నెన్నడు సింధు నదిని దాటి భారతదేశముపై వచ్చుటకు సాహసింపలేదు. 'సికందరు' దగ్గరనుంచి మాటిమాటికిని భారతదేశమున కుపద్రవము గూర్చుచుండెడు యవనులు యీ పరాభవముతో సంపూర్ణముగఁ దేజోహీనులైపోయిరి.

గ్రీకుల పాలనమునుండి విడివడిన దేశములను బుష్యమిత్రుఁడు దనసామ్రాజ్యమున గలిపికొన్నాఁడు. ఉజ్జయినికి దక్షిణముననున్న రాజ్యమంతయు దన పుత్రుఁడును సేనాపతియు నైన యగ్నిమిత్రున కొప్పింపఁ బడినది అతఁడును దండ్రివలెనే మహాశూరుఁడు. అగ్నిమిత్రుఁడు దక్షిణమందున్న విదర్భదేశమువరకునుగల సామ్రాజ్యమున కధిపతియయ్యెను. మొదట విదర్భ రా జీతని యధికారమును మన్నింపఁడయ్యెను. అగ్నిమిత్రుఁ డాతనిపై దండెత్తెను. విదర్భాధిపతి యోడిపోయినాఁడు. విదర్భ రాజున కొక కుమార్తె యుండెను. ఆమె

పేరు మాళవిక. మాళవిక యగ్నిమిత్రుని పరాక్రమాదులను విని యాతనిని మనస్సునఁ బ్రేమించెను. విదర్భరాజున కీ వార్త దెలిసినది. అతఁడు బుష్యమిత్రునకు సందేశమంపి యాతని సమ్మతితో నగ్నిమిత్రునకుఁ దన కుమార్తె నొసఁగెను. ఈ బాంధవ్యముతో నా రెండు వంశములలో రక్త సంబంధ మేర్పడినది ఈ రమణీయ కథావస్తువే కాళిదాసు రచించిన "మాళవికాగ్నిమిత్ర నాటకము."

## అశోకుని పాటలీపుత్రమందే యశ్వమేధయాగము

గ్రీకులను సంపూర్ణముగ బుష్యమిత్రుఁ డోడించినాఁడు గదా! ఈ శత్రుపరాభవమునకుఁ జిహ్నముగ నాతఁడు వైదికమతానుసారము అశ్వమేధయాగమును గావింపఁ బూనుకొన్నాఁడు. ఈ పుష్యమిత్రుని విషయమై "విన్ సెంట్ స్మిత్" తనచరిత్రలో గౌరవపూర్వకముగ నిట్లు వ్రాసెను :

"The Yavanas and all other rivals having been disposed of in due course Pushyamitra was justified in his claim to reign as the Paramount power of North India and straight way proceeded to announce his success by a magnificient celebration of the Ashwamedha sacrifice at his capital. (P. 189)

పుష్యమిత్రుఁ డశ్వమేధయాగము చేయబోవునన్న వార్త దేశమున వ్యాపించినది. బౌద్ధులుదప్ప నందరును-హర్షించిరి. వైదికధర్మములను - ఆచారములను రాజశక్తిచే నణచిన - యశోకుఁడు వసించిన పాటలీపుత్రమందే వైది

కాభిమానియైన పుష్యమిత్రుఁడు మహావైభవముతో నశ్వమేధమును గావింపఁబూనుకొనెను. అశోకుఁడు వైదికధర్మముపై వేసిన యాంక్షలన్నియు పుష్యమిత్రుఁడు తొలఁగించినాఁడు. అశ్వమేధము భారత రాష్ట్రీయభావమునకుఁ బ్రతిబింబము.

యువరాజు అగ్నిమిత్రుఁడు "అగ్నివంటివాఁడ"ని ముందే చెప్పితిమి. ఆతని సుతుఁడు వసుమిత్రుఁడు. ఇతఁడును తండ్రి తాతలవంటివాఁడే! పుష్యమిత్రుఁ డశ్వమేధమునొనర్చినప్పుడు హయమును రక్షించుకొనుచు వెంటనడచుబాధ్యత మనుమఁడైన 'వసుమిత్రుని' పైఁ బడినది. అశ్వమేధాశ్వము దేశమున సంచరింప మొదలిడెను. సింధునదీ ప్రాంతములందున్న యొక యవనరాజు దాని నడ్డగించెను. ఇరువురకును యుద్ధముజరగినది. యవనరా జోడినాఁడు. విజయాశ్వము వెనుకకు మఱలెను. ఇట్లొక సంవత్సర మాహయము దిరిగినది. సేనాని వసుమిత్రుఁడు దానిని రక్షించుచు వెంటనే యుండెను. ఆ హయము మరల పాటలీపుత్రమునకు వచ్చెను. మనుమని పరాక్రమమునకుఁ బుష్యమిత్రునకుఁ గలిగిన సంతోషమునకు మితి లేదు. తన సంతోషమును వెలిబుచ్చుచు బుష్యమిత్రుఁడు "అశ్వమేధమునకు రావలసినద"ని యగ్నిమిత్రున కొక దీర్ఘమైన లేఖ వ్రాసినాఁడు. ఆ లేఖ లుప్తముగాక నేటికిని దొఱకుట మన భాగ్యము. కారణ మేమన- కాళిదాసు "మాళవికాగ్నిమిత్ర" మందా లేఖలోని యనేక విషయముల నట్లట్లే వ్రాసినాఁడు ఆ జాబు నిజముగఁ బ్రతియొకరును జదువఁదగినది. వైదికధర్మోద్ధరణమునకై యా రా జెంత మథనపడెనో స్పష్టముగ నా

కమ్మ దెలుపును. సామాన్య ప్రజల భావములను దెలుపుటకుఁ గూడ నా లేఖ బనికివచ్చును.

## రాష్ట్రీయ విజయోత్సవములు.

భారత దేశమందున్న తపస్వులు-వేదవిద్యావిదులు - క్షత్రియ కులోత్తంసులు - ప్రముఖులైన వైశ్యులు - అందరును యశ్వమేధమునకై పాటలీపుత్రమునఁ జేరిరి. పుష్యమిత్రుని కాలమున నుండిన.మహాపండితుఁడు బతంజలి. ఇతఁడే మహాభాష్యమును వ్రాసినది. ఇతని నాదిశేషుని యవతారమని జనులు విశ్వసింతురు. పతంజలి ప్రతిభా సంపత్తికి లోకములే యాశ్చర్యపడినవి. ఆతని సమక్షమున యవన పరాభవ పరిముక్తమైన భారతదేశమున బుష్యమిత్రుఁ డొనర్చిన యశ్వమేధము పురాణకాలవైభవమును దలఁపించెను.

## ఆసియా - గ్రీకు వంశ వృత్తాంతము.

పుష్యమిత్రుఁడు దాదాపు క్రీ॥ పూ॥ 190 - నుండి 180 వ. సం॥ మధ్యకాలమున గ్రీకులను సింధునదిని దాటి పోఁదరిమెను. భారతము స్వతంత్ర మయ్యెను. నాటనుండి యా గ్రీకుల పతన మారంభమైనది. సింధునది కావైపు గాంధారమునను - బ్యాక్ట్రియా యందును - (బాహ్లీకదేశము) చిన్నచిన్న రాజ్యములు దలచూప మొదలువెట్టెను. ఇంతలో క్రీ॥ శ॥ ప్రథమ శతకములో - మధ్య యేషియాలో - శక జాతి పురుషులు విజృంభించిరి. వారు బాహ్లీకము - ఇరాను-గాంధారము - మొదలగు దేశములపైకి నడచి యక్కడనున్న గ్రీకులను - స్వాధీన మొనర్చికొన్నారు. వారి ధాటి

కాగి యా గ్రీకులు నిలువలేకపోయిరి. స్త్రీలు - పురుషులు - శిశువులు- దారిలో నష్టకష్టములు బడుచు, సింధునదిని దాటి- భారతదేశమునకు వలసవచ్చినారు. వీ రీ దేశమునకు వచ్చిన శరణార్థులు. క్రీ॥ పూ॥ 329-327 సంవత్సరములలో గర్జించుచు "యుద్ధం దేహి" యని భారత దేశముపై విఱచికొని బడిరి. సికందరు, సెల్యూకస్సులు విజయార్థులై యోడిపోయిరి. భారతీయ పరాక్రమము నెదుటఁ - గడకు వారి వైభవమే దగ్ధమై పోయినది. రాగ రాగ నాగ్రీకులే హతవీర్యులై క్రీ॥ శ॥ ప్రారంభమున భారతదేశమునకు "భిక్షాం దేహి" యని వచ్చిరి.

కాని యట్టి దుర్దశలయందు పూర్వవైరమును స్మరింపక భారత దేశము వారి కాశ్రయమిచ్చెను. భారతీయుల యాదర మట్టిది! గ్రీకులు మన నగరములలో నివసింప మొదలు పెట్టిరి. వారిలో గొందరుఁ బౌద్ధులైరి. కొందఱు వైదికులైరి. ఆనాఁడు భారతదేశమున వ్యాపించినవి వైదికములైన రాజ్యములే! అగుటచే - గ్రీకులు బౌద్ధులుగ మారినను - వైదికులుగ మారినను- వారు భారత రాజకీయముల నేమియు మార్చలేక పోయినారు. వీరికి శక్తి మట్టమైనది. కాలక్రమమున వారు గ్రీకు భాషనుగూడ విస్మరించిరి. భారతీయ భాషలను నేర్చి - వారి యాచారములలో మిళితమై - యా సమాజమున లీనమైపోయిరి. వారిలోఁ "దాము గ్రీకుల మన్న" భావమే యంతరించి పోయెను. భారతీయులలో వారు బరస్పర వివాహము లొనర్చికొనిరి. 'ఇట్లొక శతాబ్దములో వారు భారతీయులే యైనారు - భారతదేశమును గ్రీకు దేశముగఁ

మార్పుదలంచిన జాతి - దమ స్వస్వరూపమును గోల్పోయి - పాలలో నీటివలె భారతీయులలో నైక్యమై పోయెను.

ఈ సందర్భమున ననేక చారిత్రకు లొక ముఖ్యమైన విషయముపై దృష్టి నుంచలేదు. అందుచే దాని నిచట నవశ్యముఁ జెప్పవలసియున్నది. భారతదేశముపైకి విజయార్థులై యవనులు దొలుత నెత్తివచ్చిరి. వారి యనంతరము మ్లేచ్ఛులు మొదలైనవారు దండెత్తి వచ్చిరి. శతాబ్దముల తరఁబడి వారితో భారతీయులకుఁ బోరులు జరగెను. కత్తి గట్టివచ్చినవారు- ప్రథమమున భారతీయులను జయించినను- మరల వారిచే నోడింపఁబడిరి. ఆ శత్రువులుఁ దమ శస్త్రముల విడచి భారత సమాజ, సంస్కృతులలో లీనమైపోయిరి. తమ స్వరూపమునే గోల్పోయిరి పచన మొనర్ప నేతెంచినవారు- దామే పాక మొనరింపఁబడినవారైరి. చరిత్రచే స్పష్టమగు విషయమింతే! శత్రువు లట్లు మారుటయు శస్త్రబలముచేత నే- శాంతిపాఠముచే గాదు.

ధర్మచ్ఛలము గాదు. రాష్ట్రద్రోహ పాపమునకు ప్రతీకారము

"పుష్యమిత్రుఁడు బౌద్ధుల నెంతయో బీడించెను. వారి చిత్తశాంతిని దోచెను. మఠములను ధ్వంసపరచెను" అని పౌరాణికములైన యుత్ప్రేక్షలతో- యాతని చేతలను బౌద్ధగ్రంథములు వర్ణించినవి. పాశ్చాత్య చారిత్రకులుఁగూడ బౌద్ధుల వ్రాతలు నమ్మలేదు. ఇవి యతిశయోక్తులని- ప్రక్కకు నెట్టివేసిరి. కాని కొందరు వీనికిఁగూడ వెలలను గట్టికొన్నారు. కట్టికొని ధర్మమనెడు కైతవముతో పుష్యమిత్రుఁడు బౌద్ధ

లను బీడింప మొదలుపెట్టెనని - వాదించిరి. పుష్యమిత్రుఁడు బౌద్ధులను బీడించినది నిజము - మేమును అంగీకరింతుము. కాని యా పీడించుట కేవలము.

బౌద్ధులు - శూన్యవాదులు- యజ్ఞేయవాదులు - నాస్తికులు - యహింసకులు- వేదనిందకులు- అని సాముదాయికము లైన పీడనములు జరుగలేదు. బుద్ధుఁడు బ్రతికియున్నప్పుడే- మతప్రచారమునకై యాతని నెవ్వరడ్డగించినది లేదు "ఆ సిద్ధాంతముఁగూడ నొకటి యుండనీ లెమ్మని" యా భారతీయులు దృష్టిఁబడిరి. చంద్రగుప్త చాణక్యుల కాలమున వైదిక ధర్మనిష్ఠ యెంత తీవ్రముగ నుండెనో వర్ణించితిమి. వీరికాలమునకు 300 వర్షములకు ముందే! బౌద్ధమతముండెను. దానిజోలి కెవ్వరును బోయినవారు గారు. చంద్రగుప్తుని సభలో మెగస్తసి సుండెనుగదా! అతఁడు బౌద్ధమునుగుఱించి మంచిగాని - చెడ్డగాని జెప్పలేదు. దీనికిఁ గారణము? సికందరు సెల్యూకసుల కాలమునకు బౌద్ధులు- రాజకీయములలోఁ బ్రవేశింపలేదు. దేశమునకు హానిఁ గలిగించు కార్యములలో బ్రవృత్తులు గాలేదు. వారికప్పుఁడా శక్తి లేకుండెను. చంద్రగుప్త చాణుక్యుల కాలమున వారి నెవ్వరడ్డగింపలేదు. ఇతరులవలెనే వీరును- దమ తమ మత విధుల ననుసరింపుచు శాంతముగఁ బ్రతుకుచుండిరి. ఇంతేగాదు - వారి మతప్రచారమునకు- రాజు లడ్డుపడలేదు.

కాలము గడచెను! 'డెమేత్రియస్, మినాండరులు' భారతముపై దండెత్తి వచ్చిరి. వీరు మన దేశ శత్రువులు. అయోధ్యవరకు వారు నిరాటంకముగ సైన్యములతో

వచ్చినారు. మగధరాజును దొలగించి యా సింహాసనమున గ్రీకురాజును గూర్చుండబెట్టుటకై - ప్రయత్నములు జరగెను. అపుడు బౌద్ధులు రాజకీయములలోఁ బ్రవేశించిరి. దేశద్రోహకరములైన పనులు సాగెను. బౌద్ధులు మినాండరును 'మిళిందుఁడని' పిలచిరి. వాఁడు బౌద్ధమును స్వీకరించెను. వెంటనే బౌద్ధులు 'అతఁడే తమ రాజు' అనినమ్మిరి. కొందరు రాజులాతని యాజ్ఞను మన్నించిరిగూడ. మిళిందుని యాస్థానమందు గొప్ప బౌద్ధపండితులు గూడ యుండిరి. వారు స్వరాష్ట్రీయ రాజ్యసభయందువలె ఆతని సభయందుఁగూడ సంతోషమనుభవించిరి. ఇవన్నియు దేశద్రోహకరములైన పనులు. ప్రతి మతమునందును - రాష్ట్రీయభావమునకు- విరుద్ధములైన ప్రచారములు సాగినవి. గ్రీకులతో పుష్యమిత్రుఁడు పోరుచున్న రోజులవి. ఆ పరిస్థితులలో నిట్టి ప్రచారములు ప్రమాదకరములుగదా! అందుకై 'పుష్యమిత్రుఁడు' దేశద్రోహులను దండించెను. అట్టి ప్రచారము లొనర్చు మతములను - మంట గలిపెను. తన సామ్రాజ్యసంరక్షణార్థమై స్వదేశద్రోహమొనరించుచున్న గుప్తశత్రువులకు న్యాయమైన శిక్షయొసఁగుటలో ధర్మద్రోహమేమున్నది? రాజ్యమునకు బాధగలిగినప్పుడు - ఆ పని గావించినవారు - వైదికుఁడైనను, బౌద్ధుఁడైనను- వానిని రాజు తప్పక దండింపవలసినదే! ఆ కర్తవ్యమునే పుష్యమిత్రుఁడు నెరవేర్చెను. అట్లు సేయుటాతని ధర్మము- వంచన గాదు.

ధర్మ సహిష్ణు వెవ్వఁడు? అశోకుఁడా? పుష్యమిత్రుఁడా?

పరధర్మమును సహించిన యుదారులలో - అశోకుఁడు అగ్రేసరుఁడనుట పరిపాటియైపోయినది. అంతేగాని 'పుష్యమిత్రునిఁ' దడవిన చారిత్రకుఁడే లేఁడు. పాశ్చాత్య చరిత్రకారులు పుష్యమిత్రుని యుదారతను గమనింపలేదు. పైగా బౌద్ధులను పీడించినవాఁడని యాతనిరూపమును జిత్రించిరి. అతఁడు ధర్మవంచకుఁడనియు నొక యారోపణము ఇక మన చారిత్రకులు వారికిఁ బలుకు బండలు. యథాప్రకారము భారతదేశ చరిత్రకారులు వ్రాసిన గ్రంథములలోఁగూడ పుష్యమిత్రున కీ యపకీర్తియే దక్కినది. సత్యముగా జూచినచో నశోకునికంటెను - పరధర్మముల నెక్కువ సహించినవాడు 'పుష్యమిత్రుఁడే!' అశోకుఁడు బౌద్ధమును ప్రబలముగ బ్రచారమొనర్చెను. ఆ ప్రభావమునకు రాజదండన మూతగాఁగొనెను. నాఁడు భారతదేశమున నెక్కువమంది వైదికులే! వారి ధర్మములు- యాగములు,మృగయ మొదలైనవి. ఇవన్నియుఁ దోషములని యశోకుఁడు బ్రకటించెను. శాసనము లొనర్చెను. మఱి పుష్యమిత్రుఁడు బౌద్ధుల ప్రతిమతమునందును వైదికపద్ధతిలో యజ్ఞయాగములొనర్పఁబడవలెనని-శాసనము లొనర్పలేదే! ప్రతి బౌద్ధ గృహస్థుఁడును - వైశ్వదేవము జేయువలెనని నిర్బంధింపలేదు. బౌద్ధులను స్వేచ్ఛగ తమ ధర్మముల ననుసరించికొననిచ్చెను. వారి ప్రచారము నడ్డగింపలేదు. కాని యుద్ధకాలమునందు వారు - దేశద్రోహమునకుఁ బూనుకొన్నారు. మరి యప్పుడు వారిని దండించుట కేవల నియమమేగాదు; యవశ్యకర్తవ్యముఁగూడ.

పుష్యమిత్రుఁడు జేసిన యొక్కటే గొప్పపనియున్నది. అశోకుఁడు వైదికులపై వారికనిష్టములైన శాసనముల నుద్దెను. పుష్యమిత్రుఁడు వానినిఁ దొలఁగించినాఁడు. మరి వీ రిర్వు రిలోఁ బరధర్మసహిష్ణు వెవ్వరు ?

ఈ ప్రకరణమున 'విన్‌సెంట్ స్మిత్' వ్రాసిన వాక్యములను చదివితీరవలెను. ఆతనికి బౌద్ధవైదికులలో నెవరిపైనను పక్షపాతములేదుగదా! 'విన్‌సెంట్ స్మిత్' గూడ నొకముఖ్య విషయమును మరచినాఁడు. బౌద్ధులకును వైదికులకును జరగినవి మతకలహములే యని యాతఁడు నందరివలెనె నమ్మెను. కాని బౌద్ధులకుఁ గలిగిన యిక్కట్టులకుఁ గారణము, వైదికుల మత ద్వేషముగాదు. వీరికి బౌద్ధులొనర్చిన రాజద్రోహమే! విన్‌సెంట్ స్మిత్ బౌద్ధ వైదికుల కలహములను-మత కలహములన్నాఁడు గదా! కాని యితఁ డెట్లు నమ్మినను - బరమతమును ద్వేషించుటలో నొక యడుగు ముందుకు నడచినవారు వైదికుల కన్నను బౌద్ధులే యని - యాతని వ్రాతలను బట్టియే దెలియును. 'విన్‌సెంట్ స్మిత్' చెప్పిన వాక్యములలో గొన్ని యీ క్రిందివి :

"The memorable Horse sacrifice of Pushyamitra marked the begining of Brahmanical (Vaidik) re-action which was fully developed by centuries later in the time of Samudragupta and his successors ..............Its credit may be given to semi - mythological stories of Buddist writers. Pushyamitra was not content with the peaceful revivals of hindu rites, but indulged in a savage persecution of Buddism ... It will be rash, to reject this tale as wholly

baseless, although it my be exaggerated ......... That such outbursts after all should have occurred is not wonderful if you consider the extreme oppressiveness of the Jain and Buddist prohibition when ruthlessly enforced, as they certainly were by some Rajas and probably by Ashok. The wonder rather is that persecutions were so rare. And that as a rule the various sects managed to live together in harmony and in the enjoyment of fairly impartial official favour" (Early History of India : Page 190–191)

సికందరు కాలము మొదలుకొని - యడుగడుగునను భారత దేశమునకు గ్రీకు లుపద్రవమును గల్పించిరి. క్రమ క్రమముగ వారి రాజశక్తి - శస్త్రశక్తి క్షీణించినది. కడకు వారిని మూలోచ్ఛేదన మొనర్చు నదృష్టము బుష్యమిత్రునకు లభించినది. ఈ మహాకార్య నిర్వాహణకే యాతఁడు మగధ రాజును జంపెను. కనుక యవనాంతకుఁడన్న బిరుదము - పుష్యమిత్రునకు జక్కఁగా శోభించును. ఆతఁడు బ్రహ్మాండమైన సామ్రాజ్యమును జయించెను. దానిని సుస్థిత మొనర్చెను భారతీయ స్వాతంత్ర్యమును రచించెను. అతఁడు రాజ్యమేలినది ముప్పదియారు సంవత్సరములు క్రీ॥ శ॥ సుమారు 149 వ సంవత్సరమున నా మహాసమ్రాట్టు దేహమును జాలించెను.

చంద్రగుప్తుఁడుఁ యవన విజేత. భారత చరిత్రలో నతని జీవితము- మొదటి సువర్ణ పత్రమైనది. పుష్యమిత్రుఁడు యవనాంతకుఁడు. భారత చరిత్రలో నతని జీవితము-ద్వితీయ స్వర్ణపత్రము.

నివసించుచుండిరి. వీ రొక రీతిగ నడవిజాతివారే! వీరి కింకను బైన కుషాణు లుండిరి. వీరుఁగూడ నన్నిరీతుల బైవారి వంటి వారే! వీరి దేశము నానుకొని హూణులుండిరి. వీరి నివాస స్థానములు కొన్ని చీనా దేశముయొక్క భాగముల లోనికిని జొచ్చుకొని యుండెను. ఈ మువ్వురును దేశద్రిమ్మరులు. ఇతరులెవరైనను, దొఱకినప్పుడు వారితో నన్యాలు లేకున్నఁ దమలోఁదాము కలహించి కొనుటయే వీరి వృత్తి. వీరు క్రూరులు- శూరులు. ఇట్టి జనులు లక్షల కుండిరి. ఈ మువ్వురిలోనున్న బరస్పర మనస్పర్థలు- దీవ్రములు. అందులకై- వారిలోవారు- నివాస స్థానములకై- నిరంతరము గలహించుట వాడుక.

క్రీ॥ శకమున కొకటిన్నర శతాబ్దమునకు ముందు వీరిలో భయంకర వైమనస్యము లేర్పడెను. అట్టి భయంకరమైన వైమనస్యము లంతకుముం దెన్నడు నేర్పడలేదు. వాని ఫలముగ చీనాదేశమువైపున్న హూణులు, కుషాణుల పై కెత్తి, వారిని బడమటికిఁ దరిమినారు. కుషాణులు, బాహ్లీకముపై నున్న శకులఁ దోలి యచట దమరాజ్య మేర్పరచిరి. బాహ్లీకము గ్రీసుదేశమునకుఁజెందినది. సికందరు శాహికాలము నుండియు - గ్రీకులు చిన్న పెద్ద రాజ్యములను స్థాపించిరని జెప్పితిమి. శకులు మహావీరులు. వారిలో స్త్రీలుఁగూడ గుఱ్ఱములెక్కి యుద్ధములుఁ జేసెడువారు. శకులు బలుమారు గ్రీకులపైఁ దండెత్తిరి. గ్రీకులు శకుల పరాక్రమమునకుఁ జలించిపోయిరి. వారి ప్రదేశములన్నియు- శకు లాక్రమించి కొన్నారు. ఇంతలో హూణులు - శకులపై నెత్తినారు. శకు

లను పారద్రోలి హూణులును - బాహ్లీకమున నెలకొనిరి. ఈ శకు లసంఖ్యాకులు. వారు దేశము నాక్రమించికొనుచు- 'బెలూచీస్థానము'న బ్రవేశించి 'బోలన ఖండి' మార్గమున ఒక సంవత్సరములోనే- భారతదేశములో-'సింధు' 'కథియవారు' 'గుజరాతు' మొదలైన చోటులందు నెలకొన్నారు. వీరికర్మలు మహాక్రూరములు. ఇండ్లనుదోచుట-స్త్రీ, శిశువులనుఁగూడ వధించుట-సాధ్యమైన స్త్రీలనెత్తికొనిపోవుట-వీరి వ్యాపారము. శకుల గుఱ్ఱపు దళములతో భారతదేశము జలింపసాగెను. ఆకాలమున భారతదేశమున నేవైన రాజ్యములుండెనో? లేదో? వారు శకుల నడ్డగించిరో? లేదో? చారిత్రకముగా వివరములుఁదెలియవు. క్రీస్తు శతాబ్దియొక్క ప్రారంభముననే శకులు భారతమునందలి 'బెలూచీస్థానము' 'సింధు' 'కథియవారు' 'గుజరాతు' 'అపరాంతకము' (కొంకణ) నందలి కొన్ని భాగములు - వీనియందు వ్యాపించి - యుజ్జయిని వరకు నెలకొనిరి. కుషాణులు హూణులయొక్క బాధను భరించలేక, భారతదేశము నంతయు వ్యాపించిన శకులు ఇంకెంత కాలముందురోయని - భారతీయులు మిక్కుటముగా బాధపడ జొచ్చిరి.

ఇతిహాసకాలమున సుమారు సహస్రవర్షములు- దక్షిణ భారతమున మ్లేచ్ఛుల యాక్రమణములేదు. అది స్వతంత్రమై సంపన్నమై యుండెను.

పరకీయులు వాయవ్య దిశనుండి- పలుమారు దండెత్తి వచ్చుచుండిరి. వారికిఁ బ్రతీకార మొనర్పవలసిన బాధ్యత యుత్తర భారతముపైననే యుండెను. అచటి శూరులు బలుమారీ ప్రయత్నము లొనర్చిరి. శత్రువులను వెన్కకు

నెట్టిరి. అందుకే - బరకీయశత్రువు లెవ్వరు గాని - వింధ్యమును దాటి- దక్షిణము రాలేకపోయిరి. ఒక్కసారి 'ఇరాను' దేశస్థులు - వీరి పైకి నడచిరి. ఆదాడి యతి ప్రాచీనము. దాని వేగమును క్షణభంగురమైనదే! క్రీస్తునకైదు నూరు సంవత్సరముల ముందునుండియు - వింధ్యమును దాటివచ్చిన శత్రువేలేడు. దక్షిణము నందలి- కళింగ, పాండ్య, చేర, చోళ రాజులు మహాప్రసిద్ధులు, పురాతనులు. వారు పూర్వ - పశ్చిమ - దక్షిణ సముద్రాధీశ్వరులై యెల్లలను సంరక్షించి కొనుచుండిరి. ఆ రాజులకు నావికాసైన్య ముండెను. అది ప్రబలముగఁగూడ నుండినది. అందుచే సముద్ర మార్గమున నైనను వారి నెవ్వ రెదిరింపలేకుండిరి. నావికు లింతమంది యుండుటచేతనే - వీరి వ్యాపారములు - 'సయాము', 'ఫిలిపైన్స్' మొదలగు ద్వీపములవఱకును సాగెను. ఆ ద్వీపవాసు లీ రాజుల యధికారమును మన్నించి వీరి సంస్కృతిని గ్రహించిరి.

వాయవ్య దిశనుండి యెత్తుకొని వచ్చిన- శత్రువులను- ఉత్తర భారత దేశము పలుమారు వెనక్కు నెట్టెనని చెప్పితిమి. అందుచే నాశత్రువులు నర్మదను సమీపింపనే లేక పోయిరి. కాని శకులు పలుమారు బెలూచీస్థానమందలి - 'బోలన ఖండి' మార్గమున నెత్తివచ్చుచుండుటచే యావఱకే, 'సింధు' 'కథియవారు' 'గుజరాతు' ప్రాంతములలో నెల కొన్న శకుల సహాయమున వారు దక్షిణమునకు వచ్చుటకుఁ సుకరమైనది. వారు రానే వచ్చిరి.

## ఆంధ్రుల హుంకారము.

ఆ కాలమునఁ దక్షిణదేశమున కళింగులు - ఆంధ్రులుఁ బ్రసిద్ధులుగ నుండిరి. ఈ రెండు రాజ్యములును వైదిక ధర్మ మూలమైన భారతీయత నాశ్రయించినవియే! సింధుదేశము నుండి యుజ్జయిని పర్యంతము - శకు లాత్తుకొని వచ్చుటయు - భారతమునం దెవ్వరును వారి నెదుర్ప లేకుండుటయు- నంపరకును మనోవేధగా నుండెను. ఆంధ్రులుఁగూడ సంతాపపడిరి. ఇంతలో శకులు నర్మదనుదాటి-యాంధ్రరాజ్యముయొక్క యెల్లలను బ్రవేశించినారు. ఇఁక వా రుపేక్షించిన లాభములేదు. ఆంధ్రులు ప్రబలసైన్యముతో వారి నెదిర్చిరి. సికందరు శాహి యెదిర్చినపు డుత్తరమున - యౌధేయురాజ్యములును, మాళవములును నెట్లు విజృంభించి వానిని వెన్కకుఁ దోలెనో ముందే వర్ణించినాము. అట్లే నేఁడును - దక్షిణమున నాంధ్రులును-నుత్తరమున నౌధేయు,మాళవములును-శత్రువులపై కెత్తెను. వారిప్రగతి కుంఠితమైనది. శకు లేక కేంద్రితమైన సామ్రాజ్యమును భారతమున స్థాపింపలేకపోయిరి. వారి రాజ్యము లక్కడక్కడ చిన్నచిన్నవి చెదురుగ నుండెను. అందుచే వారు భారతీయుల సామర్థ్యమును గ్రిందుపరుపలేకుండిరి.

## మాళవుల విజయము

ఉజ్జయినీ రాజ్యముల బ్రసరించిన శకరాజ్యములపై - యౌధేయ మాళవములు దండెత్తియుందురు. క్రీస్తునకుముందు దాదాపు - 57 వ వర్షమున 'ఉత్తమ భద్ర'మను శకులకోటపై మాళవులెత్తినగాథ - కొన్ని గ్రంథములలో గలదు. నాటి

శకరాజు, నహాపాణుడు. నహాపాణుని సైన్యమును - మాళవకులు నాల్గువైపులఁ జుట్టిరి. తుముల యుద్ధము జరగినది. శకులు పూర్ణముగ నోడిరి. నహాపాణుఁడు యుద్ధమున వధింపబడెను.

## మాళవ సంవత్సరము

శకుల హృదయములపై నీ పరాజయము - తీవ్రముగఁ బనిచేసెను. సుసంఘటితమైన భారతసైన్యము నెదుర్చుటకు వారికిఁ గుండెలు లేకపోయెను. మాళవదేశము సాధించిన యీ విజయము భారతదేశమంతయుఁ బ్రసిద్ధమైనది. వారీ విజయజ్ఞాపకార్థముగ నొక శకమునే నెలకొల్పిరి. విజయమును సాధించిన యావర్షమునకు 'కృత' మని పేరుపెట్టిరి. ఆ జయమునకుఁ జ్ఞాపకముగ నాణెముల నచ్చొత్తిరి. వానిపై బ్రాహ్మీ లిపిలో - 'మాళవ జయః' - 'మాళవానాం జయః' 'మాళవ గణస్య' ఇట్టి వ్రాతలు గనపడును.

## ఇదియే నేటి మన విక్రమ సంవత్సరము.

ప్రసిద్ధులైన రాజులానాఁడు దమ తమ రాష్ట్రములలో - దమ నామములతో శకముల నేర్పరచుచుండిరి. దిగ్విజయ మొనర్చిన రాజు - లేక గణము, శకకర్తలమని యనుకొనుట - వారి నట్లే యితరులు గౌరవించుట నాటి యాచారము. శివాజీపేరిట 'శివ శక' మొకటి చెలామణిలో నుండెను కాని యీ శకములన్నియు వారివంశమంతర్ధానము జెందుటతోడనే మాసిపోయెడివి. అట్లువోయినవెన్నియో! కాని-కొన్ని మాత్ర మట్లుపోవక నిలచినవి. నాటనుండి నేటివఱకును-ధర్మకార్యము

లను నిర్వహించువిషయమునకైనను నవి యనుసరింపఁబడుచు వచ్చుచున్నవి. అట్టివానిలో 'మాలవ శకము' ప్రధానమైనది. ఇదియే 'విక్రమ శకమ'నియుఁ బ్రఖ్యాతి నొందెను.

సుప్రసిద్ధ చరిత్రకారుఁడు డా॥ జయస్వాల్ తమ 'హిందూ పాలిటీ' లో మాలవ శకమే విక్రమ శకమని సమర్థించిరి. కాని వారు విక్రమ శబ్దమునకు వేరర్థమునుఁ జెప్పినారు. 'విజయమును సాధించిన సంవత్సరమ'ని వారి యూహ. కాని యీ శకనిర్ణయము రాజైన విక్రమాదిత్యుని పేరిటనే వచ్చినదని మా యభిప్రాయము. విక్రమాదిత్యుఁ డుజ్జయినిని బాలించిన కాలమున నాతఁడు జూపిన పరాక్రమము మహా ప్రసిద్ధమైనది. భారతదేశమంతయు నాతని నభినందించినది. ఈ విక్రమాదిత్యుఁడు బ్రదర్శించిన పరాక్రమముపై నాటికిని నేటికిని భారతీయుల కభిమానముగద్దు. అందుకే కోట్లకొలఁది హిందువు లుత్తరభాగమున నేటికిని విక్రమసంవత్సరమునే గౌరవింతురు–

విక్రమ సంవత్సరము - శాలివాహన శకము.

వీని యుత్పత్తినిగురించిన మతభేదములు.

విక్రమ సంవత్సరముయొక్క యుత్పత్తినిగురించి చారిత్రకుల కేకవాక్యత లేదు. మన చరిత్రలో జరిగిన ముఖ్య ఘట్టములనుగూర్చియే యనేక సందేహములు గలవుగదా! అట్లే దీనినిగూర్చికూడ. బుద్ధదేవుని జన్మ మెప్పు డను విషయమందే చారిత్రికులకు మతభేదములు గలవు. కొందఱు నూటేండ్లకుముం దందురు. మఱికొంద రేబది వర్షములకు వెనుక

యందురు. కనిష్కుని కాలమునుగురించియు నింతే! కొందరీతఁడు క్రీస్తుశకము - తొబ్బదియెనిమిదవ సంవత్సరమున సింహాసనము నధిష్ఠించి యుండె నందురు. వేరుకొందఱు క్రీ॥ శ॥ 120 వ మధ్యమందున రాజ్య మేలెనందురు. ఇట్లే విక్రమ సంవత్సర విషయమందుఁ గొన్ని మతభేదము లున్నవి. కొందరు విక్రమ వర్షమునకు మాళవ గణముయొక్క సంవత్సరముతో సంబంధము లేదందురు. భారతమునఁ బ్రవేశించిన శకుల రాజొకఁ డుండెను. ఇతని పేరు 'అజీజ్'. ఇతఁడు క్రీ॥ పూ॥ 58 వ వర్షమున తనపేర నొక సంవత్సరమును బ్రచారమునకుఁ దెచ్చెను. అతని పిదప గుప్తవంశీయుఁడైన విక్రమాదిత్యుఁడు శక, కుషాణులను నాశమొనర్పఁగా- నప్పటి నుండి విక్రమ వర్ష మారంభమయ్యెనని కొంద రందురు. క్రీ॥ పూ॥ 58 వ వర్షమున విక్రమాదిత్యుఁడను పేరుగల రాజొకఁ డుండెనట! అతఁడు శకులను జయించెను. దానికి జ్ఞాపకార్థముగ విక్రమసంవత్సరము వెలసెనని మఱికొంద రందురు. ఈ విక్రమవర్షమునకు మాళవ సంవత్సరముతోఁ గాని- లేక శకరాజైన 'అజీజు' వెలయించిన సంవత్సరముతోఁ కాని - సంబంధములేదట. కాని యా కాలమున విక్రమాదిత్యుఁడను నొకరాజున్నట్లు శాసనములేవియు లేవు. ఇతర సాధనములును లేవు. అతఁడు వెలయించిన నాణెములు మొదలైనవియు గనపడుట లేదు. ఇదియొక పౌరాణికమైన యాఖ్యాయిక మాత్రమే. విక్రమ శకమును వెలయించిన విక్రమాదిత్యుఁ డతఁడు గాడు. అతని కాలము వేరు. అతనిని గురించిన సాధన సామగ్రి గలదు.

శాలివాహనుని గురించియు నిట్టి కథలే గలవు. కొంద రిట్లందురు : "హిందూదేశమునందలి కుషాణులలో తొలి రాజొకఁ డుండెను. అతనిపేరు 'విమాక్యాడ్ ఫాయినిన్'. అతఁడొక శకమును వెలయించెను. అతనికాలము క్రీ॥ శ॥ 78 వ సంవత్సరమందు- అతనిదే "శాలివాహన శకము". ఇతరుల యభిప్రాయము ననుసరించి క్రీ॥ శ॥ 78 వ వర్షమందు- రాజ్యమధిరోహించినవాఁడు కనిష్కుఁడుగాని - యాతఁడు గాడు. కనిష్కుఁడే తాను సింహాసనమెక్కిన దానికి జ్ఞాపకముగ నొక వర్షమును వెలయించె నందురు. ప్రతిష్ఠాననగరమందుండిన శాలివాహనుఁడు శకుల జయించెను. అపుడాతఁడు శకుల శకమునే శాలివాహన శకమని పిలచెనట! మరికొంద రీ రెండు నిర్ణయములను సమ్మతింపరు. శాలివాహనునకు కనిష్కునితో నేసంబంధమును లేదని వారి తలఁపు. క్రీస్తుశకము 78 వ వర్షమున శాలివాహను డుండెను. అతఁడే 'గాథా సప్తశతిని' సంకలన మొనర్చినది. అతఁడు "గుజరాతు" సౌరాష్ట్ర దేశములందున్న యొక శకరాజు నోడించి జయముగాంచెను. నాటనుండి శాలివాహన శక మేర్పడినది.

ఈ విషయమై యెక్కువ చర్చించుట కిచటఁ జోటు లేదు. అందుకై యొక నాల్గు మాటలను జెప్పి ముగింతును. శకసంవత్సర విషయమై యనేక మతభేదము లున్నవని తెల్పితిమి. ఏది ఎట్లున్నను- నీ రెండును - శక కుషాణులపై భారతీయులు సాధించిన విజయమునకు సూచకముగ నుంచబడినవే. ఇప్పటి కింత చాలును.

భారతీయు లొనర్చు కాలగణనయందు 'శక' శబ్దమున కంటెను - సంవత్సర మనుటయే చక్కఁగా నదుకుకొనును.

వేదకాలమునుండియు "సంవత్సరము- లేక- సంవత్" శబ్దములు కాలగణనకై మనవా రుపయోగించుకొనుచు వచ్చుచున్నారు. శక శబ్ద మా యర్థ మొసఁగుట లేదు. ఈ పదము ఆకాలమునందు భారతము నాక్రమించిన పరశత్రువు లైన శక కుషాణులకు సంకేతముగ వాడుకొన్నదే! 'విక్రమ సంవత్' యనునది కేవల సంస్కృతశబ్దము. శాలివాహన శకము- గీర్వాణ భాషాపరినిష్ఠితము గాదు. శక శబ్దము సరిగా నదుకుట లేదు. అది తీసివేయవలసినదే. మన ధర్మకార్యము లలోఁగూడ "శాలివాహన శకే" లేక "శాకే" యని జెప్పి కొనుచుందురు. ఈ రెండు పదములును పరిత్యాజ్యములు.

విక్రమ, శాలివాహన సంవత్సరములు మనవారు- శక - కుషాణులపై సాధించిన విజయములకు సూచకము లంటిమి. ఈ విషయములు కేవలము చమత్కారకల్పనయే గాదు. అర్థగర్భితముగూడ! గుప్తరాజులు మొదలైనవారు దమ పేరిట ననేక సంవత్సరములు వెలయించిరి. అవి వారి తోనే బోయినవి. యీ రెండుమాత్రము బోక నిలచినవి. ఇవి నిలచుటకుఁ గారణము-శక కుషాణులపై సాధించిన జయ మును తెలుపుటయే! భారతీయులకు వారు ప్రబలశత్రువులు. వారితో మనవారు- సుమారు- రెండున్నర శతాబ్దములు బాధపడిరి. దుస్సహమైన యీ దమనమును- దాస్యమును నడ్డగించిన విక్రమశాలురు- విక్రమాదిత్య, శాలివాహనులు.

అందుపై- వారు వెలయించిన సంవత్సరములపై జనుల కత్యం తాదర మేర్పడినది. కాలమున నెన్నియో సంవత్సరములు మునిఁగిపోయెను. ఈ రెండునుమాత్రము రెండువేలేండ్లనుం డియు నిలువక వచ్చుచున్నవి. ఈ రెండును ముఖ్యముగ భారతీయుల గౌరవమునకుఁ బాత్రములు.

## భారతీయులు శస్త్రవిజయముతోఁ బాటు శకులపై ధర్మవిజయమునుగూడ సాధించిరి.

మాళవికులు 'నహపాణు'ని చంపి రంటిమి. దీనితో వారి యాక్రమణ కుంఠితమయ్యె నంటిమి అట్లే దక్షిణమున నున్న యాంధ్రులు- ఉత్తరమునకెత్తి- శకుల రాజ్యములపై బడి "గుజరాతు- సౌరాష్ట్రము-సింధు" మొదలగు ప్రదేశము లలో విశంకటముగ బోరిరి. శాలివాహన వంశీయులైన గౌతమీపుత్ర శాతకర్ణి - వసిష్ఠపుత్ర పులమాయి మొదలగు వారు మహాపరాక్రమవంతులు. ఉజ్జయినివరకునున్న శకులపై వారు బలుమారు దండెత్తిరి. శకులకు బలుసారు లోటమి దప్పలేదు. అందుచే వారికి శాలివాహన రాజన్యుల యాధిప త్యము స్వీకరింపవలసియే వచ్చెను. శక రాజు 'రుద్రుఁ' డను వాఁడు దన కూతును శాలివాహనవంశ రాజున కిచ్చి వివాహ మొనర్చెనట ! దీని విషయమై శాసనము లున్నవి. ఇంతకు ముందు సెల్యూకసు గావించినదియు నీ పనియే !

భారతీయులకును-శకులకును సుమారు 150 వర్షములు తెగనిపోరాటము సాగినది. ఈ యుద్ధములో మడసిన సైని కులు లక్షలు. అందుచే శకుల సంఖ్యాబలమునుగూడ భారత

దేశమున సన్నగిల్లుచు వచ్చినది. ఈవిషయముగూడ మనము మఱువఁదగినది గాదు.

శకుల శస్త్రశక్తి భారతీయుల ప్రతీకారమున కాగలేక-క్రమక్రమముగ క్షీణింపఁజొచ్చెను. అది క్షీణించుకొలఁదియు-వీరి సంస్కృతియొక్క నీడలు వారిపై వ్యాపింప మొదలు పెట్టెను. శకులకును భారతీయులకును జరిగిన యీ పోరాటములలో కడకు- శకులు వినమితులై వీరికి లొంగిపోవలసియే వచ్చెను. శకులు రాజులు మొదలుకొని సామాన్యునివఱకును-వారి పేరులనుగూడ 'సత్యసింహుఁడు- రుద్రసేనుఁడని' యీ ప్రకారముగ మార్చికొనిరి. అంతగా వారిలో శకసంస్కృతి లుప్తమైపోయెను. భారత సంస్కారము జోటు చేసికొనెను. ఇంకను- నాశ్చర్యకరమైన విషయ మేమనఁగా- శకు లనేకులు వైదికధర్మమును స్వీకరించిరి. శకులకును - బౌద్ధులకును, చాల పరిచయములున్నవి. వీరు హిందూకుశములను దాటి "బెలూచిస్థాన్, సింధు" ప్రాంతములలో నెలకొన్నప్పుడు-అశోకుఁడు మొదలైన బౌద్ధరాజు లొనర్చిన ధర్మోపదేశములు వీరి చెవులలోఁ బడినవి. "మినియాండరు- మిళిందుఁడై నాఁడు గదా! నాటనుండి బౌద్ధభిక్షువులు వారికిఁ బరిచితులే! ఆనాఁడు వారితోఁ బోరిన 'మాళవ, యౌధేయులు' శాతవాహనులు-వైదికులు- బౌద్ధులు- శకులకు, నిశ్శస్త్ర- సశస్త్ర ప్రతీకారములలో నేనినిగాని యొనర్చియుండ లేదు. కనుక శకులు ఆదరముతో బౌద్ధమతమును స్వీకరించి యుండవలసినదే! అందుకు భిన్నముగ వారు వైదికమతము నాశ్రయించిరి. వారి రాజులలో- ప్రజలలో వైదికధర్మము బాగుగ వ్యాపించెను.

ఈ చమత్కారమునకుఁ గారణము? శకులలో పరాక్రమమును మెచ్చుకొను గుణ ముండినది. అది వారిమూలప్రవృత్తి. వారు శస్త్రజీవులని ముందే దెల్పితిమిగదా! కనుక మహావీరులైన వైరి కుల శౌర్యములు వీరిలో మెప్పును- భయమును దరికొల్పి యుండును. అందుచే వారి స్వభావానుసారము శకు లీ ధర్మ మునే యాశ్రయించి యుందురు.

సంస్కృతముపైఁగూడ శకుల కాదరము గలిగెను. వారి చేతులయందున్న రెండు మూఁడు మాండలిక రాజ్యముల యందును గీర్వాణమే బాగుగ బ్రచారమునకు వచ్చెను. ఒక శకరాజు తన సభలోఁ జర్చలన్నియు- రాజ్యవ్యవహార పత్ర ములన్నియు- సంస్కృతమునందే యుండవలెనని నిర్ణయించె నట! ఇతర రాజ్యములతో నాతఁ డొనర్చిన వ్యవహార పత్ర ములుగూడ సంస్కృత భాషలోనే యున్నవి. ఇట్లు తిన్న తిన్నగా శకులు భారతీయులలో- నైక్యమైపోఁజొచ్చిరి.

## కు షా ణు ల దా డు లు

సమరములలోఁ బోరుచు - శకులపై సాంస్కృతిక విజ యమును సాధించుచున్న సమయముననే, కుషాణులు హిందూ కుశములపై దాడి వెడలిరి. కుషాణు లక్కడనున్న హూణు లను బోఁద్రోలి-యా ప్రదేశముల నాక్రమించికొనిరి. అప్పుడు జరగిన రక్తపాతములు - యుద్ధములు, భయంకరములైనవి. హిందూకుశములకుఁ బైనున్న "చీనా" దేశముయొక్క సీమలవరకు కొన్ని గ్రీకు రాజ్యము లుండెను. వానియందెల్ల కుషాణు లలజడి లేపిరి. ఆ ద్వేషమును మనసున నుంచికొన్న

కుషాణులు- బాహ్లీకము నొత్తి - హిందూకుశము లాక్రమించి - గాంధారములకుఁ జొచ్చి శకుల కుప్పి బుట్టకుండ జేసిరి. అట బొంచి- పంచనదములకుఁ బ్రవేశించి- హిందూస్థానమున సామ్రాజ్యమును నెలకొల్పిరి. వారి రాజు "విమాక్యాడ్ ఫాయినిస్"

స్వాతంత్ర్య ప్రియులైన "యౌధేయులు" మాళవ రాజులు-శాలివాహనులు మొదలగువారు శకులతో సుమారు నూరేండ్లనుండి పోరుచుండి రంటిమి. ఇంతలో వారికన్నను భయంకరులు - రక్తప్రియులునైన కుషాణులు దాపురించిరి. వెంట వెంట వచ్చిన దాడులచే భారతీయులకుఁ జేతులాడకపోయెను. కుషాణులు 'పంజాబు'న రాజ్యమును స్థాపించిరి. కాని- అంతటితో భారతీయు లూరకుండలేదు. పంజాబు నుండి క్రిందికి కుషాణులను దాటిరానివ్వక యప్పుడప్పుడు బోరుచునే యుండిరి.

## కనిష్కుఁడు

"విమాక్యాడ్ ఫాయినిస్" మరణించెను. కనిష్కుఁడు కుషాణుల సింహాసన మెక్కినాఁడు. ఈ సంఘటన క్రీ॥ శ॥ 78 వ వర్షమున. కొందరు చారిత్రకులు క్రీ॥ శ॥ 120 వ సం॥ మం దందురు. ఇతనికి మహత్వాకాంక్ష యెంతయో బరాక్రమ మంత. హిమాలయముల కావ లీవల నున్న చిన్నచిన్నవియైన శక- కుషాణ రాజ్యముల నన్నిటిని-కనిష్కుఁ డేకత్ర జేర్చినాఁడు. అతని కాలమున నది యొక విశ్రుత సామ్రాజ్య మయ్యెను. తాను కుషాణులకు రాజునని కని

ష్కుఁడు ప్రకటించికొన్నాఁడు. అతని రాజధాని పురుష పురము. అనఁగా - నేటి పెషావరు. ఆకాలమున శకులు-మాళ వమునుండి- సింధుప్రాంతములవరకు రాజ్యములు నిర్మించి కొని యుండిరి. వీ రాంధ్రులకు సామంతులు. కనిష్కుఁ డీ శకు లపై నెత్తెను. శకులకుఁ దోడుగ నాంధ్ర సైన్యములుగూడ నడచెను. కాని- యాంధ్ర సైన్యములు తీరని యుద్ధములతో నలసిపోయినవి అందుచే రెండుసారులు వారికిఁ బరాభవము దప్పలేదు. ఆ సైన్యములు నర్మద కుత్తర భాగమున నుండి దిగజారి - నర్మదయొక్క దక్షిణ తటమునుఁ జేరెను. కనిష్కుఁ డాంధ్ర రాజ్యములపై దండెత్తుటకు సన్నద్ధుఁ డైనాఁడు. అతని నడ్డి- తమ భూభాగమును రక్షించుకొనుట యాంధ్రులకుఁ గర్తవ్యమైనది. కనిష్కుఁ డంతకుముందే "మాళవము-గుజరాతు" సౌరాష్ట్రము- సింధు పరిసరములు మొదలైన శకరాజ్యముల నన్నింటిని జయించియుండెను. అం దుచే శకులు ఆంధ్రుల యధికారమును మన్నించుట వదలి కనిష్కునకు సామంతులైనారు. అతని సైన్యములు నర్మ దను దాటివచ్చెను. అపరాంతక ప్రాంతములలో (ఉత్తర కొంకణ) నొక కోటగూడ నాతనికి స్వాధీనమైనది. ఇంత యైనను కనిష్కున కాంధ్రులపై నెత్తుటకు గుండె జాలలేదు. వారి శస్త్రశక్తి యంతటిది. అందుచే కనిష్కుఁడు తన దక్షి ణాక్రమణ మంతటితో నాపికొన్నాఁడు. హిమాలయముల కవతల నున్న కనిష్కుని రాజ్యముపై చీనాదేశముయొక్క సేనాపతి దాడియెత్తివచ్చెను. దానికిఁ బ్రతీకార మొనర్ప వలెనని కనిష్కునకు కోరిక గల్గినది. అనంత వాహిని గదలి

నది. వారి నడుమ జరిగిన యుద్ధము లనేకములు. కడకు 'చీనా' సేనాపతి పరాభవము నందెను. కనిష్కుఁడు 'కాశగర్' 'చాసకండ్' 'ఖోడాన్' మొదలగు ప్రదేశముల నాచికొనెను. ఇవి ఆసియాయందున్న ప్రదేశములు. చీనా సామ్రాజ్యమునకుఁ జెందినవి.

## రాష్ట్రజీవనమునకును - జనుల పౌరుషమునకును నిజమైన యొఱపిడిరాయి యేది ?

శక కుషాణులు ఆసియా ఖండమందు గొప్ప యలజడి లేపిరి. వారి యలజడితోఁ గంపించినది భారతదేశ పరిసరము లే గాదు. లక్షలు లక్షల కెదిగి వచ్చుచున్న వారి సైన్యములతో 'చీనా' వంటి బలిష్ఠమై, సుసంఘటితమైన సామ్రాజ్యము గూడ సమరాంగణమున గొన్ని బాధలనుభవింపవలసివచ్చెను. ఒకానొక దేశముయొక్క పౌరుషమును వెలగట్టుటకు- దాని తాత్కాలికాపజయము కారణముగాదు. కాని - కొందఱు చరిత్రకారు లీ సత్యమును గమనింపక "చీనా దేశము సర్వదా దుర్బలము; పరదాస్య బధిరితము. అవనతిదప్ప దానికి వేరు చరిత్రయే లేదు." అని యేమేమో వ్రాసిరి. ఇట్లు వ్రాయుట మూర్ఖత్వముతప్ప వేఱుగాదు. అట్లే భారతదేశ విషయమునను నీవ్రాతనే వారు బ్రయోగించినారు. భారత రాష్ట్రీయ జీవనమనఁగా- పరాజయముల చరిత్రయేనట! ఇట్టి వ్రాతలు చారిత్రకులు వ్రాయవలసినవిగావు, ఇతిహాసమును జక్కగా నధ్యయన మొనర్చినవా రింకను విశాలదృష్టి నలవఱచికొనవలెను.

ఒకానొక దేశముపై మరియొకటి దండెత్తి వచ్చును. తాత్కాలికముగ నది యోడిపోవును. దానితో నాదేశము పూర్ణముగ పరాస్తమైనట్లుగాదు. ఆ యాఘాతముతో దాని రాష్ట్రీయ జీవనము సంపూర్ణముగ లుప్తమైనదా? యనుటయే చారిత్రకుఁడు గమనింపవలసిన సత్యము. వారికి జరగిన యుద్ధములలో నంతిమ సంఘర్షణమందు నీ రాష్ట్రములు పాదాక్రాంతములయ్యెనా? యను విషయము చర్చింపవలసిన సత్యము. అట్లు జరుగకున్నచో నా రాష్ట్రము బరాక్రాంత మైనట్లుగాదు. ఇదియే రాష్ట్రీయశక్తిని వెలగట్టుటకు సరియైన తూనికరాయి.

ఈ విషయమును దృష్టిలో నుంచికొని పరిశోధించినచో శక, కుషాణులకును- భారతీయులకును జరగిన సంఘర్షణమందెవ్వరు గెల్చిరి? ఎవరు నామమాత్రావశిష్టులైపోయిరి? తెలిసికొందముగాక!

## కనిష్కుఁడు బౌద్ధము నంగీకరించెను. దానిలో నాతఁడు మార్పులు దెచ్చెను.

కనిష్కుఁడు చీనాదేశ పర్యంతము యుద్ధములు జరపుటతోనే తృప్తుఁడై యుండలేదు. ఆధ్యాత్మిక- సాంస్కృతిక విషయములపైఁగూడ నాతఁడు లక్ష్యముంచినాఁడు. బౌద్ధధర్మమును స్వీకరించుటకును గనిష్కుఁడు కృతనిశ్చయుండయ్యెను. అందుకై యాతఁ డనేక స్తూపములు మున్నగువానిని దన సామ్రాజ్యమున నెలకొల్పెను. అశోకుని కాలమున వలెనే కనిష్కుని కాలమందును- బౌద్ధమున బయులు

చేరిన వనేక సంప్రదాయములు. వారిలో వారికి వైమనస్య
ములు. వీరిలో నేకవాక్యత గొనివచ్చుటకై యశోకుఁడు
ప్రయత్నించెను. కనిష్కుఁడుగూడ నట్లే యత్నించెను. ఆతఁ
డొక మహాపరిషత్తు నేర్పాటు జేసినాఁడు. ఈ పరిషత్తున
బౌద్ధుల కేకవాక్యత గుదురుటకు బదులు మరియొక నూతన
పంథ బయలుదేరెను. దీనినే "మహాయాన" మందురు.
అంతకుముందున్న బౌద్ధమునకును దీనికిని భేదములు కొల్లలు
ఈ సంప్రదాయమున కంగీకరింపనివారందరును చేరి- 'హీన
యాన' పంథ నొకదానిని స్థాపించికొనిరి. కనిష్కుఁడు
హిమాలయ ప్రాంతములందు దన సామ్రాజ్యములో 'మహా
యాన' సంప్రదాయమునకు బ్రహ్మాండమైన ప్రచార మొసఁగి
నాఁడు. కనిష్కుఁ డేర్పాటుచేసిన 'మహాపరిషత్తు' గీర్వా
ణమునే ధర్మ భాషగా నంగీకరించినది. ఆ భాషకు వారి
దృష్టిలో గౌరవము హెచ్చెను. అంతకుముందు వారి గ్రంథ
ములు 'పాలీ' భాషలో నుండెడివి. అవి సంస్కృతీకరింపఁ
బడెను. ఇంతేగాదు. 'బుద్ధ చరిత్ర' వంటి గ్రంథములుగూడ
జనిస్తించెను. అట్టి వెన్నియో బౌద్ధగ్రంథముల నానాటి పండి
తులు రచించిరి. అపుడు శక, కుషాణులు బౌద్ధమును, సంస్కృ
తమునుగూడ చేపట్టిరి. కనిష్కుని సామ్రాజ్యమంతయు బౌద్ధ
మయమగు స్థితికి వచ్చెను. ఈ రీతి భారతీయ సంస్కృతి-
ధర్మము- భాష- యాచార విచారములు- వాని యుపాంగ
ములతోఁబాటు శక, కుషాణుల నావరించికొన్నవి. ఆ రెండు
జాతులును భారతజాతియం దంతర్భూత మయ్యెను.

బౌద్ధధర్మము భారత ధర్మమే యగును. కనిష్కుడు దీనిని గ్రహించుటతో భారతదేశ సంస్కృతికి విజయము ప్రాప్తించినట్లే. కాని- కనిష్కుడు స్వీకరించినది పురాకాలికమైన బౌద్ధముగాదు. అశోకుం డాదరించిన దానివంటి బౌద్ధమును గాదు. దానిలో నతఁడు గొన్ని మార్పులు దెచ్చెను. అతఁడు బౌద్ధదీక్షను స్వీకరించినను 'రుద్రోపాసన' మొదలైన కొన్ని వైదిక ధర్మముల ననుసరించుచునే యుండెను. 'ప్రాణి హింస' యొనర్పరాదు. శస్త్ర విజయమున కన్నను ధర్మవిజయమే శ్రేష్ఠమైనది. మొదలగు బోధల నాతఁ డుల్లంఘించినట్లే! అశోకుం డాదరించిన యీ ధర్మములు మహాయానమందు మందునకును గానుపింపలేదు. కనిష్కుఁ డొకవైపు బౌద్ధ ధర్మ ప్రచార మొనర్చుచునే మరియొకవైపు శత్రువులపైఁ గత్తిని ఝుళిపించెను. తాను చీనాదేశ చక్రవర్తి నణిపించికొనవలెనని యాతనికి పెద్ద యాశ. అందుకై యాతఁడు సంవత్సరములకొలఁది యుద్ధములు బెట్టుకొనెను. ఆ యుద్ధపిసాస - దన సైనికులే దిరుగఁబడువరకు నాతని కారలేదు. కడ కా సైనికులే యాతని తలఁదఱిగిరి.

ఇచట కొంత నిలచి విచారింతముగాక! హిమాలయముల కావైపు 'కనిష్కుఁడు' బౌద్ధమతమును బ్రచారమొనర్చె నంటిమి. ఆ ప్రచార మెట్లు సాధ్యమైనది? తొట్టతొలుత శస్త్రముతో నాతఁ డా ప్రాంతములఁ జయించెను. తరువాత దనధర్మము నచ్చట బ్రచారమొనర్చెను. అందుచే నా ప్రచారము సులభతరమైనది. అంతేగాని - విహారములు

గట్టుటయు - లక్షలకు భిక్షువులా ప్రాంతములలో దిరుగుటయు గనిష్కుని శస్త్రవిజయమునకు గారణములుగావు

'శస్త్రవిజయమున కన్నను ధర్మవిజయము శ్రేష్ఠము' ఈ మాట వినుటకుఁ దీపిగనే యుండును. కాని - శస్త్రవిజయము లేక ధర్మవిజయమును సాధించుట కుంటివాఁడు హిమాలయ పర్వతము లెక్కుట వంటిది. అట్లే ధర్మ జయములేని శస్త్ర జయమును కేవలము పాశవికమైనది. ఈ రెంటినీ సమగ్రముగ సాధించుటయే గొప్పతనము.

## భారతీయ బౌద్ధుల రాష్ట్రద్రోహము

సమ్రాట్టైన కనిష్కుఁడు బౌద్ధుఁడైనను, వైదికుఁడైనను భారతీయుఁడుమాత్రము గాఁడు. మన భారతము నాక్రమించిన విదేశీయుఁడు. భారత పశ్చిమోత్తర భాగమందాతఁడు బలవంతుఁడై రాజ్యమును స్థాపించెను. కాని - యా రాజ్యము మన దేశముపై రుద్దబడిన పరరాష్ట్రమే! భారతీయ రాజ్యముగాదు. అందుకై - కుషాణుల రాజ్యమును విధ్వంస మొనర్చి యచటి భారతీయులకు స్వాతంత్ర్యప్రదాన మొనర్చుటకై భారతదేశమునందలి వైదికులు దీవ్రముగ యత్నించిరి. వారెల్లరు దీవ్రమైన రాష్ట్రభక్తి గలవారు. కాని - యప్పుడు బౌద్ధులు జేసిన దేమి? కుషాణుఁడైన కనిష్కుఁడు బౌద్ధమును స్వీకరించెనంటిమిగదా! దానితో వా రుప్పొంగి పోయిరి. వా రాతనిని దమ సమ్రాట్టుగ నెంచిరి. తమ రాష్ట్రభక్తిని మఱచి పై పెచ్చు రాష్ట్ర స్వాతంత్ర్యమునకై పోరాడు వైదిక వీరులకు విద్రోహము లొనర్ప సమకట్టిరి.

## సమ్రాట్టు కనిష్కుని పౌత్రుఁడు వైదిక ధర్మమును స్వీకరించెను.

కనిష్కుఁడు చీనాదేశ మధ్యమున మరణించెను. ఆతని సైనికులే కనిష్కుని తల నుత్తరించిరి. ఇఁక బౌద్ధుల కండ లేక పోయినది. కనిష్కుని పుత్రుఁడు 'హువిష్కుఁడు'. ఇతఁడు బౌద్ధమతమునం దుదాసీనభావమును ప్రదర్శించెను. ఇంతలో హువిష్కుఁడు - గతించినాఁడు. తరువాత నాతని పుత్రుఁడు సింహాసన మెక్కెను. ఈతఁడు బౌద్ధ ధర్మముతోడి సంబంధమునే వదలెను. తన నామమునుగూడ మార్చికొని 'వసుదేవుఁడ'ను శుద్ధ సంస్కృతమైన వైదిక నామధేయమును గ్రహించెను. ఇతఁడు శివోపాసకుఁడు దినమును శివార్చనాపరుఁడైనాఁడు. ఆతఁడు తన నాణెములపై శివ, నంది ప్రతిమల ముద్రించినాఁడు.

కనిష్కుఁడు మరణించినదే యతని రాజ్యము దునుకలైనది.

సమ్రాట్టు కనిష్కుఁడు మరణించిన తరువాత యాతని సామ్రాజ్యమున గలఁతలు రేగెను. అతని రాజ్యము- ఉత్తర భారతమునన్నైనను బాగుగ వ్యాపించియుండలేదు 'పంజాబు- మాళవము- సౌరాష్ట్రము- గుజరాతు- ఉత్తర కొంకణము' ఇవన్నియు నొకనాఁడు శకులకు లోఁబడెను. తరువాత వాని నాంధ్రులు గెలిచికొన్నారు. ఆంధ్రుల నోడించి కనిష్కుఁడా రాజ్యములలోఁ దన యాధిపత్యమును నెలకొల్పెనుగదా! కనిష్కుఁడు మరణించినదే తడవు- ఈరాజ్యము లాతని యాధిపత్యమును బడదన్ని స్వతంత్రములైనవి. శాలివాహ

నులు శక కుషాణులతో- సుమారొక శతాబ్దము పోరి- దక్షిణ భారత స్వాతంత్ర్యమునకు భంగము రానీయక గాపాడిరి. కనిష్కుని యనంతరము ఉత్తర పూర్వభారత రాష్ట్రములన్నియు నామమాత్రముగ స్వీకరించిన యాతని యధికారములన్నియు విముక్తములై స్వతంత్రము లయ్యెను.

## పాటలీపుత్రమున నస్తమించిన సూర్యుడు మరల వెలిగెను.

నాడు పాటలీపుత్ర రాజ్యము చాలచిన్నది. దాని ప్రసిద్ధి మనకు విపులముగ దెలిసినదే. చంద్రగుప్తుడు- అశోకుడు- పుష్యమిత్రుడు- మొదలైన సమ్రాట్టులా సింహాసనముపై గూర్చుండి - యాసేతుహిమాచలము శతాబ్దముల తరబడి తమ యాధిపత్యమును వెలిగించిరి. జిగజిగ వెలుగు సింహాసన మణికాంతులు- శక, కుషాణులు జెలరేగిన క్రీ॥ శక ప్రారంభమున జూచుచుండగనే మాసిపోయెను. అందుకై శక, కుషాణులొక శతాబ్దమునకు పైగా సాగించిన యుద్ధములతో మగధసామ్రాజ్యముయొక్క నామముగూడ వినబడుటలేదు. ఎవరో కొందరు - అప్రసిద్ధులైన రాజులు సింహాసనముపై గూర్చుండి రాజ్య మొనర్చుచుండిరి వారి నామధేయము లా ప్రాకారములను దాటి బైటికి వినబడనే లేదు.

ఇంచుమించు క్రీ॥ శ॥ 300 సం॥ లో పాటలీపుత్రము యొక్క- యీ చిఱుగద్దెపై- బౌద్ధశాఖయైన 'లిచ్ఛవి' రాజులచే నొక గణరాజ్యము స్థాపింప బడినది.

ఈ 'లిచ్ఛవు'లలో నొక ప్రముఖు డుండెను. అతని బిడ్డ 'కుమారదేవి'. ఈమెను చంద్రగుప్తుడు వివాహ

మాడెను. వీఁడొక సామంతరాజు. ఈసంఘటన క్రీ శ. 308 సం॥ మధ్య జరిగెను. ఈ వివాహముతో 'చంద్రగుప్తునకు' 'లిచ్ఛవుల' సహాయము లభించినది. క్రీ. శ 320 సం॥ మధ్య పాటలీపుత్రమున నొక స్వతంత్ర రాజ్యమును స్థాపించినాఁడు. మౌర్య చంద్రగుప్తునితో నీతని కేసంబంధమును లేదు. కేవలము నామసాదృశ్యముమాత్రమే! ఈచంద్రగుప్తుఁడు గుప్త వంశమునకుఁ జెందినవాఁడు. ఈతని పరాక్రమముతో గుప్త వంశము ప్రసిద్ధికి వచ్చెను ఈతఁడు పరిపాలించిన 11 సంవత్సరములలో చుట్టు ప్రక్కలనున్న మగధము - ప్రయాగ- అయోధ్య-మున్నగుప్రాంతములజయించి (ఈ చంద్రగుప్తుఁడు) మహారా జనిపించికొన్నాఁడు. మ్లేచ్ఛ, శకుల నోడించి భారతీయ సామ్రాజ్యమును స్థాపిపవలెనని యాశలుగల సముద్రగుప్తుడను తనపుత్రుని చేతిలో రాజ్యమునిడి మరణించెను. గుప్తవంశము వైదిక ధర్మాభిమానము గలది. వీరి యుపాసనా దేవత విష్ణుమూర్తి.

## సముద్రగుప్తుఁడు

ఇతఁడు రాజ్యమునకు వచ్చినదే తడవు దేశ పరిస్థితి నంతయు జక్కగా నాకళించికొన్నాఁడు. ఉత్తర భారతమునను - దక్షిణముననుగూడ ననేక భారతీయ రాజ్యము లుండెడివి. ఇవన్నియు స్వతంత్రములు. 'ఎవరికి వారే' యై యుండిరి. వీనినన్నిటిని - జయింప వలెను. మౌర్య చంద్రగుప్తుని కాలమున చాణక్యుఁడు గావించినట్లు - దొలుత నొక భారతీయ సామ్రాజ్యమును స్థాపింపవలెను. తరువాత

నాశక్తిపై నాధారపడి శక - కుషాణులపై గాలు దువ్వ వలెను. అంతవఱకు నోర్పుతో నుండవలెను. ఈ యూహ లతో సముద్రగుప్తుఁడు "కామరూప"మును గెల్చెను. నేపాళ మును జయించెను. పూర్వోత్తర ప్రాంతము మొదలుకొని - వింధ్యపర్వతములవరకును సముద్రగుప్తునకు లోఁబడిపోయి నది. అనంతర మతఁడు వింధ్యములను దాటి - పూర్వదిశ నుండి దక్షిణమున ప్రవేశించినాఁడు. కొందరు స్వాతంత్ర్య ప్రియు లాతనితో యుద్ధము లొనర్చిరి. వారి నాతఁడు జయిం చెను. జయించి సామంతులుగ జేసికొని - వారి రాజ్యములు వారికి వెనుకకిచ్చినాఁడు అతఁడు జూపించిన పరాక్రమము, యుదారత యద్వితీయములైనవి. పాశ్చాత్యచారిత్రకులే సముద్రగుప్తునకు "హిందూ నెపోలియన్" అని పేరు పెట్టి నారు. అనఁగా గొప్పవాఁడన్నమాట! మన మహాపురుషు లను వారు ప్రశంసించుశైలి యిట్టిదే. విస్తృత సామ్రాజ్య మును సాధించిన పిదప సముద్రగుప్తుఁడు పాటలీపుత్రమునకు మరలెను. తాను సాధించిన యీ విజయములకు చిహ్న ముగ నాతఁ డశ్వమేధ మొనర్చినాఁడు. అశ్వమేధముతో నాతని వైదిక ధర్మాసక్తియుఁ బ్రకటితమైనది. ఇట్లు సాధన సంపత్తులు సమకూర్చికొని సముద్రగుప్తుఁడు శక కుషాణులపైఁ శత్తిఁగట్ట సన్నద్ధుఁడయ్యెను.

## కుషాణుల యంతిమ శరణాగతి

సముద్రగుప్తుఁ డెత్తివచ్చుచున్నాఁడన్న వార్తలు చిచ్చువోలె వ్యాపించెను. భారత వాయవ్యభాగమున గొన్ని

దేశములు కుషాణులవి యుండెను. అవి గాంధార ప్రభృత ములు. ఆ దేశములు దమకు దామై సముద్రగుప్తుని యధి కారమును స్వీకరించెను. కుషాణు లానాడు దమ్ము 'కుశు' లని వ్యవహరించుకొనుచుండిరి. వీరు సముద్రగుప్తుని యాధి పత్యమునకు లోబడినందుకు గుఱుతుగ నీతని కొలువునకు దమ రాయబారుల నంపిరి. కట్నములనుగూడ నంపినారు. ఈరీతి సుమారు రెండు శతాబ్దములకు పైగా నవ్యాహతము లైన యుద్ధములొనర్చి భారతీయులు - కుషాణులు భారత దేశమున స్థాపించిన రాజ్యమును మూలమట్టముగ నాశన మొనర్చిరి. ఇంతటితో కుషాణులు నాశనమైనట్లే ! !.

కనిష్కుని కాలమున కొన్ని శకరాజ్యము లాంధ్రుల యాధిపత్యమును తృణీకరించెనంటిమిగదా ! అవి నామ మాత్రముగ గనిష్కునకు లోబడియుండెను అతని మరణా నంతర మాశకరాజ్యములు స్వతంత్రములైనవి. అవి మాత్రము సముద్రగుప్తుని యాధిపత్యమును దమకుదామై మన్నింపలేదు.

## సమ్రాట్టు సముద్రగుప్తుని మృత్యువు-తదనంతర కాలము

శకులు మొదలైన మ్లేచ్ఛరాజ్యములపైకి దండెత్తు ప్రయత్నము లూహామాత్రములుగ నుండగనే సముద్ర గుప్తుడు మరణించెను. అతని మరణము క్రీ॥ శ॥ 375వ సంవత్స రమున. సముద్రగుప్తుని యనంతరము చంద్రగుప్తుడు రాజు గావలెనని సముద్రగుప్తు డాజ్ఞాపించెను. ఈతడు రెండవ చంద్రగుప్తుడు. సర్వవిధముల సమర్థుడు. సముద్రగుప్తున కీతడు రెండవ కొడుకు. కాని - సామ్రాట్టు మరణించినంతనే

రామగుప్తుఁడు దాను సింహాసనమునకు రావలెనని పట్టుపట్టి నాఁడు. ఇతఁడు నిర్గంధకుసుమము. వీని పట్టుదలకు గల యోగ్యత యొక్కటే! తాను సముద్రగుప్తునకు జ్యేష్ఠ పుత్రుఁడగుట! రామగుప్తుఁడు పట్టాభిషిక్తుఁడై నాఁడు. కాని-ప్రజలలో నాతనికి పలుకుబడి లేదు. సైనికాధికారు లాతని నెదిరించుచుండిరి. ఇంతలో నొక సంఘటన జరగెను. అది రామగుప్తునిపై బ్రజలకింకను నసహ్యము గలిగించినది. ఈ కథను కొందరు చరిత్రకారులు కల్పన యని త్రోసివేసిరి. కాని దీనిని ప్రాచీన కవులైన విశాఖదత్తుఁడు - బాణభట్టు మొదలగువారు వర్ణించిరి. అమోఘవర్షుఁడు మహారాజొసఁగిన దానశాసనములలోఁగూడ నీ విషయము నుల్లేఖించెను. ఇట్టి సంఘటనలు జరగుట యాశ్చర్యముగాదని ఢిల్లీసుల్తానైన "యల్లావుద్దీన్" కథ మనకుఁ దెలుపును. అతఁడు పద్మిని యెడల నిట్లే ప్రవర్తించెను. రామదేవునకు జరిగిన యా సంఘటన యిదే!.

సముద్రగుప్తుఁడు మరణించెను. ఆ గద్దెపై రామగుప్తుఁ డెక్కినాఁడు. వీఁడు దుర్బలుఁడు. ఈ యవకాశమును బురస్కరించుకొని శకులు బాగుగ విజృంభించిరి. వా రితర రాజ్యములపైఁబడి యాక్రమించుకొన జొచ్చినారు. రామదేవునకు ధ్రువదేవి భార్య. ఆమె యత్యంత సుందరి. ఆమెను దన కొప్పగింపవలెననియు - లేకున్నచో దండెత్తి వత్తుననియు - నొక శకరాజు రామగుప్తుని బెదరించెను. శకుని యీ దుర్గర్వముతో మగధరాజ్య వాతావరణము క్షుబ్ధమైనది. రామగుప్తుఁ డందులకును సిద్ధపడెను. యుద్ధము నిలుపు నుద్దేశముతో

నాతఁడు గృహదేవిని శకక్షుత్రపునికడ కంపుటకుఁ దయార్రై నాఁడు. ఈవార్త విని యామె మఱది చంద్రగుప్తుఁడు జాల సంతాపించెను. గృహదేవిని దాను రక్షింపదారకొన్నాఁడు. అతఁడు కూటనీతి నాశ్రయించెను. "గృహదేవిని దనకడకుఁ బంపుచున్నా"నని శకునకు వర్తమాన మంపినాఁడు. దీనితో వాని సంతోషము మిన్నుముట్టెను. గృహదేవి నూతనముగా శకరాజును జూచుచున్నది గనుక - యామె కాతని మొగమును జూచుటకు సిగ్గుగా నుండుననియు - చంద్రగుప్తుఁడు శకరాజునకు దెలియపరచెను. ఆమె వెంట ననేక దాసీలు వత్తురనియు - వారి మేనాలుగూడ దిరస్కరిణీ పరివృతములై యుండుననియు - చంద్రగుప్తుఁడు దెలిపిన మరి యొక విషయము. ఈ కోర్కెలన్నిటిని శకరాజు మన్నించెను. చంద్రగుప్తుఁడా స్త్రీవేషధారియై మేనాలో నెక్కినాఁడు. ఆతనివెంట ననేక వీరులు స్త్రీవేషముల ధరించి పల్లకులలోఁ బోయిరి. మేనాలు శకరాజుయొక్క రాజధానిని దరిసినవి. ఆరాజు గృహదేవి నెదుర్కొనదలఁచి - రాజధానిని దాటి వచ్చెను. ఉత్సాహదిగ్ధుఁడైన శకరాజు గృహదేవి యెక్కిన మేనాలోనికిఁ దొంగి చూచినాఁడు. వెంటనే చంద్రగుప్తుఁడు చేతనున్న కత్తిచే వాని తల దరిగెను. మేనాలనుండి స్త్రీ వేషధారులైన మహావీరులు సరభసముగ వెలి కరుదెంచిరి. తక్కిన శకవీరులను వారు మర్దించినారు.

విజయుఁడైన చంద్రగుప్తుఁడు రాజధాని కరుదెంచెను. ఆతఁ డరుదెంచుచున్న వార్త విన్న జనుల కుత్సాహ మాగ లేదు. వారు గగనతలము బగులునట్లు జయ జయారావము

లొనర్చిరి. రామగుప్తుని సింహాసనమునుండి యీడదెరికి - చంద్రగుప్తు నభిషేకింపవలెనని బ్రహ్మాండమగు విప్లవమొకటి రేగెను. ఈ కల్లోలమున నెవఁడో రామగుప్తుని తల ఖండించినాఁడు. చంద్రగుప్తుఁడు సింహాసనమెక్కెను. చంద్రగుప్తుఁడు ధ్రువాదేవిని పరిణయమయ్యెను. అనంతర మాతఁడు సుసజ్జితమగు దన సేనతో శకక్షత్రపునిపైఁ దండెత్తినాఁడు.

## శకుల కడపటి యుద్ధము -
## శక క్షత్రపుఁడైన రుద్రసింహుని మృతి

గుజరాతు, మాళవదేశము వనసీమలయందు - శకరాజులు చంద్రగుప్తుని నెదిరించిరి. ఎదిరినచోట నంతయు - భారతీయ సైన్యములు వారి నోడింపఁ జొచ్చినవి. రణాంగణమున - విజృంభించిన చంద్రగుప్తుఁడు శకక్షత్రపుఁడైన రుద్రసింహుని శిరస్సును ఖండించివేసెను. ఈ రుద్రసింహుఁడు సత్యసింహుని కుమారుఁడు.

## శకుల సామ్రాజ్య మస్తమించెను.

దీనితో శకుల సామ్రాజ్య మస్తమించినది. వారికి లోఁబడియుండిన సింధు - కచ్ఛ - సౌరాష్ట్ర - గుజరాతు - మాళవ ప్రాంతములు స్వతంత్రము లయ్యెను. వారిని విముక్త మొనర్చినది చంద్రగుప్తుఁడే! అవి కృతజ్ఞతతో చంద్రగుప్తుని యధికారమును స్వీకరించినవి. శకులను నాశన మొనర్చి చంద్రగుప్తుఁడు వారి ముఖ్యపట్టణమైన యుజ్జయినిని బ్రవేశించినాఁడు. అపు డచట విజయోత్సవములు బ్రహ్మాండ

ముగ జరిగెను. చంద్రగుప్తునకు విక్రమాదిత్యుఁడన్న బిరుదు సంక్రమించెను. శకులను బరిమార్చి విక్రమాదిత్యుఁడు సాధించిన విజయమునకుజ్ఞాపకముగ విక్రమసంవత్సరము నెలకొన్నది. ఈ వృత్తాంత మింతకుముందే వచ్చినది. 'ఉజ్జయిని' చంద్రగుప్తునకు రెండవ రాజధాని యయ్యెను. అతఁ డచ్చటనే యుండి రాజ్యమొనర్చుచుండెను.

విక్రమాదిత్యుని విజయముచే భారతదేశమున కబ్బిన దొక యపూర్వమైన కృతార్థత. ముక్కలు చెక్కలుగ విడిపోయియున్న భారతదేశము విక్రమాదిత్యునిచే నొక ఛత్రచ్ఛాయకు గొనిరాబడెను. శకుల నణచుటకై యంతకు ముందెందరో యత్నించిరి. యౌధేయులు - మాళవులు - శాతవాహనులు - ఇంక ననేకులు, వారి నణచుటకు దాదాపు 250 సంవత్సరములు పట్టెను. చంద్రగుప్తుని పూర్వులుగూడ నీ యుద్యమమునకై ప్రయత్నించిరి. ఏకచ్ఛత్రితమగు భారతదేశమునకై కలలు గన్నారు. ఆ కలలు విక్రమాదిత్యుఁడు సత్యము గావించెను. ఇది యాతని ధన్యత.

ఈవిషయమును వివరించుచు ప్రసిద్ధ చరిత్రకారుడు "విన్ సెంట్ స్మిత్" ఈరీతి పొగడెను:

"We may feel assured that differences of a race, creed and manner supplied the Gupta Monarch with special reasons for desiring to suppress the impure foreign (మ్లేచ్ఛ) rulers of the western India. Chandragupta-Vikramaditya although tolerant of Buddhism and Jainism was himself an orthodox Hindu, especially devoted to the cult of Vishnu, and as such could not but have experienced peculiar satis-

faction in "Violently uprooting Foreign Chieftains."

కుషాణులవలెనే శకులును నామావశిష్టులైరి. శకులు వైదిక ధర్మమును స్వీకరించిరి. గీర్వాణభాషను జేపట్టిరి. భారతీయుల యాచారముల ననుసరించిరి. ఈ విషయము లన్నియు నింతకుముందే మనకు బరిచితములు. కాని - వారి కింతవరకును రాజ్యములు గొన్ని యుండెను. ఈ రాజ్యములలో వారి ప్రత్యేకత యణుమాత్రముగ భాసించుచుండినది. అదిగూడ విక్రమాదిత్యునిచే దళితమైపోయెను. రెండు మూడు తరములలో వారు కుషాణులవలెనే భారతీయులలో సమగ్రముగ నంతర్భూతమైపోయిరి.

భారతదేశమున నెందరో రాజులు పాలించి మరణించిరి. శక - కుషాణాంతకుడైన విక్రమాదిత్యుని త్యాగౌదార్యములు లోకప్రసిద్ధములై నిలచెను. ఇతనికాలమున 'ఫాహియాన్' అను చీనాయాత్రికుడు భారతదేశమునకు వచ్చినాడు. ఆతడు భారతీయు లనుభవించుచుండిన సుఖములను - వైభవములను పుష్కలమగు భాషలో వర్ణించినాడు. జనప్రియుమైన విక్రమాదిత్యుని పేరు కథలలోనికెక్కెను. ఆతని న్యాయప్రియత్వము ఆఖ్యాయికలై వెలసెను. విక్రమాదిత్యుడు రాజ్యమును ముప్పదియారు సంవత్సరములు బరిపాలించెను. ఆతడు దివంగతుడైనది క్రీ॥ శ॥ 414 వ సం॥ మధ్యమున.

కుషాణాంతకుడైన విక్రమాదిత్యుని పరాక్రమమును గవులు ముక్తకంఠములతో బాడిరి. రమణీయమైన యాతని చరిత్ర భారతేతిహాసమం దొక స్వర్ణపత్రము.

# 4

## హూణాంతకుఁడు యశోధర్ముఁడు.

ఈ పుస్తకమున నింతకుముందే - హూణులనుగూర్చి కొంత దెలిసికొంటిరి. వీరే - శక కుషాణులను బారదోలి వారి ప్రదేశము లాక్రమించి విజృంభించిరి. శక కుషాణుల బాధలచే - లోకము తల్లడిల్లెను. వీ రంతకన్నను భయంకరులు - క్రూరులు, వీరితో బాధపడినది ఏషియాఖండ మొకటేగాదు. యూరోపు ఖండమును హూణుల పాశవ కృత్యములకు గురియైనది. చీనా మొదలుకొని రోము పర్యంతమున్న - సంఘటితములై - నాగరకములైన సమస్త రాష్ట్రములును-వీరి హుంకారములచే గంపించిపోయినవి. హూణుల సంఖ్యాబలమున కంతులేదు. వీరి యాశ్వికసైన్యములు అక్కడక్కడ చెదరు చెదరుగా నుండెడివి. సమయము వచ్చినప్పుడొక్కచో గుమిగూడెడువారు.

వీరి సైన్యములు బయలుదేరునప్పుడు వేలకొలఁది స్త్రీలుగూడ హయములపై నెక్కి- ఖడ్గములును - కేడెములను త్రిప్పుకొనుచు ముందుకు దూకుచుండిరి. వారి కంటి కొక నగరము గానరారాదు. అది భస్మీపటలమైనట్లే. గ్రామములు పటాపంచలగుచుండెను. దొరకిన స్త్రీ - శిశువుల కంఠములుత్తరింపఁబడుచుండెను. వీరి యుద్ధవిహారములు పట్టపగళ్ళ యందుమాత్రమేగాదు; రాత్రులయందుగూడ వీరు శ్వాపద

ముల గుంపులవలె గ్రామములపైఁ బడుచుండిరి. పడి - వానిని సర్వనాశనము సేయుచుండిరి. స్త్రీ - పురుషుల గ్రుడ్లు బెఱుకు చుండిరి. తమచేత నఱుకబడిన నరుల కపాలములయందు - మద్యముల బోసికొని త్రావుచుండిరి. దిన దినమును వారికి జయోత్సవములే!

హూణుల రాజ్యము - చీనాదేశము నానుకొని యుండెను. అందుచే వీరితో దెబ్బతిన్నది యీ దేశమే! ప్రతి వర్షము వీరి దాడులు వారికి దప్పకుండెను. ఆ దేశ వాసులు వీరి భయంకర కృత్యములతో సతమతమై పోవు చుండిరి. వీరినుండి తమ్ము రక్షించుకొనుటెట్లను చింతయే నిరంతరము చీనాదేశస్థులను బీడించినది. ఆ భయముయొక్క ఫలమే నేఁడు వారు నిర్మించిన చీనాదేశపుగోడ. ఇదియొక యాశ్చర్యకరమైన సృష్టి. అయిన నేమి? ఇది వారి భీతికి మూర్తిమంతమైన ప్రతిరూపము.

మధ్య ఏషియా హూణుల దురాగతములచే నొకవైపు తల్లడిల్లుచుండెను. మరియొకవైపు హూణ సైన్యములు యూరోపున కెగ్రబాకెను. ఆ సైన్యనాయకుఁడు "ఆటిలా" యనువాఁడు. వీఁడు సైన్యములను సంఘటితపరచి-యేషియా నుత్తరించి - యూరోపుపైకి కత్తి ఝళిపించెను. అసంఖ్యమైన యీ యాశ్వీక సైన్యము నానావిధములుగ విశకలితమై రష్యాదేశమున బ్రవేశించి యల్లకల్లోల మొనర్చెను. కళా పీఠములు - దేవాలయములు - నగరములు - గ్రామములు, కనపడినదంతయు భస్మమై పోవుచుండెను. రష్యా నుత్తరించి యీ సైన్యములు పోలెండున బ్రవేశించినవి. దానిని నాశన

మొనర్చి పైని గదలినవి. రోమక సామ్రాజ్యముపైన బడెను. రోమకులు వీరి నడ్డగించిరి. కాని - హూణులు వారిని పడ దన్నినారు. హూణులకు విజయమున కన్నను - కిరాత కృత్యములు ముఖ్యము. వారు ప్రత్యక్ష రాక్షసులు. యూరోపు ఖండమంతయు వారిచే పరాభూతమయ్యెను. రక్తము లేరులై పారెను. యూరోపునందు హూణులు గావించిన కిరాత కృత్యములు వివరముగ దెలిసికొనవలెనన్నచో "Decline and fall of the Roman Empire" యను పుస్తకము జదువ వలయును. యూరోపుదేశమున నొక యాచరము గలదు. ఎవ డైనను పరమ దుష్టుఁడైనచో వాని నీనాఁడును హూణుఁ డందురు. మనము పిచాచమన్నట్లు. దీనిచే హూణులు యూరోపున కొనర్చిన యపకార మెంతటిదో మన మూహింప వచ్చును.

మధ్య ఏషియానుండి హూణ సైన్యముల యొక పాయ యూరోపు ఖండముపైకి దరలెనంటిమి. దాని వేరొక పాయ హిమాలయ ప్రాంతముల సంచరించుచు - నా పర్వతముల నంటియున్న శక, కుషాణుల రాజ్యముల జయించికొని భారతదేశము యొక్క వాయవ్యదిశనుండి గాంధారము - మొదలైన దేశములయందుఁ బ్రవేశించినది. వారి ఖడ్గములు చీనాను దళిత మొనర్చెను. రోమక సామ్రాజ్యమున కంతు లేని దుర్దశ నాపాదించెను. ఈ విజయోత్సాహముతో వారు మత్తులైరి. భారతమునకుఁగూడ నీయవస్థనే వారు బట్టింపఁ దలఁచినారు. వారు గాంధార ప్రాంతములు దూసికొని సింధునదీ ప్రదేశములందుఁ బారాడఁ దొడఁగిరి. కాని, నాఁడు

భారతదేశ సింహాసనమున గూర్చుండి యున్నది, వీరతా గంధము లేని ధనానందుడుగాడు - నామమాత్రమైన వాని సామ్రాజ్యముగాదు. నేడు భారత దేశమున నున్నది శక - కుషాణాంతకుడైన విక్రమాదిత్యుని సుతుడు - కుమార గుప్తుడు నేడు రాజ్యాధిపతి. అతడు క్షత్రియ కులావతం సుడు. భారతదేశమున గుప్తకాల మొక స్వర్ణయుగము. సువర్ణయుగమైన మౌర్యుల కాలమునందు - మౌర్యులలో గూడ గడపటివాడైన యశోకుడు బౌద్ధుడై యహింసకు లేనిపోని ప్రాధాన్య మొసగి శస్త్ర సన్యాస మొనర్చెను. దాని ఫలముగ భారత వీరులు - తాత్కాలికముగ దుర్బలులై పోయిరి. కుమారగుప్తుని కాలమున నట్టి యన్యాయము జరుగ లేదు. ఆతడు వైదికుడు భారతీయ సామ్రాజ్య శస్త్ర బలము నాతడు ద్విగుణీకృత మొనర్చెను. అడుగు బెట్టినచో నెల్ల స్మశానముగ మార్చుచున్న హూణుల కిరాతక కృత్య ముల నాతడు గమనింపలేకపోలేదు. వారు భారతదేశము వైపు నడచి వచ్చుచున్నదియు కుమారగుప్తునియెదలో బారాడ జొచ్చినది. అతడు సైన్యముల సమీకరింప జొచ్చెను. ఉత్సాహాదిగ్ధులైన సేనాధిపతులను జేర్చికొనెను.

## హూణుల తొలి దాడి

హూణులు గాంధార ప్రాంతములు బారాడ దొడ గిరి. వారి దురాగతమును గమనించి కుమారగుప్తుడు వారి నెదిరింప సైన్యముల బంపినాడు. వానిని నడపినవాడు స్కందగుప్తుడు. ఇతడు కుమారగుప్తుని సుతుడు. హూణు లకు సైన్యబల మధికమంటిని. అది వారి కొక పొగరు. వారు

విశృంఖలముగ భారతీయ సైన్యములపైఁ బడజొచ్చిరి. ఒక సైన్యమును జయించినదే తడవు - మరియొక యాశ్వీక సైన్యము భారతీయులను జుట్టుముట్టుచుండెను. వారు చీమలవలె నాలుగువైపుల నాక్రమించికొనుచుండిరి. ఆ సైన్యములు జచ్చినదే తడవు క్రొత్తసైన్యములు దయారుగ నెక్కి-వచ్చుచుండెను. కాని - హూణుల యీ యుద్ధతంత్రమునకు స్కందగుప్తుఁడు జలింపలేదు. అతఁడు విసుగులేక పోరాడ జొచ్చెను. వర్షానువర్షములు యుద్ధములతోఁ గడచినవి. అసంఖ్యములైన హూణుల సైన్యములు దిన దినమును క్షీణింపఁ జొచ్చినవి. ఇంతయైనను వారు గుప్త సామ్రాజ్యపు పొలిమేరల నాక్రమించికొనలేకపోయిరి. పైగా - స్కందగుప్తుఁడు విజృంభించి వానిసి వెనుకకుఁ దన్న నారంభించెను. హూణుల నాతఁడు భారతదేశపు టెల్లలను దాటిపోవువరకును వదలలేదు. ఈ పరాభవముతో హూణుల మొదలకు పెద్ద గాయము దగిలినది. మఱల నలువదియేండ్లవరకును వారికి భారతదేశమువైపు తేరిచూచుటకైనను గుండె లాగలేదు.

హూణులను వెనుకకుఁ దన్నిన సవ్యసాచి స్కందగుప్తుఁడు.

హూణులు రణకర్కశులంటిని. వారి ధాటికి పెద్దపెద్ద సామ్రాజ్యములే మన్నుదినిపోయినవి. కఠోరులైన యట్టి వారిని మహావీరుఁడు యువరాజ స్కందగుప్తుఁడు పరాభవించి వెనుకకుఁ దన్నెను. తన్ని - రాజధానికి వచ్చుచుండెను. ఈ వార్త ముందుగనే చక్రవర్తియైన కుమారగుప్తుని చెవులు సోకినది. ఇఁక నాతని యానందమున కంతులేదు. రాజధాని యందు జరగిన వేడుకలకు పారమే లేదు. వైదిక ధర్మనిష్ఠు

డైన కుమారగుప్తుఁడు యువరాజు సాధించిన ఈవిజయమునకు జ్ఞాపకముగ బ్రహ్మాండమగు నశ్వమేధయాగ మొనర్చినాఁడు.

## చక్రవర్తి కుమారగుప్తుని మృత్యువు - స్కందగుప్తుని రాజ్యపాలన.

యువరాజు హూణులపై సాధించిన యీ విజయముతో కుమారగుప్తుఁడు తన జన్మయే కృతార్థమైన ట్లెంచినాఁడు. ఆతఁడు క్రీ॥ శ॥ 455 వ వర్షమున గన్నుమూసికొనెను. తండ్రి మృతినొందిన యనంతరము సాహసాంకుఁడైన స్కంద గుప్తుఁడు సింహాసన మలంకరించెను. ఆతఁడు సాధించిన విజ యములకు లెక్కలేదు. అతని పరాక్రమములను దెలుపు గాథ లనేకములు. స్థలాభావముచే వానినన్నిటి నిట దడవుటకు వీలులేదు.

మధ్యయూరపున యుద్ధము లొనర్చుచున్న హూణు లకు నాయకుఁడు "ఆటిలా" యంటిమి. అట్లే - ఏషియా - యందు బోరుచున్న హూణసైన్యములకు "భింభిలుఁ"డను వాఁడు నేత యైనాఁడు. ఆతఁడు విశకలితములైన హూణ సైన్యముల నన్నిటిని నొకచోట సంఘటిత మొనర్చి విజృం భింప సాగెను. తా నా సైన్యములకు రాజుననియు బ్రకటించి కొనఁజొచ్చెను. భారతీయులు హూణుల కొనర్చిన యప కారము వాని మనస్సులో మెదలుచున్నది. భరతఖండము నంతయు జయించి యేలవలయునని వాని యాశ. అందుకై వాఁడు మరల భారతదేశముపైఁ బడినాఁడు. ఈ సంఘటన జరిగినది "సమ్రాట్" స్కందగుప్తుని యుత్తర వయస్సున.

## హూణుల రెండవ దండయాత్ర.

భారతదేశ వాయువ్యదిశయందు గొన్ని సైన్యము లుండెను. అవి భారతదేశ రక్షణార్థమై కుమారగుప్తునిచే నిలుపఁబడినవి. తొలితాకుననే హూణులా సైన్యముల నొకటి రెండు సారు లోడించి వెనుకకుఁ దన్నిరి. ఈవార్తలు స్కందగుప్తుని చెవుల సోకినవి. అతఁడగ్నికీలవలె మండెను. హూణుల బరాభవింపఁ దలఁచి రాజధానిని వదలి – స్కందగుప్తుఁడు పంచనదపర్యంత మెదురు నడచినాఁడు. హూణులచే పరాజితములై యనుత్సాహదిగ్ధములైన సైన్యముల కాతఁడు గ్రొత్తయుత్సాహము రేకెత్తించెను. ద్విగుణీకృతమైన సాహసముతో వారు – హూణుల నెదిరింప సిద్ధపడిరి. ఇంతలో బాటలీపుత్రమున నొక విషాదగాథ జరగెను. పాటలీపుత్రమున పురగుప్తుఁ డుండెను. వాఁడు స్కందగుప్తునకు సవతి తమ్ముఁడు. అన్న లేని యదనుజూచి – వాడు గద్దె నాక్రమించి కొన కుట్రలు బన్నెను. ఈ వార్తలు స్కందగుప్తుని చెవులఁ బడినవి. కాని – యాతఁడు వెన్కకు రాలేదు. రాష్ట్రాభిమానమునుముందు స్వార్థ మాతనికి తుచ్ఛపదార్థముగ గన్పడినది. జాగరూకుఁడై యాతఁడు మ్లేచ్ఛుల నెదిర్చి యుద్ధము లొనర్చుచునే యుండెను. తాను రణభూమిని వదలి వచ్చినచో దన సైన్యము లనుత్సాహము నందును. ఆ యవకాశమును బురస్కరించికొని హూణులు విక్రమింతురు. ఇఁక పంచనద ప్రాంతములు – ఉత్తర భారతము – హూణులచేతఁ జిక్కిపోవును. ఈ స్థితి యాతనికి హృదయవిదారక మయ్యెను. ఆ వృద్ధసామ్రాట్టు రణశిబిరములందే సైన్యముల బురికొల్పుచు

నుండెను. గాని – పాటలీపుత్రపు గొడవ బట్టించికొనలేదు. రాజన్నచో నాతఁడు.!

రాష్ట్రక్షేమమునకై స్వార్థమును దిరస్కరించిన మహామానవుఁడు – రణములయందు వెనుకంజ వేయని వీరోత్తంసుఁడు స్కందగుప్తుఁడు. క్రీ॥ శ॥ 471 వ సంవత్సరమున రణశిబిరమందే కన్నుమూసినాఁడు. రాజనఁగా నతఁడు !

## సమ్రాట్టనఁగా నెట్టివాఁడు ?

రోమక సామ్రాజ్యము – లోకమును మిరుమిట్లు గొల్పుచున్న రోజులవి. అప్పుడా దేశము నొక సమ్రాట్టేలుచుండెను. అతని పేరు వివరముగ మనకుఁ దెలియదు. ఆ రాజునుగూర్చి ఈ క్రింది కథ జెప్పెదరు. "అతఁడు రోగగ్రస్తుఁడై నాఁడట. చాల చిక్కిపోయినాఁడట ! మరణకాలము వచ్చినది. ఇంతలో నాతఁడు హఠాత్తుగ నొకనాఁడు చేత కత్తి ఝళిపించుచు నిలచికొనెను. చెంతనున్న పరివారమునకు నీ యకాండతాండవ మేమియు నర్థముగాలేదు ఇది యేమి యని యాతనిని రాజవైద్యులు ప్రశ్నించిరి. అపుడు మరణింపఁబోవుచున్న యా రాజు వారి కిట్లు జవాబు చెప్పినాఁడు: "రోమక సామ్రాజ్యాధిపతి – యితర దేశముల వారివలె సెజ్జపైఁ బొరలాడుచుఁ జావఁడు అతఁడు ధీరుఁడై నిలచి కత్తిబట్టి హుంకరించుచునే మరణించును. "A Roman Emperor must die standing" అని బదులు చెప్పెను.

స్కందగుప్తుని జీవితముగూడ నిట్టిదే. ఆతఁడు హూణులతో యుద్ధము చేయుచునే వీరోచితమైన మరణము

నందినాఁడు. అతఁడు యువరాజుగా నున్నప్పుడు శత్రువులను దోలి - రాజ్యమునకు క్షేమము నాపాదించెను. వృద్ధుఁడైన తర్వాతఁగూడ రాష్ట్రక్షేమమునే భావించి దానికొఱకే ప్రాణముల వదలెను సమస్తములైన రాజ్యవిలాసము లాతనికి హస్తగతములై యుండినవి. కాని - వాని నాతఁ డనుభవింపలేదు. అతఁడు రాజర్షియై బ్రదికెను. రాష్ట్రక్షేమమునకై జన్మమంతయుఁ దపించెను. ఆ ప్రయత్నమునకే ప్రాణముల బలి యొసఁగెను. పరులతో యుద్ధము లొనర్చునపుడాతఁ డనుభవించు కష్టములకు లెక్కలేదు. వాని నన్నిటిని స్కందగుప్తుఁడు జిఱునవ్వుతో నాహ్వానించినాఁడు. ఇదంతయు దేనికి ? విశాలమైన సామ్రాజ్యముయొక్క స్వాతంత్ర్యమును రక్షించుటకు. అతఁడు మరణించిన దెక్కడ ? రాజప్రసాదమున గాదు. అదీ రాచరిక మన్నచో !! హూణులు ఏ ఏబది సంవత్సరములలో చీనా దేశమును నాశన మొనర్చి రష్యానుంచి రోమువరకు సామ్రాజ్యముల నాక్రమించిరో ఆ ఏబది సంవత్సరములలో సింధునదీప్రాంతములలో ఒక్కయంగుళపు మేరయైనను ఆక్రమింపలేకపోవుటకు స్కందగుప్తుని భారతీయ సైన్య ప్రతాపమే కారణము. స్కందగుప్తుఁ డాహవసవ్యసాచి - ఆతని నామము హూణులకుఁ బలాయన మంత్రము. హూణుల పరాక్రమమునకు యూరోపు కంపించిపోయెను. ఏషియా గజగజ లాడెను. కాని - భారతము వారిని వెన్కకుఁ దన్ని నిలచినది. అయిన నేమి ? విధి - స్కందగుప్తునిపై గిల్లకన్ను వేసినది. హూణులు సమూలముగ నాశన మగుటకుముందే స్కందగుప్తుఁడు గతిం

చెను. కాని, స్కందగుప్తుని జీవితము భారత వీరుల కొక గుణ పాఠమైనది. హైందవుల పరితాప మజేయ మన్న విశ్వాసమును వారిలో స్కందగుప్తుని జీవితము నిర్మించెను.

సమ్రాట్టు స్కందగుప్తుడు వీరులలో నగ్రగణ్యుడు. అతడు విక్రమాదిత్యునివంటి దిగ్విజయి. భారతీయుల యశో డిండిమమును దిక్కులకు మ్రోగించిన రణదోహలుడు. అతని వీర జీవితమునకు మా వినయపూర్వక శ్రద్ధాంజలి.

## స్కందగుప్తుని మృత్యువు తరువాత.

పురగుప్తుఁ డింతకుముందే విజృంభించియుండెనని చెప్పితిమి. వాఁడు కుటిలుఁడు. పురగుప్తుడు గద్దె నాక్రమించెను. కాని - వాఁ డెట్లును సమర్థుఁడుగాఁడు. స్కందగుప్తుని మరణము హూణులపాలికిఁ బండుగయ్యెను. అతఁడు బ్రతికి యున్నంతవరకు వా రాతని పరాక్రమముతో గజగజ లాడుచుండిరి. అతఁడు మరణించినదే తడవు 'భింభిలుఁడు' ముందుకు గదలినాఁడు. కొంతకాలమున కాతఁడును మరణించెను. అతని యనంతరము రాజ్యమునకు వచ్చినవాఁడు 'తోరమాణుఁడు.' ఇతని కాలమున హూణు లింకను విజృంభించిరి. వారి యత్యాచారములకు మేరలు లేకపోయినవి. కాంభోజ - గాంధార - పంచనద ప్రాంతములలోఁ బడి హూణులు దోచుకొన నారంభించినారు. జగత్ప్రఖ్యాతమైన 'తక్షశిల' యందలి విద్యాపీఠము విధ్వంసమైనది. అంతకంటెను నమూల్యములైన యనేక గ్రంథములు భస్మీపటలములై పోయెను. రాష్ట్రీయమైన శస్త్రబలము తేజోహీనమైనదే తడవు - భార

తీయుల సంస్కృతిగూడ యవమానింపఁ బడెను. ఈ విష యము నిరూపించు సంఘటనము లప్పుడు జరగెను.

హూణులు 'యిరాను'పైఁ బడిరి. అది వారికి పాదా క్రాంతమైనది. క్రీ॥ శ॥ 484 వ సం॥మున 'ఇరాను' రాజైన- ఫిరోజు జీవగ్రాహముగ గొనఁబడెను. అతనిని హూణులు సంహరించిరి. ఇరాను సమస్య పరిష్కరింపఁబడినదే తడవు - హూణ సైన్యముల దృష్టి భారతదేశముపైఁ బడినది. దీనికిని ఇరానునకు బట్టిన గతినే బట్టింపవలెనని వారి యాశ. తోర మాణుఁడు భారతదేశముపైఁ గదలెను. తోరమాణుఁడు - 511 సం॥ ప్రాంతములలో పంచనదమును ప్రవేశించి- మాళవ మును ద్రొక్కి - ఉజ్జయిని నాక్రమించికొన్నాఁడు. ఇంతలో తోరమాణుఁడు మరణించెను. అతని పుత్రుఁడు 'మిహిరగులు' నామధేయుఁడు. ఇతఁడు తండ్రికంటెను క్రూరుఁడు, ధీరుఁడు.

## మిహిరగులుఁడు రుద్రదేవతోపాసకుఁ డైనాఁడు

హూణులు భారతదేశ వాయవ్య ప్రాంతములందు దిరుగాడఁ జొచ్చినది మొదలు - వైదిక ధర్మమునందలి రుద్రదేవతోపాసన వారి హృదయముల నెక్కువగా నాక ర్షింపఁ దొడఁగెను. ఇది యొక యాశ్చర్యకరమైన సంఘట నమే! బౌద్ధధర్మమును హూణులు మొదటినుండియు ద్వేషిం చిరి. వారి చిత్తవృత్తులకు దానిస్వభావము నచ్చలేదు. కనుక మిహిరగులుఁడు వైదికుఁ డగుటలో నాశ్చర్యము లేదు. మిహిరగులుఁడు బౌద్ధమును ద్వేషింప నారంభించెను. ఈ విషయమునుగూర్చి 'విన్సెంట్ స్మిత్' ఇట్లు పలికెను:-

"The savage invader who worshipped as his patron deity Shiva, the God of destruction exhibited ferocious hostility against the Peaceful Budhistic cult and remorselessly overthrew their Stupas and Monasteries which he plundered of their treasuries"

## వైదికుల రాష్ట్రాభిమానము - బౌద్ధుల రాష్ట్రద్రోహము

ఈ పుస్తకమునం దింతకుముందే వైదిక రాష్ట్రాభిమానమును ప్రకటించుకొను కొన్ని ఘట్టములు చదివితిమి. బౌద్ధులొనర్చిన రాష్ట్రవిద్రోహాచర్యలుగూడ చదువఁబడినవి. ఆ ఘట్టము నొకసారి మరల జరుపవలెనని కోరెదము. వైదికుల రాష్ట్రాభిమానమును సూచించుటకును, బౌద్ధుల రాష్ట్రవిద్రోహాచర్యలను సూచించుటకును మిహిరగులుని జీవితకథ యొక ప్రబలమైన యుదాహరణము.

మిహిరగులుఁడు వైదికుఁ డంటిమి. అతఁడు రుద్రదేవతోపాసకుఁడు. వైదికులను బౌద్ధులు ద్వేషించెదరు కాన మిహిరగులుఁడును బౌద్ధులపై కక్షసాధింప మొదలు పెట్టినాఁడు. కాని-మిహిరగులుని యీ ప్రవర్తనతో వైదికులు సంతృప్తులుగాలేదు. వాఁడు వైదికుఁడైనను, బౌద్ధుఁడైనను-భారతీయుడు గాఁడన్న దృఢవిశ్వాసము వారి హృదయములలో బాదుకొనిపోయినది. అందుచే వా రాతని రాచఱికమును మన్నింపరైరి. వాఁడు బౌద్ధులపైన సాధించిన కక్షలలో భారతీయులైన వైదికు లంతగా చేతులు గలుపలేదు. రాజకీయ దృష్టితో మిహిరగులుఁడు పరదేశమువాఁడన్న భావము

భారత వైదికుల హృదయమును వదలిపోయినది గాదు. మిహిరగులుని చేతులలోఁ జిక్కిన దేశమును విముక్త మొనర్చుటకై వైదికు లెంతయో శ్రమించిరి. వారితో వైరమును గట్టికొనిరి. వైదికులలో రాష్ట్రవిద్రోహులు బొత్తిగా లేరని మా యభిప్రాయముగాదు. 'కంబుజుఁడు' 'జయచంద్రుఁడు'- వీరివంటివారు, అప్పుడప్పుడు బయలుదేరుచునే యుండిరి. కాని-వైయ్యక్తికముగను,నొకరిద్దరి మాట యెట్లున్నను-వైదిక సముదాయముమాత్ర మిట్టి మ్లేచ్ఛరాజులయొక్క యధికారమును మన్నింపనేలేదు. వారిపై పగను సాధించుచునే వచ్చినది. తమస్వాతంత్ర్య రక్షణార్థమై భయంకరములైన యుద్ధము లెన్నో జేయుచు వచ్చినది. వైదిక సంప్రదాయస్థుల యీ రాష్ట్రాభిమానము విన్సెంట్ స్మిత్ వంటి చరిత్రకారుని పొగడ్తలకుఁగూడ దగినదై యుండెను. విన్సెంట్ స్మిత్ భారతీయుల పరాక్రమాదులను వర్ణించుపట్టులందు కొంత కొంత వ్యంగ్యముగ, వికటముగ వ్రాయును. అట్టివాఁడును "వైదిక ధర్మీయులైన హిందువులు మ్లేచ్ఛరాజుల పాలనమును మన్నింపలేదు. వారు తిరుగఁబడి శాత్రవమును సాధించిరి." అను మాటలను మాటిమాటికిని వ్రాయును. వ్రాయకుండుట కాతనికి విధిలేదు. సాధారణముగ నిట్టి పట్టులలో నాతని భావ యిట్టిది:—

"These foreign tribes Shakas, Pahlavas and Yavanas at the time settled in western India as the lords of a conquered native population were the objects of hostility of the Vaidik king Vilivayankur II......................He recovered the

losses which his kingdom had suffered at the hands of the intruding foreigners and utterly destroyed the power of (the Saka king) Nahpan. The hostility of the Andra (Vaidik) monarch was stimulated by the disguest felt by all Hindus, and especially by the followers of the orthodox Bramhanical system at the outlandish foreign barbarians."

పై మాటలనుబట్టి జూచినప్పుడు పరదేశీయులకు ప్రధాన శత్రువులు హిందువులే ననుట - ఆతని వాక్యములలో స్పష్టముగ భాసించుచునే యున్నదికదా !

## యశోధర్ముఁడు

మగధ సింహాసనమును పురగుప్తుఁ డధిష్ఠించెనంటిమి. వాని - స్వరూప స్వభావము లెట్టివో వివరించితిమి మాండలికు లెవ్వరును పురగుప్తుని యాధిపత్యమును మన్నింపలేదు. సామంతు లనేకులు స్వతంత్రులై స్వరాష్ట్రముల పాలించికొన జొచ్చిరి. వీరందరును దమలో తాము సుసంఘటితములైనవారు గారు. ఇట్టి రాజ్యములు మాళవదేశ పర్యంతము వ్యాపించియుండెను. వీరందరికిని హూణులనుండి భయము గద్దు. ఉజ్జయిని యందలి విక్రమాదిత్యుఁ డధిష్ఠించిన సింహాసనమందు మిహిరగులునివంటివారు గూర్చుండి రాజ్యమేలుచుండుట వారందరి కసహ్యముగనే యుండెను అందరును హూణుల పరాభవమును గోరుచునే యుండిరి. కాని-వారికెవ్వరికిని స్వతంత్రముగ హూణరాజు నెదిరించు శక్తి లేకుండెను. సామంతులు లోలోన గుములుచుండిరి.

ఈ సమస్యను బరిష్కరించుట కొక మహాపురుషుఁడు ముందుకు వచ్చెను. అతని వంశ మతనికిముందు ప్రసిద్ధమైన దియు గాదు. అతఁడొక్క మహారాజును గాడు. మాళవ ప్రాంతములందలి యొక చిన్నరాష్ట్రమున కాతఁడు రాజు. కాని-యాతని మహత్వాకాంక్ష దొడ్డది. రాష్ట్రాభిమానము నిస్సీమమైనది. సాహసము ఎల్లలు లేనిది. ఉజ్జయినీ సింహాసనమును మిహిరగులుఁ డధిష్ఠించుట యాతనికి గంటకమైనది. మిహిరగులుని సాధింప నాతఁడు బట్టువట్టెను. ఆ మహావీరుని పేరు యశోధర్ముఁడు.

## వైదిక రాలజుపై సన్నాహములు.

యశోధర్ముఁడు తనకుఁ జుట్టుప్రక్కల నున్న మాండలికులతో సంభాషణములు సాగించెను. వారి నందరిని హూణులపైకిఁ బురికొల్పి సాహసమును నూరిపోసినాఁడు. అతని యభిప్రాయమున కందరును సమ్మతించిరి. ఈ సంయుక్తమైన యుద్ధసన్నాహమునకు మగధరాజు బాలాదిత్యుఁడును సమ్మతించినాఁడు. సుసంఘటితములైన యీ సైన్యములకు యశోధర్ముఁడు నాయకుఁడైనాఁడు. ఆ సైన్యములు హూణులను నాల్గుదిక్కుల జుట్టుముట్టెను. వైదికుల సైన్యములు తెరలు తెరలై కలిసికొనెను.

## హూణుల పరాభవము – మిహిరగులుని జీవగ్రాహము

ఎదిరినచోట నంతయు హూణులకుఁ బరాభవము దప్పలేదు. యశోధర్ముఁడు మిహిరగులుని మూలబలములపై సైన్యమును నడపినాఁడు. ఈ సంఘటనలు సుమారు క్రీ॥ శ॥

528-వ వర్షమునందు మందోసరయందు జరిగినవి. ఈ మహా యుద్ధమునందు హూణుల కీర్తిస్థంభము పడిపోయినది. మిహిరగులునివంటి పరాక్రమశాలి యశోధర్మునకు బందీగాఁ జిక్కెను. యశోధర్ముని కీర్తి ఘోషణము నాల్గుదిక్కుల యందును జెలరేగినది. నాటి భారతవర్షమంతయు యశోధర్ముని పరాక్రమమును కథలుగా నల్లి పాడెను. "మిహిరగులుని తలదరుగుఁడని పరాక్రమి యగు యశోధర్ముఁడు భటుల కాజ్ఞ యొసఁగెను.

## బాలాదిత్యుని రాష్ట్రఘాతుకమైన యుదాత్తత.

మిహిరగులుని జంపుటకై యశోధర్ముఁడు భటుల కాజ్ఞ యొసఁగెనని బాలాదిత్యునికిఁ దెలిసినది. అతఁడు యశోధర్ముని యాజ్ఞను మన్నింపవలదని భటులను మందలించినాఁడు. మిహిరగులునిఁ దనకు స్వాధీనమొనర్ప వలసినదని బాలాదిత్యుఁడు యశోధర్మ నాదేశించినాఁడు. మగధ చక్రవర్తి యాజ్ఞను యశోధర్ముఁడు మన్నించినాఁడు. అతఁడు మిహిరగులుని బాలాదిత్యునకు స్వాధీనపరచెను. మిహిరగులునకుఁ బ్రాణరక్షణ మొనర్చి - యాతనినుండి యేదైన స్వప్రయోజనమును సాధించుకొనుటకు బాలాదిత్యుఁ డెత్తు వేసెనేమో మనకుఁ దెలియదు. లేక - యాతని ధర్మచాపల్యమే యీ కృత్యమునకుఁ గారణమయ్యెనో యదియును నిర్ణయింపలేము. 'ధర్మదృష్టి'యని పేరుగన్న ఈ చాపల్యము మన పూర్వరాజులను జాలమందిని నాశ మొనర్చెను. ఈకృప కడ కెదురు తిరిగి వారి ప్రాణములనే బలిగొన్నది. ఇట్టి పౌర

పాటునే యొకసారి పృథ్వీరాజు మహమ్మదుఘోరీ విషయ
మున గావించెను. దాని పరిణామమేమైనది? ఆ మహమ్మదు
ఘోరీయే మరల పృథ్వీరాజును దలఁ దరగినాఁడు. పామునకుఁ
బాలుపోసి పెంచినచో - దాని స్వభావము మారుననుట కల్ల.
ఇట్టి పొరపాటునే నాఁడు బాలాదిత్యుఁ డొనర్చెను. అతఁడు
మిహిరగులునకు జీవదానమొనర్చినాఁడు. అంతేగాదు. బాలా
దిత్యుఁ డాతని నెంతయో గౌరవించెను. గౌరవించి - భారత
దేశమునకు వాయువ్యదిశయందున్న హూణరాజ్యముల పొలి
మేరలవరకు నాతని సాఁగనంపినాఁడు. మిహిరగులుఁడు
తిన్నగా కాశ్మీరమును జేరెను. చేరి - యచటి హూణసైన్య
ములను సంఘటితమొనర్చినాఁడు. వెంటనే యాతని కూట
నీతు లారంభమయ్యెను. హూణసైన్యముల సాయముతో
నాతఁడు కాశ్మీరరాజును వధించినాఁడు. గాంధారమును
జయించెను. ఆ ప్రజల నాతఁ డెంతయో బాధించెను. ముఖ్య
ముగ నాతఁడు వేధించినది బౌద్ధులను. వారి ధర్మసంస్థల
నన్నిటి నాతఁడు మట్టిలో గలిపెను. అనేకుల శిరస్సులను
ఖండించెను. "శస్త్ర విజయము కంటెను ధర్మవిజయమే
గొప్పది" యని దీర్ఘోపన్యాసము లొనర్చు బౌద్ధులనోటికి
గడియలు పడినవి. మిహిరగులుని జన్మ వారికి గుణపాఠమును
నేర్పుటకే యుద్దేశింపఁ బడిన ట్లయ్యెను. మిహిరగులుని
యుత్పాతముల నణఁచుటకు బౌద్ధుల కేయుపాయమును దోచి
నదిగాదు. వా రాతనిపై పింత వింత కథలల్లిరి. దుర్బలు
లొనర్చు పని యింతే. వారికి ప్రతీకారదక్షత యుండదు.
ద్వేషము చావదు. వా రేవేవో కథలల్లి మానసిక తృప్తి

పడుచుందురు. వారల్లిన యుత్ప్రేక్షలలో నీక్రిందిది యొకటి. "హూణ రాక్షసుఁడైన మిహిరగులుఁడు దానొనర్చిన యపరాధములకు ఫలితముగ ననంత నరక యాతనల ననుభవించినాఁడు. ఆ యాతనలు మహాఘోరములై యుండెను. వానికి భూమి గదలినది ప్రళయకాలమునందువలె పర్జన్యుఁడు ఘోషించెను. పశుపక్ష్యాదులు సంతాపముతో నెలుగెత్తి యఱచినవి. ఇంకను జరిగిన యుత్పాతము లనేకములు." ఇట్టి యుత్ప్రేక్షలతో నేసమస్యయు బరిష్కరింపఁ బడదు. వాఁ డేమో బౌద్ధులపై భయంకరముగ విజృంభించెను. దానికి ప్రతీకారముగ బౌద్ధులు మిహిరగులునిపై కట్టుకథ లల్లి కాల్పనికముగ బగదీర్చికొనిరి. మిహిరగులు డొనర్చిన కార్యము ప్రత్యక్షఫలము. బౌద్ధులు వ్రాసినట్లు వాఁ డనుభవించిన శిక్షలు సత్యములో, యసత్యములో బ్రదికిన మనుష్యుఁ డెవ్వఁడును జెప్పలేదు.

## ఉజ్జయినియందు విజయ ప్రవేశము.

మిహిరగులు నోడించి యశోధర్ముఁడు పంచనద ప్రాంతముల నన్నిటిని విముక్త మొనరించినాఁడు. ఆ కోటల నన్నిటి నాతఁడు జయించెను. జయించిన చోటులన్నిట స్థిరమైనరాజ్య వ్యవస్థల నేర్పరచెను. విజయోత్సాహముగల యశోధర్ముఁడు మాళవములఁ బ్రవేశించెను. విక్రమాదిత్యునికాలమునుండియు భారతీయులకు రాజధానియై - హూణుల యత్యాచారములతోఁ గాంతిని గోల్పోయిన 'యుజ్జయినీ' నగరము నాతఁడు విజయోత్సాహముతో బ్రవేశించినాఁడు. నాఁటినుండి యశోధర్మ 'మహారాజాధిరాజ'య్యెను. హూణులపై దాను

సాధించిన విజయమునకు గుర్తుగ రెండు కీర్తిస్థంభముల నాటించినాఁడు. అవి నేటికిని గలవు. ఆకీర్తిస్థంభములు నాటి భారతీయుల విజయోత్సాహమునకు గుర్తు. భారత చరిత్రలో ధ్రువనక్షత్రములు.

## తరువాత నేమైనది ?

తరువాత నేమైనది?. యవన, శక, కుషాణ, పార్థియ నాదులు ఆక్రామకులై భారతదేశమునకు వచ్చిరి. వచ్చి, కడకు - భారతీయులలో నైక్యమై పోయిరి. క్రీ॥ శ॥ 540 వ ప్రాంతమందు - మిహిరగులుని యాజమాన్యమున మహోత్తరముగ మెఱసిపోయిన హూణుల సముదాయము సింధునది కావలనున్న వాయవ్యభాగమందే యొకటి రెండు తరములలో నష్టమై పోయెను. మిహిరగులుని బారద్రోలి స్వాతంత్ర్యమును సంపాదించుకొన్న వైదిక ధర్మీయులైన హిందూజాతి హిందూకుశ పర్వతములవఱకును స్వతంత్రమై మరల రాజ్య మేలికొననారంభించెను. భారతీయ స్వాతంత్ర్యమును బొందినది కేవల వాగ్బలముతో గాదు. మరి- శస్త్రబలముతో. ఈ సందర్భమున డా॥ జయస్వాల్ యిట్లు పలికెను:—
" The Huns were fully Crushed within a century by the Successive (Hindu) dynasties" హిందూరాష్ట్రములతో సుమారొక శతాబ్దము పోరాడిన హూణజాతి లుప్తమైపోయినది. క్రమక్రమముగా వారి సంఖ్యాబలమును నశించెను. మిగిలిన యల్పసంఖ్యాకులైన హూణులు భారతీయుల ధర్మము, భాష, యాచారము, వీని ననుసరించి, యొకటి రెండు తరములలోనే భారతీయులలో

సంపూర్ణముగ గలసిపోయిరి. వారి స్వధర్మము వారిలో మందునకును మిగులలేదు.

హూణులపైన భారతీయులు రణభూమియందు సాధించిన యీ విజయముయొక్క ఫలమేమైనది ? విన్సెంట్ స్మిత్ యిట్లు వ్రాయుచున్నాడు: "After the defeat of Mihiragul and the extinction of the Hun power on the oxus India enjoyed immunity from foreign attack for nearly five centuries" అనఁగా మిహిరగులుని యశోధర్మ పరాభవించిన యనంతరము హూణుల రాజ్యాధికారము, భారతదేశమున దొంగిచూడనే లేదు. వారు - హిందూకుశపర్వతముల కావైపుననే నిలచిపోయిరి. తరువాత సుమారు - 500॥ సం॥ములు భారతదేశమంతయు స్వతంత్రమై - సర్వసుఖముల ననుభవించినది. పారియాత్ర పర్వతములనుండి - గాంధార - కాశ్మీర, దేశముల గూడగట్టుకొని కన్యాకుమారిపర్యంతము ఒక్కటే వైదికధర్మము; ఒకటే భారతీయమైన నిష్ఠ.

## ఐతిహాసిక ప్రాచీనఖండ సమారోపము

క్రీ॥ పూ॥ 600 సం॥ ములనుండి క్రీ॥ అనంతరము 700 సం॥ ముల పర్యంతము అనఁగా - సుమారు 1300 సంవత్సరముల కాలమును ఐతిహాసిక 'ప్రాచీనఖండ' మందుము. అటుతరువాతి కాలమును 'అర్వాచీనఖండ' మందుము. ఇట్లు విభాగమును జేసికొన్నచో నైతిహాసిక ప్రాచీనఖండము నందలి విషయములన్నియు సమగ్రముగ నిందు జేర్పవలసియుండెను. కాని - యీగ్రంథము సామాన్య జనమునకు

విద్యార్థి సముదాయమును దృష్టిలోనుంచికొని వ్రాసినది. అందుచే నన్నివిషయములను సమగ్రముగ వివరించుటకు సాధ్యముగాలేదు. కొన్నికొన్ని ముఖ్యములైనవానిని దడవుచు బోతిని, వాని సార మిది.

(1) ఐతిహాసిక ప్రాచీనఖండమం దేజాతిగాని సంపూర్ణ భారతదేశమును జయించి యుండలేదు. నాటి భారతీయుల పరాక్రమ మజేయమై యుండెను. ఈ వాస్తవస్థితిని సామాన్యుల దృష్టికి దెచ్చుటయే మా సంకల్పము. అనేక చరిత్రకారులు భారతచరిత్ర నవకతవకలుగ వ్రాసిరి. వారు దమగ్రంథములలో "భారతదేశముపైకి యలెగ్జాండరు దండయాత్ర" "భారతముపై శకుల దండయాత్ర" యని గొప్పగొప్ప శీర్షికలిచ్చి వ్రాయుదురు. ఇట్లు వ్రాయుటతో స్వదేశీయులు, పరదేశీయులునగు గొందఱు - వాస్తవమును గమనింపనేరక సంపూర్ణ భారతదేశము విదేశీయుల వశమైనదను కట్టుకథల నమ్మట కారంభించిరి. ఈ విపరీతజ్ఞానమును మాయించి, సత్యమును దెల్పుట మా ప్రధానాశయము. ఐతిహాసిక ప్రాచీనఖండమున నేపరదేశసైన్యముగాని - సంపూర్ణ భారతదేశ స్వాతంత్ర్యమును లుప్తమొనర్చి - దానిపై యాధిపత్యమును వహించి యేలినది లేదు. కాని - చాలమంది చరిత్రకారు లీవిషయమును మభ్యపరచిరి. మనకు హితశత్రువులైన యాంగ్లేయచరిత్రకారులు మన ప్రాచీనభారత చరిత్రకు దుర్వ్యాఖ్యానము లొనర్చిరి. వారి వ్రాతలనుబట్టి చూచినచో మన ప్రాచీన దేశచరిత్రయంతయు నొకచే దాస్య చరిత్ర. సర్వులు మనలను జయించిన వారేగాని -

మన మెవ్వరిసి గాని జయింపలేదు. ఇది చాల మూర్ఖమైన యారోపణ. అహేతుకమైన దుర్వ్యాఖ్యానము. అర్థరహిత మైన మాత్సర్యము.

(2) నేపాళము మొదలు పూర్వసముద్ర పర్యంతము - పూర్వోత్తర భారతమంతయు - దక్షిణాపథమంతయు - ననఁగా నించుమించు సమస్తభారతము 1300 సం॥ ల కాలము సంపూర్ణముగ స్వతంత్రమై యుండెను. దీనిపైకి భూమార్గ మునగాని - జలమార్గమునగాని యేజాతియు దండెత్తివచ్చి కాలు నిలువఁద్రొక్కికొన్నది లేదు.

(3) మిగిలిన పశ్చిమోత్తర భాగమునందుమాత్రమే యొక్కడక్కడ చెదరుగాఁ గొన్ని పరకీయ రాష్ట్రము లుండెను. ఈ భాగమున విదేశీయులు పంచనదమునుండి యయోధ్యపర్యంత మాక్రమించికొని యుండిరి. పంజాబు నుండి గుజరాతు పర్యంతము - శక - కుషాణులు గెలిచి స్వతంత్రులై యుండిరి. హూణులు పంచనదము నుండి యుజ్జయినీ పర్యంతము చెదరు చెదరుగ నాక్రమించిరి. కాని- వీరందరు కడకు భారతీయులచే విజితులైరి.

(4) ఈకాలమున 'యేషియా' 'యూరోపు' మొదలగు దేశములలో నుండిన రాష్ట్రములు పరకీయుల పాద ముద్రల క్రింద సతమతమై పోవుచుండెను. కాని భారత రాష్ట్రములు మాత్రము స్వతంత్రములై నిలిచి తమ యస్తి త్వమును నిరూపించికొన్నవి.

(5) ప్రాచీన కాలమున దండెత్తిన యవనులు, కుషా ణులు, హూణులు మొదలైనవారొక భారత దేశముపైకి

మాత్రమే గాదు వచ్చినది. వారు జగత్తునంతయు గలవర పరచిరి. ఆ జాతుల క్రూరతలో గొన్ని రాష్ట్రములు రూపు మాసిపోయెను. భారతదేశముపై వారి యాటలు సాగలేదు. వారే భారతీయులలో నైక్యమై పోయినారు.

(6) హిందూరాష్ట్రములను గూడ నామశేష మొన ర్చుటకై వారు ప్రయత్నించిరి. కాని - వారి శస్త్రబలము - సంఖ్యాబలము వైదిక ధర్మీయుల పరాక్రమముకెదుట తునా తునకలైనవి. వారిని రణాంగణమున భారతీయు లోడించిరి. తరువాత వారి సంస్కృతిని గూడ - లొంగదీసికొని భారత జాతియందు వారి నైక్యమొనర్చికొన్నారు. వారి నామ ములుగూడ మిగులలేదు.

ఒకక్షణకాల మిట్లు యోచింతముగాక! ఒకానొక దేవపురుషుడు ప్రాచీనకాలఖండమున ఈ భూమిని చూచి తరువాత కాలమెరుగక ప్రస్తుతము హిమాలయ శిఖరముపై నిలబడి భారతదేశమును గమనించిన ఆతని భావపరంపర యెట్లుండును? ఇట్లుండును. "ఒకానొకనాఁడీ హిందూస్థాన మున నొక కోణమున గ్రీకులు రాజ్యములు నిర్మించికొని యేలుచుండిరి. నేఁ డా యవనుఁ డొక్కఁడును గనపడడే? నిజము! యవనుఁ డొక్కఁడును గనపడఁడు." మరల నా దేవ పురుషుఁ డాలోచించును "ఈ హిందూదేశమున మరల నొక భాగమున శక-కుషాణుల రాజ్యము లుండెను. నేఁ డవి లేవు". నిజము నిజము! ఈనాఁడు నేను శకుఁడను, నేను కుషాణుఁడ నని చెప్పుకొను మనుష్యుఁ డొక్కఁడుగాని భారతదేశమున లేడు.

ఆ దేవదూత మరల నిట్లు ప్రశ్నించికొనె ననుకొందము. "ప్రాచీనకాలమున లోకభయంకరులైన హూణులను నొక జాతి యీ దేశమున కల్లోలమును రేపుచు నుజ్జయినీపర్యంత మాక్రమించికొనెను. ఆ హూణులలో నేఁ డొక్కఁడును మిగులలేదు." ఎదపై జేయివైచికొని 'నేను హూణుఁడ' నని పల్కువాఁ డెవ్వఁడను భారతదేశమున మిగులలేదు.

వారంద రేమైరి ? హిందువులలో గలసిపోయినారు. యవన, శక, హూణాదులైన యాక్రామకులతోఁ బోరి పోరి తమ స్వాతంత్ర్యమును నిలిపికొన్న హిందూజాతి నేటికిని సమగ్రమై - సర్వనదీ సముదాయమును లీనమొనర్చుకొన్న మహాసాగరమువలె భాసించుచున్నది. నేఁడు భారతదేశమున మిగిలిన జాతి హిందూజాతియే !.

ప్రాచీనకాలఖండమున భారతదేశ ప్రతిభ నిలిపిన యశఃకాయుఁడు యశోధర్ముఁడు. అతఁడు రూపుగట్టిన పరాక్రమము; రాచఱికము పండించిన రాజు.

—♦—